కోమలాకార! జో! జో! నిఖిలారి భీమదోర్దండ! జో! జో!
తామరసనయన! జో! జో! కామినీకామావతార! జో! జో!
లాలినిద్దురపోవురా! నాయన్న యేలనీవేడ్చెదవురా?
మాలిమిమెఱయవచ్చి నాచన్నుఁ బాలుత్రాగుదువులేరా!

(అని బిడ్డని నెత్తికొనఁగా బిడ్డఁ డేడ్పు చాలించి నవ్వుచు కేకలు వెట్టుచుండఁగా చూచి) వీఁ డేసుమ్మా! వీఁ డసాధ్యుఁడుగా నున్నాఁడు. అఱకడఁ బెట్టుకొనఁగానే నవ్వుచున్నాఁడు. నేల విడిచి నంతట నేడ్చుచున్నాఁడు. నాతండ్రీ! నా యనుఁగు బిడ్డా! నా ముద్దుపట్టీ! నా బంగారుకొండా! నా చిన్నినాయనా! (అని పలు తెఱఁగుల ముద్దులాడుచుండును).

కంచుకి:—(ప్రవేశించి) దేవిగారు! మంత్రిగారును, సర్వానందులు గారును విజయముచేసి తమయాజ్ఞకు వేచియున్నారు.

సర్వం:—చాల సంతోషము. రమ్మను.

మంత్రి - సర్వా:— (ప్రవేశించి) మహారాణిగారికి సర్వసత్ప్రార్థనలు సంసిద్ధి నొందుఁగాత! కుశలమా?

సర్వం:—తమబోఁటిమహనీయుల యనుగ్రహ ముండఁగా కుశలమున కేమికొఱంత?

సర్వా:—(ఆత్మగతముగ) ఇఁక నే చూడవలెను.

సర్వం:—దయచేసి కూర్చుండవలెను. (ఇద్దఱును కూర్చుండఁగా) నిన్నటి రాత్రి నేనొక కలగంటిని. అది చిత్రవిచిత్రముగ నుండెను.

మంత్రి-సర్వా:—దయచేసి సెల వివ్వవలెను.

సర్వం:—మాచిరంజీవి విజయుఁడును నేనును ఏదో యొకవిదేశమును గూర్చి పోయి, అచ్చటినుండి వాఁడు రమారమి పదియాఱేండ్ల వయస్సువాఁడు కాఁగానే స్థానాంతరమునకుఁ బోయి, అక్కడఁ బెక్కుసాహసకృత్యములను చేసి, అశ్రుతదృష్టపూర్వములును



అప్రమేయములును, అద్భుతములును నగు కొన్నిరత్నములను కొనివచ్చెను. తదనంతరము కొంతవడికి మనుష్యసంచారములేని యొకానొకప్రదేశమునకు మరలఁ జని, అచ్చట పడరానిపాట్లు పడి, సుదుర్ఘటము లగు పెక్కుకార్యములు సాధించి, పిదప సుఖముగా తనయిల్లు చేరెను. ఇది నాకలయొక్క రూపు.

సర్వా:—ఇవన్నియు తోడ్తో జరుగఁబోవును కాఁబోలు! ఈబిడ్డఁడు గొప్పసాహసి గాన నప్సరస్త్రీరత్నములను బట్టుకొనివచ్చునేమో!

మంత్రి:—స్వప్నావస్థయందు జరుగువ్యాపారములు విశ్వాసపాత్రము లగునా? అవన్నియు పైత్యవికృతిఫలములు.

సర్వం:—అట్లనరాదని తోఁచుచున్నది. కొన్నివేళలలో స్వప్నావస్థలు సైతము చరితార్థము లగుచున్నవిగదా!

సర్వా:—మహారాణిగారు సెలవిచ్చునది వాస్తవమే. కాని తమకు సైత మిక్కట్లు వచ్చునా?

సర్వం:—అదేమి? తాముగూఁడ నిట్లు సెలవిచ్చుచున్నారు? సుఖదుఃఖములు కావడికుండలు. వెన్నెలకు వెనుక చీకటి సకలలోక సామాన్యమేకదా!

మంత్రి:—అయినను! తమబోఁటిసజ్జనులుసైతము వగలఁ బొగులుట చూడఁగా నిది సృష్టిలోని యొకపొరపా టని తోఁచుచున్నది.

సర్వం:—నేను పొరపాటని చెప్పను. ఏల యనిన, భగవంతుఁడు పరమకారుణికుఁ డని వేదవేదాంగము లుద్ఘోషించుచున్నవి. అయినను, ఇందులకుఁ గారణముమాత్రము నాకుఁ దెలియరాలేదు.

మంత్రి-సర్వా:—మహారాణిగారు కష్టము వచ్చునెడ నెట్టు లోర్చుకొందురో?

సర్వం:—నేనా! (కొంత ఆలోచించి) అదేమో. ఉపదేశముమాత్రము సుఖముగాని ఆచరణము కష్టమే. నేను వీరాగ్రేసరునిగర్భవాస

మునఁ బుట్టితినిగాని కష్టము రాఁగాఁ జూడవలెను. ఏమైనను స్త్రీ జాతిలోఁ జేరినదాననే కదా! నాజాతిస్వభావము తప్పునా? కాని యితరస్త్రీలకన్న ధైర్యవతిననిమాత్రము తలఁచుచున్నాను. అనుభవమునఁ జూచుకొనవలయును. నాకిప్పు డేమో కడుపులోఁ ద్రిప్పుచున్నది. కొంచెము రసాయనమును సేవించివచ్చెదను. సఖీ! వెంటరమ్ము. (అని లోపలి కిద్దఱు వెళ్లుదురు.)

సర్వా:—మంత్రిగారు! మహారాణిగారిచిత్త మెంతనిర్మలమైనదో చూచితిరా?

మంత్రి:—ఇట్టిమహాత్మురాలితో ఆక్రూరవ్యాపార మెట్లు చెప్పవచ్చును?

సర్వా:—చెప్పకున్న గతియేమి? మనము చిత్రగుప్తునివలెఁ బుట్టి యున్నారము. మనవ్యాపారము బొత్తిగా క్రూరమనియుఁ జెప్ప రాదుగదా! గొప్పప్రమాదములనుఁ దొలఁగించుటకుఁగదా యీపనికి మనము పూనుకొనియున్నాము!

మంత్రి:—ఔనౌను. తాము సెలవిచ్చినది వాస్తవమే. కొంచెము మనఃక్లేశము గలుగునని తలఁచి వెనుదీయుదుమేని యెడలేనికీడు మూఁడును. ఇంతియగాక యిఁకను మనము మసలరాదు. అర గడియకు రాజునొద్దకుఁ బోవలయును.

సర్వా:—మహారాణిగారు వచ్చినతోడనే అధైర్యమును మాని స్పష్ట ముగ మనవిచేసి యన్నియంశములుఁ బరిష్కరింపవలయును సుమా! (మహారాణి వచ్చుచున్నది.) రసాయనమును సేవించితిరా?

సర్వం:—సేవించితిని గాని నాకేమో యిట్టిదని చెప్పనలవిగాని చిత్త వికారము కలుగుచున్నది.

సర్వా:—చాలప్రొద్దుపోయెను. పోవలెను. దేవిగారు! సెలవు దయ చేయించవలయును.

సర్వం:—వర్తమాన మేదైన నున్నయెడల సెలవియ్యవచ్చునే



సర్వా:—దేవిగారు వీరాగ్రేసరుని సుపుత్రిగదా! ధైర్య మెప్పుడును విడువఁజనదు.

సర్వం:—ఇది నాకప్పుడే తగిలినది. నాసంశయము సహేతుకమే. శ్రీరాముఁ డున్నాఁడుగదా! ధైర్య మవలంబించియుండెదను. యథార్థమును దెల్పవచ్చును.

సర్వా:—అన్నిటికిని మేమున్నారము. భయమెంతమాత్రమును వలదు. దృఢముగా నమ్మవచ్చును. (అని చేరఁబోయి చెవిలో చెప్పు చున్నాఁడు.)

సర్వం:—అహాహా! నాస్వప్నము నిజమాయెనుగా! (అని మూర్ఛిల్లు చున్నది. అందఱునుఁ బరిచరించుచున్నారు.)

నిర్మల:—మహారాణిగారు! తామే యిట్లయిన మాగతి యేమి? కొంచెము తాళుకొనవలెను. తాళుకొనవలెను.

మంత్రి-సర్వా:—దేవిగారు! తాళుకొనుఁడు. తాళుకొనుఁడు.

సర్వం:—(లేచి)

రాగము-ముఖారి. తాళము-చాపు.

పల్లవి. ఇందుకాపుట్టించితి, శ్రీరామ నన్నిందుకాపుట్టించితి.

అనుపల్లవి. కందర్పకేళికిఁ గరణముగాఁజేసి
నిందలఁబడుటకై సుందరిజాతిగా. ‖ ఇందుకా ‖

చరణము. పతియే పితరులని పతియే ధనమని
పతియే దైవమని పతియే సర్వమని
వ్రతముఁబట్టిన, గర్భవతి సీతాదేవికి
గతిని గల్పించిన ఘనుఁడ వీవే కదా!. ‖ ఇందుకా ‖

మంత్రి:—దేవిగారు! నే నొకటి చేయఁదలఁచియున్నాను. అట్లు చేసిన యెడల త్వరలోనే అన్నిటిని సమకూర్పవచ్చును.

సర్వా:—దేవిగారు! చింతవలదు. ఇంతలోఁ గీడేమియు రాఁబోదు.

నిర్మల:—మహారాణివారితో నేనుగూడ వెళ్లిపోదును. వారి నెడఁబాసి యొంటిగా నొకనిమిషమైన నుండఁజాలను.

సర్వం:—స్వామీ! బిడ్డఁడు పుట్టినతోడనే మహారాజుగారు అపరిమితానందమునొంది యేమేమో చేయించిరే! ఇప్పు డేల యీ బుద్ధి? వారు స్వతహా లోకోత్తరులే?

మంత్రి:—వారికిఁ గలిగిన దృష్టిలోపమే యిందులకుఁ గారణము.

సర్వం:—ఇందులకా యింతటి క్రౌర్యము? హా! దేవ!

రాగము - ఎదుకులకాంభోజి.

అలరులకన్నను మృదువై
యలవజ్రాయుధముకన్న నతికఠినంబై
యిల లోకోత్తరులమనం
బులు వెలయును, వానిఁగానఁబోలు నెవరికిన్.

స్వామీ! నామట్టుకు నా కిసుమంతయుఁ జింత లేదు. పరబ్రహ్మమునకు సమానమై నిరపరాధియైయున్న యీశిశు వేమిచేసెను?

సర్వా:—బిడ్డని వదలిపెట్టి తమరుండఁగూడదు సుఁడీ! తమకు దెలియనియంశము కాదుగదా!

నిర్మ:—ఔను దేవిగారు! బిడ్డఁ డన్యులయొద్ద నుండఁగూడదు. ఎవ్వఁడో పరమచండాలుఁ డింతవఱకుఁ దెచ్చెనే కాని మఱేమియుఁగాదు. ఇంతటివా రెంతటిపాపమునకైనను బూనుదురు.

మంత్రి:—దేవిగారు! సఖి చెప్పినదే సరి.

సర్వం:—నిజమే. అయిన నొకరి నననేల? మనపాప మిట్లు ఫలించెను.

నిర్మల:—ఇట్టిమంచిస్వభావముగలవారికిని ఇట్టికష్టము వచ్చెనుగదా!

సర్వం:—సఖీ! ఈశిశువును ఆఘోరారణ్యమున నెట్లు కాపాడవచ్చును? (కొంచె మాలోచించి) ఈచింత లేల? "అడవి రక్షలేని యబలుండు వర్ధిల్లు, రక్షితుండు మందిరమునఁ జచ్చు."



మంత్రి-సర్వా:—దేవిగారు! విచార మెంతమాత్రమును వలదు! తమ పరువునకుఁ దగిన నగరొక్కటి నిర్మితమై సిద్ధముగ నున్నది. అన్ని కార్యములకు మే ఖిద్దరమును సదా అతిజాగ్రత్తతో కనిపెట్టుకొని యుండెదము. మమ్ము నెనరుగల తమ సేవకులమనియే నమ్మునది.

కంచుకి:—(ప్రవేశించి) మంత్రిగారు! సారథి రథమును తెచ్చి కనిపెట్టుకొనియున్నాఁడు.

సర్వం:—అన్నియుఁ బోయినతరువాత నాకు రథముగూడనా? పాదచారిణిగాఁ బోఁగూడదా?

సర్వా:—దేవిగారి కేమియు లోపము లేదు. ముందును రాదు. ఎద్దియును పోలేదు! తాము రథమెక్కియే పోవలెను. కొద్దిదినములలో నన్నియు యథాప్రకార మవును. మా మాటలు విశ్వసింపఁదగినవి.

సర్వం:—నాదారిని నేను బోయెదను. మహారాజుగారికి కన్నులు కుదుర లేదుగదా! వారి నొకసారి కంటఁజూచి పోఁగూడదా? వారిమనసు వంటిది గాదే నామనసు; మఱల వారిముఖారవిందమును జూచుట కిచ్చిపెట్టియున్నానో! (అని అర్ధోక్తిని విలపించుచున్నది).

మంత్రి:—దేవిగారు తమ కేచింతయు వలదు! ఏకొఱఁతయు రాఁబోదు. వచ్చినను మే మాపఁగలవారము. ఇపుడు రాజుగారినిఁ జూచుట లెస్సగాదు. తమక్షేమమునే కోరియున్నవారము గావున, మామన విని పథ్యముగా గ్రహించి ప్రయాణమై పదుండు. అన్నియు సిద్ధముగా నున్నవి.

సర్వం:—ఇప్పుడే తరలిపోవలెనని తమ యిష్టమా?

మంత్రి:—ఔను! ఇప్పుడే పయన మవుట లెస్స!

సర్వం:—ఆలాగా! సిద్ధముగానే యున్నాను. (అని బిడ్డను ముద్దులాడి సర్వానందునిచేత నిచ్చుచు) ఇతఁడు మీబిడ్డఁడేకాని నాబిడ్డఁడు కాఁడు.

మంత్రి-సర్వా:—(బిడ్డ నెత్తుకొని) ఈతఁడు మిక్కిలి ఖ్యాతివడయఁబోవు చున్నాఁడు. ఈతని కేవిధమయిన కొఱఁతయు రాదు.

సర్వం:—వీనిని లెస్సగ దీవించి పంపుఁడు. (బిడ్డనిఁజూచి) నాయనా! చిరంజీవీ! వీరే నీ యిలువేల్పులు.

మంత్రి-సర్వా:—మాదీవనలతోఁ బని యేమి? చిరంజీవి జన్మపత్రిక లోకోత్తరమైనది. అదియే చాలును. కుమార! సర్వవిషయము లయందును విజయుఁడవయ్యె యుందువు.

కంచుకి:—(ప్రవేశించి) ఏలినవారు మంత్రిగారిని పిలుచుచున్నారు.

మంత్రి:—దేవిగారు! మేము సెలవు పుచ్చుకొనవలెను. తామును రథ మెక్కవలెను. చింత యొక్కింతయు వలదు.

సర్వం:—అట్లే చేసెదను. నన్ను మఱువఁగూడదు. కృప యుంచవలెను. అబలనుగదా నేను!

మంత్రి-సర్వా:—తమకు దాసులమై కనిపెట్టుకొనియున్నాము.

సర్వం:—(బిడ్డ నెత్తుకొని) నాయనా! నా ముద్దులమూటా! నా బహిః ప్రాణమా! రా రా నాపట్టీ! మనతలవ్రాత యిట్టున్నదిగా! (అని సఖిని వెంటఁబెట్టుకొని రథ మెక్కఁబోవుచున్నది)

(రాగము-కల్యాణి)

మంత్రి: ఆ. కమలనాభ దేవి! కమలవాసప్రియ
కమలచరణయుగళ కమలవదన
కమలకాంతనేత్ర కమలమండితహస్త
కరుణతోను నిన్నుఁ గాచుఁగాత.

(రాగము-నాదనామక్రియ)

సర్వా:— ఆయురారోగ్య మైశ్వర్యం
విద్యావీర్యం యశోబలం
విజయంచస్థిరందీయాత్
శ్రీనివాస స్సదాతవ.

(రాగము-నాదనామక్రియ) తాళము-ఆది.

సర్వం:— అంతఃపురములోని యానందములుఁబోయి,
అడవికేగనాయెగా-అనాథగా,
శ్రీ. శ్రీనివాసదేవ శ్రితపాలక ఈ
శిశువును రక్షింపుమా శివమొసంగి.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

---

# కమలాపహరణము

## ద్వితీయాంకము—ప్రథమస్థలము.

---

(మహారాజుగారి మహలులో దర్బారుమండపము).

[మంత్రి. సర్వానందుఁడు, ఆత్మానందుఁడు, ఆసనములపైని కూర్చుండియుండ, రాజకుమారులు రాజుగారిని చేఁబట్టి తీసికొనివచ్చి ప్రవేశించుచున్నారు. అందఱు లేచినిలువఁగా రాజుగారిని సింహాసనముమీఁదను కుమారులు కూర్చుండఁబెట్టుచున్నారు.]

రాజు:—మంత్రీ!

మంత్రి:—చిత్తం దేవ.

రాజు:—సర్వానందులుగారు, ఆత్మానందులుగారు వచ్చియున్నారా?

ఆత్మా-సర్వా:—ఇదిగో వచ్చి సన్నద్ధులమై యున్నాము దేవ!

రాజు:—నేను సభకు వచ్చి యిప్పటికి రమారమి పదియాఱేండ్లాయెను గదా?

(అందఱు):—చిత్తం మహాప్రభూ! చిత్తం.

రాజు:—నా జీవితకాలములోని యింతకాలము వ్యర్థమాయెనుగదా! నేఁడును ఏదో యొకయంశము నందఱతోఁ జెప్పుకొనవలసివచ్చితిని కాని, మఱియొండు కాదు. ఎడలేని జాగ్రత్తతో వినవలెను.

(అందఱు):—చిత్తము దేవా! సిద్ధముగా కాచుకొనియున్నారము.

రాజు:—ఇటమీఁద నేను ఈలోకమునందు జీవించియుండుటచే రాఁగల ఫలమేమి? నామట్టునకీప్రపంచ ముండియు లేనట్టులే! సూర్య చంద్రాదుల యుదయాస్తమయములు నాకు లేవు. లతావృక్ష



గుల్మాదులు పుష్పఫలభరితమైయుంట నాకు లేవు. తక్కినవియు నెద్దియు,లేదుగా? రాజ్యమేమో ఉన్నది. ధనకనకవస్తువాహనములును ఉన్నవి. బిడ్డలు నున్నారు. అన్నియు నున్నవి. ఇన్ని యుండ నేమిఫలము? నాకు లోకమున నుండునది గాఢాంధకారము ఒక్కటే. నావెతల కేమందును? హా! దేవా? నేనెట్లు మనుదును?

మంత్రి:—దేవా! ధైర్యము దక్కియుండఁజనదు. మంచికాలము రాక తప్పదు. ఓర్పు మేలు.

రాజు:—మేలు కలుగవచ్చు ననుకోరిక యొక్కటి అందఱకును ఉండుటఁ బట్టియే యీలోకము నిల్చియున్నది. అది లేనినాఁడు లోకవ్యాపార మిసుమంతయు జరుగఁబోదు. అయినను, నామట్టునకు ఆకోరిక యుండియు లేనియట్లే! ఆకోరికతోనే యిన్నిదినములు సరిపుచ్చుకొంటిని. కాని యిఁక నది వెఱ్ఱితనమే! గత్యంతరము కానరాదు. ఈశ్వరా! ఇట్టిదా నీయుత్సాహము! కటకటా!

సర్వా:—(ఆత్మగతము) స్వయంకృతాపరాధమున కెవ్వ రేమిచేయవచ్చును?

మంత్రి:—దేవా! కోరిక వదలిపెట్టుట బాగుగాదు. ఎంతో దుష్కరములైన కార్యములు సైతము వేళరాఁగా నొక్కనిమిసములో సమకూరును. సర్వానందులుగా రేమేమో ప్రయత్నములుచేయుచున్నారు.

సర్వా:—(ఆత్మగతము) సర్వానందునిమాటలే విన్నయెడల నింతదూరమే వచ్చియుండదు.

రాజు:—సర్వానందులుగారు! కోరికల కాధారమేమైనను గల్పింపఁగలరా?

సర్వా:—దేవా! ఇందు వ్యాధిమాత్రమే యున్న గొప్పకాదు. ఆధియుఁ గలసియున్నదే! ఇది సిద్ధులచేతనే కావలసినపనిగా నున్నది. అయినను ఆత్మానందులవా రేమిదలఁచియున్నారో?

రాజు:—ఆత్మానందులవారూ! వింటిరా! ఇందుల కేమిచెప్పుచున్నారు?

ఆత్మా:—(ఆత్మగతము) నాపనియేమో కొనసాగినది. ఇక నెట్లయిన నాకేమి? దృష్టి చెడిపోఁగా నేమి మునిఁగిపోయినది? (ప్రకాశముగ) నాకేమియును తోఁచలేదు దేవా!

సర్వానందుఁడు-ఆత్మానందుఁడు:—(ఆత్మగతము) ఇప్పుడు తోఁచునా? ఆనుకూల్యమున కేమియును తోఁచదు. ప్రాతికూల్యమున కన్ననో, లేనివి కానివి అన్నియును తోఁచును.

రాజు:—తమవంటిమహనీయులు కృషిచేయుకున్న గతియేమిస్వామీ? ఇఁక నేమియున్నది? నాయునికి వ్యర్థము. నేఁడే ప్రాణత్యాగము చేయ నిశ్చయించియున్నాను. ఇది నాహితులతోఁ జెప్పిపోవలెననియే నేఁడు సభకువచ్చితిని.

సర్వా:—(ఆత్మగతము) ఇఁక నూరకుండరాదు. (ప్రకాశముగ) దేవీ! మనయింటి కొకసిద్ధుఁడు విజయము చేసియున్నాఁడు. ఆయన నాతో కొన్నియంశములు సెలవిచ్చియున్నాఁడు. అయినను వానిలో కొన్నిచిక్కు లున్నవి. అందులకు తెగింతుమేని అన్నియు ననుకూలమవును.

రాజు:—వారిని వేగ రప్పింపరాదా?

సర్వా:—నేను పోయి తోడ్కొనివచ్చెదను. అన్యు లెవ్వరు పిలిచినను వారు రారు.

రాజు:—అట్లైనఁ బోయిరండు. (సర్వానందుఁడు పోవుచున్నాఁడు)

మంత్రి:—దేవా! సర్వానందులుగారి ప్రయత్నము విఫలము కాదని తోఁచెడిని.

రాజు:—వారు కడుధీమంతులు. మనమేలు సర్వదా కోరుచుండువారు. కొన్నిసమయములయందు మనము వారిమాటలు వినకుంటిమి. అది వారికి మనస్తాపమును పుట్టించియుండవచ్చును.

మంత్రి:—మనస్తాప ముండునుగాని సమయమువచ్చినప్పుడు పట్టుపట్టి చూచుట అతనిస్వభావము గాదు. (అని ఆత్మానందుని క్రూరముగాఁ జూచుచున్నాఁడు.)



ఆత్మా:—(ఆత్మగతముగ) నేనిప్పు డేమియును చెప్పరాదు. నాకేమో చేటుకాలము దాఁపరించిన ట్లున్నది. (సర్వానందుఁడు సిద్ధుని వెంటఁబెట్టుకొని వచ్చి)

సర్వా:—(జనాంతికముగా) ఇదిగో! నేనేమి చెప్పియున్నానో అంతకు పైఁగా నొకమాటకూడఁ జెప్పఁగూడదు సుమా?

సిద్ధుఁడు:—(జనాంతికముగ) అట్లే కానిండు.

సర్వా:—దేవా! సిద్ధులు విజయముచేసియున్నారు. (అందఱును లేచి నిలఁబడుదురు)

రాజు:—సిద్ధులవారికి నమస్కారములు. సిద్ధుల కాసనమిండు. (సిద్ధుఁడు కూర్చుండును.)

స్వామి! తమరాకవలన నాగృహము పవిత్రమైనది. నాజన్మము సఫలమాయెను. ఇపుడు నావ్యాధిని పోఁగొట్టి నన్ను కృతార్థునిగాఁ జేయుట తమభారము.

మూర్తి:—సిద్ధులార! తా మెట్లు సెలవిచ్చినను చేయసిద్ధముగనున్నారము. దయచేసి మహారాజుగారివ్యాధిని పోఁగొట్టు నుపాయమును మాత్రము తమ రాలోచింపవలయును.

వజ్రుఁడు:—స్వామీ! వైవస్వతపురమునకు బోయిరమ్మన్నను, పోయి మరల రాఁగలవారము.

పరముఁడు:—ఇంద్రుని గూడ జయించి రాఁగలము.

భట్టుఁడు:—స్వామీ! సింహముపాలు తెమ్మన్నను తేగలవారము.

సిద్ధుఁడు:—ఓ రాజా! మీ కిట్టిపుత్త్రు లుండఁగా తక్కు వేమి?

సర్వా:—(జనాంతికముగ) అబ్బబ్బా! వీరంద అసహాయశూరులే! ఉత్తరకుమారునికి వెనుక వీరే!.—చేతకానివిధవలు.

సిద్ధుఁడు:—నృపోత్తమా! ఇది స్వయంకృతాపరాధములలోనిది. దీనికిఁ జికిత్సచేఁత కొంతకష్టము. సెలవిత్తురేని అది యిట్టిదని వాక్రుచ్చెదను.

రాజు:—జంకు మాని చెప్పవచ్చును.

రాజపుత్త్రులు:—కష్టమనుమాట మాతోఁ జెప్పవలదు స్వామీ!

సిద్ధుఁడు:—అట్లైన వినుఁడు. హిమాచలమునందు కాంచనశృంగముమీఁద చిత్రసౌధ మనునగర మొకటి యున్నది. అందు, సౌధరాజ మొక్కటి, తిలోత్తమ యను పేరుగల యొక గంధర్వకన్యక కునికిపట్టై, వెలయుచున్నది. దానితోఁ జేరిన యారామ మొకటి యున్నది. అందు ఒకానొక సరోవరమునందు అనుదినము కమల మొకటి పుట్టుచుండును. తెల్లవాఱఁగనే తిలోత్తమ పడకనుండి లేచి, ముందుగ నాపుష్పమును జూచియే మఱియేవస్తువును కాని చూచుట వాడుక. ఒకవేళ, అది యక్కడ కనఁబడకపోయెనా ఆమె, నాఁడు కడుప్రమాదమును పుట్టించును. ఆమెకు పెక్కురు సిద్ధులు, గంధర్వులు, భూతములు, రాక్షసులు వశ్యులు. ఆమె సౌధమునకుఁ బోవుమార్గమున రాక్షసులు కావలియుందురు. ఆమె యింటిచుట్టును, కొందఱు యక్షులు కనిపెట్టియుందురు. ఆ కమలమునుకొనివచ్చి, తమకంట నద్దినతత్క్షణమే సర్వవ్యాధులును వదలిపోవును. సెలవు దయచేయింపుఁడు పోయివచ్చెదను. (జనాంతికముగ) నేను వచ్చినపని అయినది. ఇఁక మసలఁజనదు. (అని నిష్క్రమించును.)

రాజు:—కుమారులారా! వింటిరా! ఏమియోచన కుదిరినది?

సర్వా:—(పరిహాసముగా) వీరోత్తములారా! ఎంతమాత్రమును మసలక బయలుదేఱి కార్యమును సాధించుట మేలు. మీచేతఁగాని పని యెవ్వ రేమిచేయఁగలరు?

రాజపుత్త్రులు:—మహాప్రభూ! కొంచెము యోచించి మనవిచేసెదము. దయచేసి అవకాశము కొంచె మియ్యవలయును.

రాజు:—అట్లే అవకాశమును ఇచ్చియున్నాను.

(రాజపుత్త్రులు లేచి కొంచెము ముందునకు వచ్చి)

మూర్తి:—(జనాంతికముగా) తమ్ములారా! మీలో కుదురుపడ్డ యోచన యేమి?



వజ్రుఁడు:—(జనాంతికముగా) ఇదేమున్న! ఒక పెద్ద మేపాండమును తెచ్చి పెట్టుకొంటిమి! నాచేత నేమియును కాదబ్బా!

పరముఁడు:—(జనాంతికముగ) అన్నా! నీకేమైనను పిచ్చిగలదా? మన మెక్కడ! యీపని యెక్కడ! ఎట్టిసాహసమును జెప్పెనో, యెంత ద్రవ్యము వ్యయము చేయవలసియుండునో అనిమాత్రము తలఁచియుంటినే కాని, ప్రాణగొడ్డమైన యింతటిపనికి పూనుకొనవలసియుండునని, నే నొకప్పుడును తలఁచినవాఁడను కాను. ఇట్లు చెప్పునని యెవ్వరు తలంతురు?

భట్టుఁడు:—అన్నా! నాయనకు దృష్టి చెడిపోవుటచే మన కేమినష్టము? నీవు రాజ్యపరిపాలనము చేతువుగాక! అది చాలును! లేదా రాజ్యముసహితము విడుతుము గాక! ఇంతటిపనికి పూనుకొనుటకన్న నేలవిడచి సాముచేయుట మేలు! ఒకలు విడచుట మేలు! ఇదేమిటి! మనమే బలాత్కారముగఁ బోయి మృత్యువువాత బలిగా పడవలసియున్నదే! బ్రతికియుండినచో బలుసుకూరైన తిని జీవించవచ్చును గదా!

మూర్తి:—తమ్ములారా! మీరు ముందాడిన వీరవాదము లేమాయెను? ఇదియా పౌరుషము? మనతండ్రికి వచ్చియున్న యాపదను తొలఁగఁద్రోయ మనమే యుత్సహింపకుంటిమేని ఆయక్కఱ మఱి యెవ్వరికో? అయినను దీని సాధింప కొన్నియుక్తు లున్నవి. చెప్పెదను వినుఁడు. మన మిప్పు డేమియును తర్కింపక సాధించివచ్చెదమని చెప్పి యేకమనస్కులమై ప్రతిజ్ఞచేసి పోవలెను. పిదపఁ గర్తవ్యాంశములను నేను వివరించెదను.

అందఱు:—మంచిదన్నా! అట్లే కానిమ్ము!

సర్వానందుఁడు:—(రాజపుత్త్రులను చేరఁబోయి) రాజపుత్త్రులారా! ఏమియోచన కుదిరినది?

మూర్తి:—స్వామీ! ఈ సాహసకార్యములోని సాధకబాధకములనే యోచించి చూచినారము. ఇందులకు సాధకము లేమో యెందుగా

నున్నట్లు తోఁచుచున్నది, గాని తుట్టతుదకు మాకిది దుస్సాధ్యమనియే తోఁచెడిని. అయినను, మేమేమో తెగఁబడి దీని నెప్పాట సాధించివచ్చెదము.

సర్వా:—(పరిహాసముగా) మీరా! అసహాయశూరులే! పటమునందు చిత్రించియున్న రామరావణయుద్ధమును చూచినవారుగదా! మీ శౌర్యమునకు మేర యెక్కడిది? (ఆత్మగతముగ) అందఱును భంగపాటు నొంది మరల నిల్లువచ్చిచేరుట నిక్కము.

(అందఱును రాజునొద్దకుఁ బోయిరి.)

సర్వా:—దేవా! దేవరవారిపుత్త్రులు తత్క్షణమే ప్రయాణమైపోయి కార్యమును సాధించికొని వచ్చెదమని ప్రతిజ్ఞచేయుచున్నారు.

రాజు:—పుత్త్రులారా! కన్నులుపోవుటచాలక బిడ్డలనుకూడ పోఁగొట్టుకొనవలయునా? ఈకార్యమా! కడుదుష్కరముగా నున్నది. మీ ప్రయత్నములను మానుకొనుఁడు! నాకేమో మిక్కిలి భయము కలుగుచున్నది.

భట్టుఁడు:—మహాప్రభూ! భయమువలదు. మేము సాధించివచ్చెదము.

వజ్రుఁడు:—మా తహతహను అడ్డపెట్టవలదు. నాయనా! సాధించియే వచ్చెదము.

పరముఁడు:—లెస్సగా దీవించి పంపుఁడు. మేము విధిగా సాధించుకొని రాఁగలము.

మూర్తి:—నాయనా! ఈపనిని తుదముట్టించునంతటి ప్రయత్నములు చేసెదము. దయచేసి అనుమతించి పంపుఁడు.

సర్వా:—దేవా! వీరు చేయఁగలమేటిమగలే! చింతదక్కి పోనిండు.

రాజు:—నాకేమో అనుమానముగానే యున్నది. అయినను మీరు ధైర్యముతో పలుకుచున్నారు గనుక జాగ్రత్తతో పోయి సుఖముగ మరలి జయశీలురై రండు. నేను మిగుల చింతాక్రాంతుఁడనై యున్నాను. ఆత్మానందులవారు! పోదము రండు. సర్వానందులవారు బిడ్డలయొద్ద కొంతవఱకుండి వచ్చెదరా?



సర్వా:—చిత్తము దేవా!

ఆత్మా:—(ఆత్మగతముగ) వీరి కేమో గ్రహచారము చాలదు. నా మాటలు ఇపుడు సాగవు.

(రాజును, ఆత్మానందులును పోవుచున్నారు.)

మూర్తి:—స్వామీ! మేము పోయివత్తుమా? దీవించి పంపుఁడు.

సర్వా:—రాజపుత్త్రులారా! నెమ్మదిగాఁ బోయిరండు. మీరు జయశీలురై వత్తురుగాక! (రాజపుత్త్రులు పోవుచున్నారు). నాపని యిది వఱకు లెస్సగానే యున్నది. ఇటమీఁదను కదా చూడవలెను. వీరిచేత నేమి కాఁబోవుచున్నది? ఏమియుఁ గానేరదు. ఎక్కడనో బైసిచెడి వీరు రాఁబోవుచున్నారు, ఇది నిక్కము. ఇఁక నేను మసలఁజనదు. పైపైనిఁ జరగవలసినకార్యములను జక్కఁబెట్టుకొనవలయును. విజయునికిఁ దగిన సన్నాహములను కుదిరించవలయును. ఇతఁడు సాధించుననియే నాకు నిస్సంశయముగ దోఁచుచున్నది. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

---

## ద్వితీయాంకము - ద్వితీయస్థలము.

---

(సర్వంసహాయింట నొకగది).

(విజయుఁడును, సర్వంసహాదేవియును ప్రవేశించుచున్నారు.)

సర్వంసహా:—నాయనా! నాపట్టీ! నీవు వెడలిపోయిన పిదప నేనెట్లు జీవముతో నుండఁగలను?

విజయుఁడు:—అమ్మా! నీకు చింతయేల? సర్వమును సాధించుకొని నేను సుఖముగా వచ్చిచేరెదను. ఇఁక నొక్కింతయును నీవు వగలఁబొగలవలదు.

సర్వంసహా :—లోకమున ఇద్దరుముగ్గురు బిడ్డ లుండఁగా వారిలో నొకఁడు విదేశగతుఁడైనను తల్లి వంతలం బొరయక తక్కినబిడ్డల మొగముల చూచుకొనుచు కొంతయాప్యాయతను బొందును. అట్టిభాగ్యమేమో నాకు లేదాయెను. పోనీ. నా భర్తయైనను నాయందు చనవుగలిగియుండెనా పుత్త్రవియోగదుఃఖము కొంత నిస్తరింతును. దైవ మాభాగ్యమునుకూడ నాకు లేకుండఁ జేసెను. నీవే నాకు ప్రపంచమంతయు. నాసామీ! నీవు వెళ్లి పోఁగా నే నెట్లు ఓర్చుకొనియుందును?

విజయుఁడు :—అమ్మా! నీవుచెప్పినదంతయు వాస్తవమే. అయినను, నీవు రణవీరసింహునిదుహితవు. నేనో అట్టివాని దౌహిత్త్రుఁడను. సర్వంజయుని పౌత్త్రుఁడను. మనము ధైర్య మవలంబింపకపోతిమేని మనజన్మము వ్యర్థము. మనవంశమున కపకీర్తి సంఘటిల్లును సుమీ! అది యటుండనిమ్ము. క్షతమునుండి యితరులను రక్షించువాఁడుగదా క్షత్త్రియుఁడు? అట్టి క్షత్త్రియుడుఁగాఁబుట్టి యితరులను క్షతములనుండికాచి రక్షింపలేకపోయినను, తనకే క్షతమువచ్చునో యని భయపడువాని జన్మమేల? నేను క్షత్త్రియకులమునందుఁ బుట్టి నాకులధర్మమును నెఱవేర్పక పోయితినేని నా కులమున కశ్రేయోవహుఁడ నౌదునుగదా! తల్లీ! ఇంతేకాక, మనము పుట్టిన దెక్కడ? మన యిప్పటియునికి యెక్కడ? మనము కేవలము జీవనాధారణమును శరీరపోషణమునే జేయుచు కాలయాపనముఁ జేయుచున్నాము. కూపకూర్మమువంటి యిట్టి మన జీవితమువలన రాఁగల ఫలమేమి? ఇట్టి మన మనుగడకంటె గిట్టుటయే మేలని నాకుఁ దోఁచుచున్నది.

సర్వంసహా :—నాయనా! ప్రాణమును నిల్పుకొనియుంటిమేని మనకెప్పటికైనను మంచికాలము రాదా



విజయుఁడు :—అమ్మా! లోకమునందు ప్రతిపురుషునకును వాని జీవితకాలములో నొక్కసమయము గలదు. అట్టిసమయము నతఁడు లెస్సగా వినియోగించునేని చాలసుఖమును బొందును. కొంచె మజాగ్రత్తపడి దానిని పోవిడుచునేని యతని కెన్నఁడును సుఖము కలుగదు.

సర్వంసహా :—ఇదినిక్కమే!

విజయుఁడు :—కాఁబట్టి నాజీవితకాలములో అట్టిసమయ మిదియే యని యెఱుఁగుము. దీనిని వ్యర్థముగాఁబుచ్చక నేను పూనుకొన్న కార్యము నిపుడు సాధించితినా నాతండ్రిగారికి మనయెడల నున్న కోపము తీరును. మనవిపక్షులును శిక్షితులగుదురు. ఇంతియగాక నేను బుట్టినపిదప నాతండ్రిగారికి విపత్తు దొడరినది వాస్తవమేకదా! మనము హేతువును విచారింపఁబనిలేదు. కనుక నట్టివిపత్తు తొలఁగఁ ద్రోయ వలసినవాఁడను నేనుగాక మఱియొకఁడు కాఁడు. మఱియును, తల్లీ! కొండొకసమయమందు నే నొకతీరుగా నుండుటంజూచి "బిడ్డా! నీవేల యిట్లున్నావు?" అని నీవు పలుమాఱు అడిగియుండలేదా? అప్పుడెల్ల మనకు మంచికాల మెప్పుడువచ్చునో యని చింతాగ్రస్తచిత్తుఁడనై యుంటినే కాని యొండు కాదు. ఇది మనకుఁ నట్టికాలము గనుక దీనిని వదలఁ జనదు. తల్లీ! దయచేసి సెలవిచ్చిపంపుము. పోయి సర్వమును సాధించుకొని జయశీలుఁడనై మఱలి వత్తును.

సర్వంసహా :—నాచిత్తమేమో యింకను భయపడుచునే యున్నది. నీవేమో ధైర్యముగా మాటలాడుచుండుటం జేసి, నీవుచెప్పినచొప్పుననే కానిమ్ము. అయినను, నాయనా! నీ వాపనిని సాధించివత్తువనుట కేమి నిదర్శనము?

విజయుఁడు :—నా మనఃప్రవృత్తియే నిదర్శనము. మఱియు రాజ్యము గెల్పుడి నిందల కొడిగట్టినతర్వాత నీబ్రతు కింకేల యని తలపోసి

తెగువకలిగి కార్యములను సాధింపదొరకొనుట యుక్తము. తెగువ యొక్కటి యుండిన నెట్టిపనినిగాని సాధింపవచ్చునుసుమీ !

(రాగము—దేవగాంధారి.)

క. కులరూపగుణద్రవ్యం
బులు, విక్రమవంతునంద భూవిదితములై
వెలయు, నవిక్రమునకు నివి
గలిగియు లేనటుల కుప్రకాశంబు లగున్.

సర్వంసహ :—మంచిది. నాయనా ! పొమ్ము, భద్రముగా పోయిరమ్ము. పసివాఁడవుగావున తొందరపాటు దక్కి యతిజాగ్రత్త గలిగి ప్రవర్తింపుము. గ్రహచారముచాలక నీవు శత్రువులవలన క్షతమును పొందవలసినవిధియుండునేని వానికి అభిముఖుఁడ వవుదువేకాని యింతయు పరాఙ్ముఖుఁడవు కాఁబోయెదవుసుమా !

విజయుఁడు :—అమ్మా! చిత్తము. నీమాట క్షత్రియధర్మము నవలంబించి యున్నది. దానిని శిరసావహించి అట్లే నడచుకొనియెదను. చింతాశల్యము వాసి నాకు సెలవిచ్చిపంపుము. (అని నమస్కరించుచున్నాఁడు)

సర్వంసహ :—నాయనా ! సామీ ! నాజీవాధారమా ! (అని లేచి విజయుని కౌఁగలించుకొని చెక్కిలి నొక్కి ముద్దుఁబెట్టి శిరము మూర్కొని) సురక్షితముగాఁ బోయిరమ్ము.

(అని సెలవియ్యగా విజయుఁడు ప్రయాణమై పోవుచున్నాఁడు)

సఖీ ! నిర్మలచిత్తా ! (అని గట్టిగా పిలుచుచున్నది.)

నిర్మలచిత్త .— ప్రవేశించి తొట్రుపాటుతో ! ఏమేమి ! మహారాణీ గారూ !



సర్వంసహ :—(మిక్కిలి దుఃఖించుచు) మనబిడ్డఁడు వెడలిపోయెనా చూడుము.

నిర్మలచిత్త :—(నలుప్రక్కలు చూచి) వెళ్లిపోయినారు, దేవీ !

సర్వంసహ :—(డగ్గుత్తికతో) సఖి ! వాఁడు పయనమైపోవునప్పుడు అవశకునముగా నేమియుఁ జెప్పరాదని యెంచి కొంతధైర్యముతోఁడ నటించితిని. పోయిరమ్మని సెల విచ్చితిని. ఇప్పుడెంతమాత్రము నాకు తాళిక లేదే ! నే నేమి సేయుదును ?

నిర్మలచిత్త :—మహారాణీగారూ ! తమకు చింతతో పనియేమి ? అతని కేకొఱంతయు రాఁబోదు. ఇది నిజము.

సర్వంసహ :—చెలి ! వాఁడున్నదాఁక నిది నాకు స్వర్గ మనుకొంటిని. వాఁడు పోఁగా నిప్పుడిది విజనంబైన యరణ్యముగా నాకుఁ జూపట్టెడు. హా ! నాబిడ్డా ! హా ! నాబంగారుసామీ ! (అని మూర్ఛిల్లును)

నిర్మలచిత్త :—మహారాణీగారూ ! ఊరట నొందుఁడు. (అని యుపచరించిన మూర్ఛ తెలియక యుండఁగా) హా! ఈశ్వరా! హా! దేవా! నే నేమి సేయుదును? అబ్బబ్బా! ఇట్టి కష్టములను జూడనా నన్నుఁ బుట్టించితివి ? (అని యేడ్చుచు నుపచరించుచున్నది:— ఈలో సర్వానందుఁడు ప్రవేశించుచుండఁగాఁ జూచి)స్వామీ! రాణిగారి యుని కెట్టిదో కనుగొంటిరా ? (అని యేడ్చును).

సర్వానందుఁడు :—ఇంతటికి వచ్చునని నే నిదివఱకే నిశ్చయించియుంటిని. కనుక నే యిప్పుడు నేనిచటికివచ్చితిని. రాణిగారికి అత్యాహిత మేమియు రాలేదు. భయభ్రాంతి దక్కియుండుము.

నిర్మలచిత్త :—హా ! హా ! ఇదేమాశ్చర్యము !

సర్వానందుఁడు :—రాణిగారి కేమియులేదు. మహారాణిగారూ ! నేను సర్వానందుఁడను. దయచేసి తాళుకొనుఁడు. ఏమియుఁ గొఱత లేదు.

సర్వంసహా :—(కన్నుతెఱచి తిన్నగా గద్గదస్వరముతో) స్వామీ! మన చిరంజీవి అసహాయుఁడై విదేశమునుగూర్చి వెడలిపోయెనే! నే నెటు లోర్చియుండఁగలదానను?

సర్వానందుఁడు :—అయిననేమి? అతఁడేమీ అసహాయశూరుఁడు. తన వంటివారిని పదుగురను మొనసి కాపాడునంతటి అద్వితీయవీరుఁ డని తమ రెఱుంగరా?

నిర్మలచిత్త :—అబ్బా! నాకడుపులో పాలు పోసితివి గామా!

సర్వంసహా :—ఏమైనను బిడ్డఁడుకదా స్వామీ!

సర్వానందుఁడు :—శ్రీరాముఁడు విశ్వామిత్రునివెంటఁ బోయినపుడు మనబిడ్డనికన్నఁ జిన్నవాఁడై యుండెనే?

సర్వంసహా :—వీఁడు సాధించు నని తోఁచుచున్నదా స్వామీ!

సర్వానందుఁడు :—అందుల కెంతమాత్రమును సందియము లేదు.

సర్వంసహా :—నమ్మవచ్చునా?

సర్వానందుఁడు :—దృఢముగ నమ్ముఁడు, చింతదక్కుఁడు. (ఈలో గరుడధ్వని వినరాఁగా) శకునము చూచితిరా?

సర్వంసహా :—స్వామీ! కృష్ణా!

(రాగము—నాదనామక్రియ.)

క. నీవేతల్లియుఁ దండ్రియు
నీవే చుట్టంబు గురువు నీవే సఖుఁడున్
నీవే సర్వస్వంబును
కావుము నాసుతుని కృష్ణ! కారుణ్యనిధీ!

అన్నియు బాగుగనే యున్నట్టు తోఁచుచున్నవి.

సర్వా :—ఇంకను సందియమా? దైవదుర్విపాకము తీరవలసినకాలము సమీపించినది. చింతవాసి సుఖంబుగ నుండుట.



సర్వంసహా:—మంచిది స్వామీ? నిదుర కంటు మెదలుచున్నది. సెలవిచ్చెదరా?

సర్వానందుఁడు:—భాగ్యము, నిర్మలచిత్తా! మహారాణిగారిని జాగ్రత్తగా కనిపెట్టియుండుము.

నిర్మలచిత్త:—చిత్తం, స్వామీ! నాకిదితప్ప వేఱొండువ్యాపార మేమున్నది? నేనామెవెంటనే చని యుపచరించెదను.

సర్వానందుఁడు:—మంచిది అట్లే కానిమ్ము.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)



# కమలాపహరణము.

## తృతీయాంకము - ప్రథమస్థలము.

---

(లలితనగరుతోఁ జేరిన కారాగృహము).

[మూర్తి, వజ్రుఁడు, పరముఁడు, భట్టుఁడు; ఒకఁడు కందులు విసరుచును, మఱియొకఁడు ఆకులు కుట్టుచును, మూఁడవవాఁడు, గంపలల్లుచును, నాలవవాఁడు ధాన్యము దంచుచును, ప్రవేశించుచున్నారు.]

(మూర్తితప్ప ముగ్గురును)

(రాగము - హిందుస్తానికాఫీ.)

ఇందుకాపుట్టించితి, యీశ్వరా! యిందుకాపుట్టించితి,
సుందరులగూడి సౌకులన్నిపోయి, బందేకానాలోపడి, యీశ్వరా!
బవిసారనాయెనుగా.
అంతగపురంబున నానందభరితమూ,
కందర్పకేళిపోయి, యీశ్వరా! కందులు విసరనాయె.
ఉయ్యాలపైనుండి తొయ్యలులతోగూడి
సయ్యాటలుపోయెనే, యీశ్వరా! బియ్యము దంచనాయెనే.

మూర్తి:—తమ్ములార! అప్పుడే వద్దంటినే? వింటిరా! ఇప్పటి మనగతి చూడుఁడు?

వజ్రుఁడు:—అన్నా! మేమేమో మాగతికోలఁదిని జెడితిమి. నీవేలతగులుకొంటివి?

మూర్తి:—మీరుతగులుకోఁగా విని, మిమ్ముల వదలింపఁదలఁచి వచ్చి,



నేనును తగులు కొంటిని. మొదటనే యిట్టిపనికిఁ దలపెట్టక యుంటిరేని యింతటి యిడుమపాల్పలవచ్చును?

పరముఁడు:—ఇప్పుడేమి ప్రమాదము వచ్చినది? మనము క్షత్రియులము కామా? తిరుగఁబడి తప్పించుకొని యూరికేగుదము.

మూర్తి:—ఆహాహా! మనక్షత్రియత్వము వట్టిమాట! మన జన్మమేల? కాల్పనా? మనలో నొక్కఁడైనను ఆచిన్న పడుచును చతురంగములో జయింపనేరక పోయితిమిగదా! క్షత్రియులముగాఁ బుట్టినారముగాని కలనైనను పోలికలనికిం జనియున్నారమా? తుదను వేటాట యిట్టిదనియైన నెఱుఁగుదుమా? ఎప్పుడు నంతగపురమునందే ఆఁడువాండ్రంగూడి, జూదము, శృంగారవ్యాపారము మొదలగువానితోఁ గాలముపుచ్చుచుంటిమి. క్షత్రియులందఱును మనవలెనే యుందురేని, క్షత్రియనామమే అంతరించి యుండునుజుమీ!

భట్టుఁడు:—అన్నా! పోయినవిపోనీ! మనమిప్పుడు కొంతపరాక్రమమును జూపుదము. అంతకుఁదప్ప గత్యంతరము గానము. (ఈలో కావలివాఁడు కడపటిమాటల వినుచువచ్చి మిక్కిలి కోపముతో)

కావలివాఁడు:—ఆలాగా! పరాక్రమింపఁబోయెదరా? మంచిది! యజమానితోజబ్బాము. (అని పోవుచున్నాఁడు)

మూర్తి:—తమ్ములారా! మనలనేమో గ్రహచారమింతటితో వదలినట్టు కానము. మీనోరూరకుండదు. మీరు వాగ్వీర్యము, కారాగృహములోఁ జూపఁజూపఁ గీడుమూఁడునే కాని, మేలేమో యెంత మాత్రమును రాఁబోదు.

వజ్రుఁడు:—ఏమన్నా! చాల భయపడుచున్నావు?

పరముఁడు:—ఊరకుండు మన్నా! అందఱిని నేనుధ్వంసము చేసివేసెదను.

భట్టుఁడు:—అన్నా! ఆ కావలివాఁడు మరలరానీ! చూడు నాదెబ్బ!

మూర్తి:—ఏల యీవాగ్వీర్యము? ఇదిగో వాఁడు వచ్చెను. మీచేతనైనదంతయుఁ జేయుఁడు! ఏమో యనర్థము రానున్నది.

(ఈలోనిద్దరు కావలివాండ్రు సంకెళ్లను చేతపట్టుకొని ప్రవేశించుచుండఁగా వాండ్రనుజూచి జనాంతికముగ) తమ్ముఁడాలా! అనర్థము వచ్చినది. వీరిముఖకళలు చూడుఁడు ?

కావలివాండ్రు:—సెబూలారా! మీ వీర్యమునకు కొంతమెచ్చి మా యజమాని మీపాదాలకు తోడాలంపించారు. దయచేసి తొడుక్కొండి.

(అని సంకెల నొక్కనికి వేయఁబోవుచున్నారు.)

మూర్తి:—(జనాంతికముగ) నామాట నిజమాయెనా? ఇప్పుడేమి చేయవచ్చును ?

ముగ్గురు:—ఎవ్వరోయి, మీకీ బుద్ధిచెప్పినది? మేము రాజపుత్రులమని మీకుఁ దోఁచలేదా ?

కావలివాండ్రు:—(నవ్వుచు) లెస్సగా తెలుసును! తెలిసెయే యీబహుమతి పంపించారు.

మూర్తి:—అయ్యలారా! కొంత ఓర్చుకోవలెను. మీరు శుద్ధమూర్ఖులు. దయతో నామనవి కొంతవినుఁడు!

కావలివాండ్రు:—మేమామూర్ఖులు? పెద్దశూరులే? వీరిని పూర్కేపోనివ్వరాదు.

(అని సంకెళ్లువేయ యత్నించుచున్నారు.)

ముగ్గురు:—అయ్యలారా! కొంచెము తాళుఁడు. (అని మిక్కిలి బ్రతిమాలుకొనుచున్నారు).

కావలి:—అందితే జుట్టు. అందకపోతే కాళ్ళు. మంచిది. మాకుబాగ యెరికె.

(అని సంకెళ్లు తగిలించుచున్నారు.)

(ఇంతలో లలితావిజయులు ప్రవేశించుచున్నారు.)

లలిత:—ఇచటఁ జేయు మనకేమి యున్నది? అంతఃపురమునకుఁ బోదము. రమ్ముసామీ ?

విజయుఁడు:—ముద్దియ! ఇచట నలుగురు రాజపుత్త్రు లున్నారంటివే! ముందుగా వారినిఁ జూడవలెను.



లలిత:—ఈపని రేపు చేయరాదా ?

విజయ:—సుందరీ! మేలుచేఁతకు రేపనరాదు. ఎప్పటిమేలు అప్పుడే చేసితీరవలెను.

(రాగం-కేదారగౌళ)

గీ. రేపనక నేఁడె విను చెలరేగి, మేలు
చేయవలె, రేపుమాపునేఁ జేతు ననక,
చేసియైనదో యని, మన చెంతఁ జేరి,
మిన్నకుండునె మఱిలేచి, మిత్తి దాల్మి.

లలిత:—అట్లయిన నీచిత్తానుసారముగా వచ్చెదను.

ఈనలుగురే వారు. (అని రాజపుత్రులవంకఁ దిరిగి, అచ్చట కావలివాండ్రు శృంఖలాహస్తులయి నిలువంబడియుండుటం జూచి విసుఁగుతో) ఏమిటోయి? ఇది ?

కావలివాండ్రు:—చిత్తం మా ప్రభు! యీనలుగురు పెద్దజగడపోతులుగా వుండారని యజమాన్లు వీరికాళ్లకు సంకెళ్లు తగిలించుమని సెలవిచ్చిరి.

నలుగురు:—మహారాణీగారూ! మేము రాజపుత్త్రులము. ఈరీతిని మమ్మిక్కట్లకు లోఁబఱుచుట ధర్మముకాదు.

లలిత:— (కావలివాండ్రను జూచి కోపముతో) మాకేల దెలుపలేదు? ఇంతటితో చాలింపుఁడు. (అనఁగానే వెనుకతీయుచున్నారు.)

విజయుఁడు:—(జనాంతికముగ) ప్రియురాలా; వీరితో మనకేమిజోలి యున్నది? వీరో! రాజపుత్త్రులయియున్నారు. నేడు మనకు మహోత్సవము, గావున వీరందఱిని పోవిడుచుట లెస్స.

లలిత:—ఔనౌను! మంచిదే. నాప్రతిజ్ఞ యునెఱవేఱినది. వీరిని విడిపించెదను. నీకుసమ్మతమేనా?

విజయుఁడు:—నాకు మిక్కిలి సమ్మతము. అందులకే యిందులకు రమ్మని నిన్నుపిలిచినది.

లలిత:—అట్లయిన వీరిని ఊరక పంపరాదు.

విజయుఁడు:—ఏమి చేయవలయును?

లలిత:—వీరు రాజపుత్త్రులుగాన వీరియంతరమునకుఁ దగినట్లు సన్మానించి, దారిబత్తె మిప్పించుటయే కాక, ఒక్కొక్కని వీఁపుమీఁదను ఒక్కముద్ర వేసి పంపవలెనని నాయభీష్టము

విజయుఁడు:—ముద్రయేల? ప్రియురాలా?

లలిత:—సమయము వచ్చినపు డది పనికివచ్చును.

విజయుఁడు:—నీయిష్టానుసారముగాఁ జేయవచ్చును.

లలిత:—ఎవరాడ?

సేవకుఁడు:—చిత్తం ! మహాప్రభూ ?

లలిత:—మాకు వివాహమహోత్సవము నేఁడు జరగఁబోవుచున్నది గనుక, నాస్వామి యిష్టానుసారముగ దేవాలయములయం దభిషేకభోగాదులు, బ్రాహ్మణసంతర్పణము, భూగోదానాదిషోడశమహాదానములు, మొదలగుసత్కార్యములు చేయించునదియే కాక, నగరు సేవకులకందఱికిని మూఁడుదినములు రజాయిప్పించి, వారికి ఒకనెల జీతముచితముగా నిప్పించునట్లును, ఈనగరవాసులందఱును ఉత్సాహము నవలంబించి యుండునట్లును చెప్పి, తుపాకుమువేయించుమని మామాటలుగా మంత్రితోఁ జెప్పుము.

సేవకుఁడు:—చిత్తం ! మహాప్రభు ! (అని పోవుచున్నాఁడు. అది విని మూర్తి మొదలగు రాజకుమారులు మిక్కిలియానందమునొందుచున్నారు.)

లలిత:—(వారిని జూచి) రాజపుత్త్రులార! మీ కేమికావలయును?

రాజపుత్త్రులు.—మీకృపవలన మాకన్నియు నబ్బియే యున్నవి. మమ్ము మాయిల్లుచేరనిత్తురేని అంతియే చాలును.

విజయుఁడు:—మీరు మీరాజ్యము వదలి యిక్కడకు వచ్చినందులకు కారణ మేమో?

రాజపుత్త్రులు:—మహారాజా! ఆ సిగ్గులచేటేల యడుగుచున్నారు !



విజయుఁడు:—సిగ్గులచేటా ! అటులయిన చెప్పవలదు. (జనాంతికముగ) ప్రియురాల ! వీరిని చక్కఁగ జ్ఞాపకముంచుకొనుము.

లలిత:—హృదయేశ్వరా? ఏల!

విజయుఁడు:—సమయము తటస్థించును! అప్పుడు చెప్పెదను.

లలిత:—చిత్తం. ఎవరోయి యక్కడ ?

సేవకుఁడు:—చిత్తం మహాప్రభు!

లలిత:—ఈ రాజపుత్త్రులు నలుగురికిని వారివారి పరువుమేరకు దుశ్శాలువలును, ప్రయాణపుఖర్చులును, ఇప్పించుటయే గాక, వారికి కావలసిన సకల సన్నాహములు చేయించునట్లు మంత్రితోఁ జెప్పుము.

సేవకుఁడు:— చిత్తం (అని పోవుచున్నాఁడు.)

లలిత:—దౌవారిక !

దౌవారికుఁడు:—చిత్తం మహాప్రభు!

లలిత:—రాజాంగముద్రను చక్కఁగ కాలవేసియుంచితివా ?

దౌవారికుఁడు:—చిత్తం! మహాప్రభు! కాలవేసి తెచ్చియున్నాను. ఇదిగో! (అని లలితచేత నిచ్చుచున్నాఁడు.)

లలిత:—రాజపుత్త్రులారా! దయచేసియిటురండు.

రాజపుత్త్రులు:—(జనాంతికముగ) ఇదేమొ గ్రహచారము సంభవించినదే ! (అని కొంత యోజించుచున్నారు.)

లలిత:—ఏల యోజన? వచ్చితీరవలెను.

రాజపుత్త్రులు:—(ఒకరిముఖ మొకరుచూచుచు) గత్యంతరము లేదు! (అని దగ్గరకుఁ బోవుచున్నారు.)

లలిత.—(వారి వీఁపుమీఁద ముద్రతో వాతవేయుచు) మీరు మీయూరికిఁ జక్కఁగ వెళ్లిపోయెదరా ?

రాజపుత్త్రులు.— ఇంతటితో వదలితిరేని తిన్నగఁబోయి మా యూరు చేరెదము

లలిత:—దౌవారిక ! వీరిని మంత్రియొద్దకుఁ బిలుచుకొనిపొమ్ము.

రాజపుత్త్రులు:—మహాప్రభు! దయచేసి యింతటితో వదలఁగూడదా ?

లలిత:—మంత్రి మీకు సన్మానము చేయునేకాని చెరుపేమియుఁ జేయఁడు. నిర్భయముగా పొండు.

రాజపుత్త్రులు:—చిత్తం (బ్రతికితిమి దేవుఁడా!) అని పోవుచున్నారు.

లలిత:—మన మంతఃపురమునకుఁ బోదమురమ్ము సామి!

విజయుఁడు.—పదుము. అదిగో! చూడుము.

(రాగము, కల్యాణి)

క. సోముఁ డుదయించె నిదిగో
కాముఁడు పూవిల్లు బట్టెఁ గడుకోపముతో
నాముద్దియ! నీదయచే
నా మోదము మనకు వీరి యుల్లరిచేతన్.

---

## తృతీయాంకము—ద్వితీయస్థలము.

(లలిత యంతఃపురము)

(లలితా విజయులు ప్రవేశించుచున్నారు.)

విజయుఁడు:—ముద్దులాఁడీ! ఇఁక మసలఁజనదు. దయతో సెలవిమ్ము.

లలిత:—ప్రాణనాయక! సామీ! నీ వేల పోవలెను? నాచెంతనేయుండ రాదా?

విజయుఁడు:—సుందరీ! ఇప్పటి నాకార్యము అనివార్యమని మునుపే నీతోఁ జెప్పియున్నానా? లేదా?

లలిత:—అదిసరియే (కొంత ఆలోచించి) కాని, నా ప్రతిజ్ఞ నెఱవేఱు నంతకు కురూపము, కులహైన్యము, కుబుద్ధి, కుప్రవర్తన, ఇట్టివి గలవాఁ



డు వరుఁడుగా తటస్థించు నేమో యని చాలవెఱచుచుంటిని. అది పోయి, కులరూప గుణద్రవ్యంబులు గల యుత్తమోత్తమపురుషుఁడవు నాపుణ్యవశమున దొరకియు, నీవు ఒంటరిగా నన్నువిడిచి పెట్టి పోవలెనని చెప్పుటఁ జూడ, చేతికబ్బియు నోటికందని పండు చందంబున నున్నది. ఏమిసేయుదును? ప్రాణనాయకా!

విజయుఁడు:—ప్రాణేశ్వరీ! నీప్రతిజ్ఞను నీవు చెల్లించుకొనిన ప్రకారము నాప్రతిజ్ఞనుకూడ నేను నెఱవేర్చుకోవలదా?

లలిత:—అందుచే నీకు రాఁగలదేమి? నేనీరాజ్యమునకు రాణీగానుండ నీవెప్పుడు నానాయకుఁడవైతివో అప్పుడే యీరాజ్యము నీదైనది. రేపే యీరాజ్యపట్టాభిషేకము నీకు చేయించెదను. ఈసామ్రాజ్యమనుభవించుచు యథాసుఖముగ నాయొద్దనే యుండఁగూడదా?

విజయుఁడు:—ప్రియురాల! నీవు చెప్పినదంతయు వాస్తవమే! ప్రతిజ్ఞ యొక్కటి లేకుండినయెడల నిన్నువదలి యొకనిమిషమైన నుండను. ఇప్పుడు అదితప్పుట యుక్తమా?, నెఱవేర్చియే తీరవలెను. మొట్టమొదట పట్టినపట్టును తుదముట్టసాధించుట గదా పౌరుషము? వట్టి యారంభశూరత్వము మిక్కిలి హేయము. మఱియు లోకములో పెద్దలు, పురుషులను ఉత్తములనియు, మధ్యములనియు, అధములనియు, అధమాధములనియు, నాలుగుతెగలుగా విభవించి యున్నారు. గంధపుచెక్క తానరిగియైనను అన్యుల సుఖింపఁజేయునట్లు తానుచెడియైన నన్యులకు క్షేమము గల్పించువాఁడుత్తముఁడు. పచ్చికగొని పాలిచ్చుపశువులవలె కృతప్రతికృతమును చేయువాఁడు మధ్యముఁడు; క్షుద్రజంతువులవలె అన్యులకు సదా కీడేచేయువాఁడు అధముఁడు; ఈఁగవలె తానుచెడియైనను అన్యులచెఱచువాఁ డధమాధముఁడు. వీరిలో నుత్తములు మిక్కిలి దుర్లభులు. అట్టివారిం జేరకపోయినను నేను మధ్యమకోటినైనఁ జేరవలదా? ఇప్పటి నావ్యాపారము నాజనకప్రయు

క్తమయినది. ఈదివ్యాంగములు నాకు కల్పించి యీలోకము నందు నాకుఉనికి కావించినవారు నాతండ్రిగాదా? ఇట్టి మహోప కారమునకుఁ బ్రతిచేయ నాతరమా? కానేకాదు! అయినను, య థాశక్తిప్రయత్నమేనియును చేయనియెడ నాజన్మమేల? నాకంటె పాపిమఱియొక్కఁడుండునా? అది అటుండనిమ్ము! నాప్రతిజ్ఞ నెర వేర్పకతప్పితినా, నాతండ్రి ప్రాణత్యాగము సేయుటసిద్ధము. అంతట "ఆత్మావై పుత్రనామాసి" యను శ్రుతిప్రమాణము ననుసరించి నేను ఉండియు చచ్చినవాఁడనే అగుచున్నాను. ఇప్పుడు నాతండ్రికి వచ్చియున్నకష్టము సయితము మత్ప్రియుక్తముగానే యున్నది. ఇట్టి హేతువులు దెల్పఁగావినియు నాకు పోకతీఱదని నీకుఁదోఁప లేదా? నీయుద్దేశ్యమును నీమామగారికి మేలుచేత యత్యావశ్యక మే యనికదా యుండవలెను?

లలిత:—మహాస్వామి! నీవు మహాపురుషుఁడవు. నీవంటి శుద్ధమనస్కులు కలనైనను గానరారు. నీమాటలువిని నోరెత్తుట దుష్కరము. అయినను ప్రేమాతిశయమునుబట్టి కొంతకాలమువరకు నీవిరహ మోర్చియుండుట కడుదుష్కరముగ నుండును. కాని సామీ! నీవు దూరదేశగతుఁడవై నన్నొకవేళ మఱతువేమో?

విజయుఁడు:—ప్రాణేశ్వరీ! నీకేల యట్టి యనుమానము?

రాగము – సావేరి. తాళము – రూపకము.

పల్లవి. మనసుదూరమా
మగువయొడలు దూరమైన
మనసు దూరమా.

అనుపల్లవి. వనితామణి నీదుసర్వ నరరూపము హృదయమందు
ననపాయమై చెక్కబడియు ననుమానములేలనీకు. ॥మన॥

చరణము. సరసులందు కుముదము, లం
బరమునందు కుముదేశుఁడు
గిరులనడుమ నెమళ్లు, జల
ధరమండల మెచటనో
అరవిందము లిలలో, దిన
కరుఁడు లక్షయోజనముల
పరమ సాధ్వీవీరిసఖ్య
మెఱఁగియె యున్నాముగదవే... మనసుదూరమా॥



లలిత:—వాస్తవము. అయినను, (అని యర్థోక్తితో)

విజయుఁడు:—ఏల యీయర్థోక్తి? ఇతర నాయికలవలలోఁ జిక్కుదు ననియా యనుమానము.

లలిత:—నీవు సాక్షాన్మన్మథ మన్మథుఁడవు. నిన్నుఁజూచి అప్సరస్త్రీలు సయితము మోహావిష్టచిత్తలగుదురే! నాప్రాణేశ్వరా?

విజయుఁడు:—అయిననేమి?

లలిత:—అట్టి మోహనాంగులను జూచినంతట ఒకవేళనన్ను (అని యర్థోక్తిగ.)

విజయుఁడు:—నిన్ను మఱతునని తలఁచుచున్నావా? అట్టి తలంపుదక్కు ము. నాయకుఁడొక్కఁడే యనేక నాయికలయందు తుల్యప్రేమ గలిగియుండవచ్చును. అట్లు కానినాఁడు దక్షిణుఁడను పేరెటుల గల్గును?

లలిత:—అట్లయిన, నన్నుమఱవవుగదా స్వామీ?

వి. యుఁడు:—కాంతారత్నమా! సత్యము నిన్నుమఱవనే మఱవను. నీ యట్టి లోకోత్తరనాయికను మఱచుట సాధ్యమా? అందులకు తార్కాణముగ నాజ్ఞాపకార్థము ఇదిగో, నాపటమును, నాయం గుళీయకమును నుంచుకొనుము. (అని వానినిచ్చుచున్నాఁడు.)

లలిత:—(వానిని భయభక్తి వినయపురస్సరముగాఁగొని పలువిధముల ముద్దులాడుచు) చాలును! దయమాత్రముండునేని సఫలజన్మ యు, సఫలమనోరథయు నయ్యెదను. ఇవియే నాజీవాధారములు, నాయిలువేల్పులు, నాసర్వస్వము.

(విజయుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

లలిత:—(అతిచింతతో) నాహృదయానందుఁడు ఒంటరిగా నన్ను వదలి పెట్టి వెళ్లిపోయినాఁడు. ఇఁక నాకేమిగతి? దేవా! నేనుచేసిన తెలివిలేని ప్రతిజ్ఞచేత నేవిధమైన లోపమును రానియ్యక, అన్ని యంశములలోను అనన్యాదృశుఁడగు విభునిచ్చినావు. కాని, తత్క్షణమే వియోగమును కల్పించినావే! ఇంతేనానీకరుణ? అష్టవిధ నాయికలలో ప్రోషిత భర్తృకయొక్క దుర్దశవంటి దుర్దశయెవ రిదియుఁగాదు. ఇఁక నాప్రాణేశుని వదనాంబుజదర్శన మెప్పుడు దొరకునో! అతని సుభాషితమెప్పుడు విందునో! నామనోభీష్టము దీర నతని కెపుడు పరిచర్యలు సేతునో! హా! విశ్వనాథా!

రాగము – నాదనామక్రియ. తాళము – రూపకము.

పల్లవి. ఏమిసేతు దేవ దేవ
ఎటులోర్తు,నేని,క
నేమిసేతు దేవ దేవ

అనుపల్లవి. కామినినేనీ భూమితిలకుఁడౌ
సామినిఁ బాసి సహింపఁగలనా. ॥ ఏమిసేతు ॥

చరణము. ఒక్కనాఁడౌ పక్కనుండి యొంటరిగాఁ జేసెనే
మక్కువదీర నాచక్కని సామికి
మరిమరిముద్దు లెప్పుడిత్తునో ॥ ఏమి ॥

(అని నిష్క్రమించుచున్నది.)

---

# కమలాపహరణము.

## చతుర్థాంకము – ప్రథమస్థలము.

---

(హిమవత్పాంతారణ్యము)

[విజయుఁడు బాటసారివేషముతో ఖడ్గమును కేడమును ధరించి ధనుష్పాణియై ప్రవేశించుచున్నాఁడు.]

(రాగము – ఛాయామనోహరి. ఆదితాళము)

రామ రామ సీతామనోహరా! రాకాశశిముఖ భక్తశుభకర!
కామితార్థ ఫలదాయక! కష్టరాక్షసనాశకసాయక!
నీమహిమపొగడఁదరమ! నీపదమేగతినాకుఁ బరమ!
ఏమియెఱుఁగనివాఁడనయ్య! ఎవరినిగతియని వేఁడనయ్య!
పామరుఁడనై యీడవచ్చితి పయిచేత దెలియక మదిని నొచ్చితి ॥రా॥

ఆహాహా! ఈప్రదేశమెంతరమణీయము! ఇవిగోపర్వతములు! అవిగోచెలమలు, ఇచ్చటచెట్లు, అచ్చటసరస్సులు, వీనిసన్నివేశము లెంతోమనోహరములయియున్నవి. ఇచ్చట గుణత్రయమను వ్యావహారమునకొకింతయుఁ బ్రసక్తిలేక గుణైకమే వెలయుచున్నదని చెప్పవలసియున్నది. సర్వసంగపరిత్యాగముఁ జేసితైలధారావచ్ఛిన్నముగఁ బరమాత్మునియందుమనసుఁ జేర్చి తపమాచరించెడువారికిని, తృతీయతుర్యాశ్రమ నిష్ఠాగరిష్ఠులకును, నిదియేతగినస్థలము. మఱియు నిట్టి రమణీయప్రదేశములందే అతికష్టులగురాక్షసులు నియతము వసించుచున్నారుగదా! ఇదిచూడ లోకము సందేద్దగా

అన్నియంశములయందును పొందిపొసఁగియుండదనుటకు తార్కాణముగానున్నది. (ఈలో భూమిపగిలి మారీచుఁడు బయులుదేరి)

మారీచుఁడు:—హాహాహాహా! ఎవఁడ్రా వాఁడు? నుంతేనాబయ్యంలేక నానుండుచోటికివచ్చాడు!

విజయుఁడు:—(ఆత్మగతమున) ఓహోహో! రాక్షసుఁడు అని యన్నమాత్రానరాక్షసుఁడు ప్రత్యక్షమాయెనే! మంచిది! ఇపుడు వెఱవఁదగదు. నేర్పుమెఱయ ధైర్యమవలంబింపవలయును. అటుమీఁద శ్రీరాముఁడున్నాఁడు. (మారీచునిజూచి) ఓరిరాక్షసతాతా! నీవుండుచోటికెవ్వరు రాకూడదా. వచ్చిననేమి? భయమేమి? ఎవరికి భయము? నీకానాకా?

మారీ:—ఓరోరి, పలుగాకిపలువా! ఇది తిలోత్తమనగరికెళ్లె దారియని నీకెరికలేదా? మానిసిదింఁడైన మారీచుడున్నాడని యెరగవా. యిందాక యేమానిసిగాని తెగించి యీాడ వచ్చిందిలేదే! నీ వెట్లొచ్చావురా?

విజ:—(ఆత్మగతముగ) ఇది తిలోత్తమ నగరికిఁబోవు త్రోవయట, నాపని యీాడఁబోయిన తీర్థమెదుర్కొనివచ్చినటులాయెను. కాని యీ రాక్షసుని స్వాధీనపఱుచు కొనఁదగిన సదుపాయము వెదకవలయును. (ప్రకాశముగ) ఓరిరాక్షసతాత! నీవు నాతో దెబ్బలాడితే నీకేకీడువచ్చునుజుమా! ముందుగానే నీకు దెలుపుచున్నాను.

మారీ:—ఓరి, కుర్రాడా! నాబొట్న వేలంతలేవునీవు. నీవానాకు కీడు చేసేవాఁడవు. నీమీాసాలతో కూడ అంటిపండువలె నిన్ను మింగేస్తాను. చూడునాదెబ్బ.

విజ.—అలాగే చేతువుగాని పేలక నామాట కొంతవిను. అటుపై నీ వీర్యము జూపుదువుకాని. నీపేరుగలిగియుండిన రాక్షసుఁడు శ్రీరాముని బాణమువలన నేగతినొందెనో నీకెఱుకలేదా? ఆరాముఁడు నాయిలువేల్పు. ఆదేవుని ప్రార్థించిపాడెదను. అపుడు నాకుఁ బ్రత్యక్షమౌను. ఇపుడు నేనాగ్నేయాస్త్రప్రయోగము సేతునేని నీవు భగ్గుమని మండిపోయి బుగ్గియైపోదువుకాని రాముని యాజ్ఞలేకనే



నెవరిని జంపను. ఇదిగాక నీవు నిరాయుధపాణివిగానున్నావు. ఆయుధములేని వానితో యుద్ధముజేయుట క్షత్త్రియధర్మమునకు విరుద్ధము; కనుక ఏదైన నాయుధముతెచ్చుకో. జగడము వేయుదము గాని.

మారీ:—(ఈమాటలు విని చింతనొంది ఆత్మగతముగ) వీఁడెవఁడో గొప్పవాఁడుగావున్నాడు. రాముఁడు వీనికి ప్రత్యక్షమౌతాడట. దాని చూతునుగాక. (ప్రకాశముగ) కుర్రాడా, ఆయుధం తెచ్చుకొంటాను (అని చెట్టుచాటున నిలబడి విజయునిపాటనువినుచున్నాఁడు.

(రాగము-తోడి తాళము-ఆది.)

పల్లవి. దాశరథీ, దయాశరథీ, దాశరథీ
అనుపల్లవి. నీశరము లుండ నిశాచరులచే
మోసముగలుగుట ముందెన్నఁడుఁగానమే ॥ దాశరథీ ॥
చరణము. ముందటివలెనీవు భక్తులఁ బోషింప
మొనసి వెడలుటను చాలించుకొంటివా
ఇందువచ్చితిని నీవేగతియని
ఇటులఁ జేసిన నేనేమిసేతురా. ॥ దాశరథీ ॥

మారీ:—(ఆకాశమున) విజయీభవ (ఆధ్వనివిని భయముతో నాత్మగతముగ) వీడెవడో గొప్పరాచకొమరుఁడుగా వుండవలెను. లేకపోతే యింతతెగువతో యీానిశిరాత్రిలో యిక్కడికి వచ్చునా! (కొంత యాలోచించి) అరెరెరె! నావంటి వెఱ్ఱివెధవ యెవడైనవున్నాడా? శానాళ్లకుముందు నానాన్న అన్నాడే పదహారు పదిహేడేండ్లరాజకుమారుడొకఁడు మంచినిశిరాత్రిలో నీచోటికివచ్చి నిన్నుబెదిరించును. నీవు వానిజోలికెళ్లక వానికి నేస్తంగావుండి వానికి కావలసినదిచేశిపెట్టు. లేకపోతే నీకు కీడుమూడును. వాఁడే తిలోత్తమ మొగుడు కాబోయ్యేవాఁడని. వీఁడే వాఁడు. నాన్నమాట లిప్పుడు గెప్తికొచ్చింది. రాముడే వీనికి వరమిచ్చాడుగదా. వీనితో దెబ్బలాడితే నాకొంపకూలిపోను

విజ.—రాక్షసతాత, రా దెబ్బలాడుదము, ఆయుధము తెచ్చుకొన్నావా.

మారీ.—తెచ్చుకొన్నానుగాని, బాబు, మనకు దెబ్బలాట వద్దు, నేస్తంగా వుంటాం.

విజ.—(ఆత్మగతముగ) పనికొనసాగినట్లే, (ప్రకాశముగ,) ఓయితాత! నాకు చాలసంతోషము. ఎక్కడను స్నేహమేగొప్ప. కాని నీమాటనమ్మవచ్చునా ?

మారీ.—సత్యం, సత్యం, ఒట్టు. మాయబ్బతోడు.

విజ.—సరేకాని. నీవు నా నేస్తుఁడు కదా. నేస్తమునకు లక్షణమేమి. సహాయముచేయుట కదా. నాకేమి సహాయముచేయుదువు ?

మారీ.—నీవేమి కోరినాచేస్తాను.

విజ.—చాలసంతోషము. నాకుమిక్కిలి ముఖ్యమైన పనియొకటియున్నది. అదినీవు చేసిపెట్టవలెను. నీకునమ్మకు లేకనే నేనే చేసికొందునుగాని నీవునేస్తము గనుక నిన్నుపరీక్షించుటకై ఆపని నీవలన కావలెనని కోరుదును.

మారీ.—నీవుగోరుపని నాకు దెలునుగాని నీనోటిగుండా రానీ.

విజ.—ఆలాగా. నేనుగోరు పని నీకు చెప్పుటకు ముందే తెలియునా మరి మరిసంతోషము తిలోత్తమనగరునకు నేను వెళ్లవలెను.

మారీ.—దానికైగదా నీవిక్కడికి వచ్చావు.

విజ.—అవును. నీవు గడుసువాడవే. నీ కేలాగు తెలిసినదోయి ?

మారీ.—అవ్వూను యిప్పుడొద్దు. ఆనకగాని నీవుతిలోత్తమనగరుకెళ్లాలె, అదిముఖ్యమైనపని. దానికి గావలసిన సదుపాయమున్ని జేసిపెట్టుతాను నేనుచెప్పేదంత చక్కగాయినుకో.

విజ.—చెప్పు ఆలాగే వినుకొనియెదను.

మారీ.—తిలోత్తమ చాలాగడుసుది, దానికి అనేక దెయ్యాలు దేవతలు వశ్యం. దానియింటికి బహు వుషారుగా ఎళ్లాలే. పగటిపూట యెళ్లక, రాత్రిపూటయెళ్లు. దానిసూస్తే నీకుమదిపోతుంది, అదితొంగొని వుండేటప్పుడెళ్లు. యీగుండను గట్టిగావుంచుకో, అదినిద్రపోతుండగా దీనిలో నొక్కపిసరుదాని పైచల్లు, అప్పుడు దానికిగట్టి



నిద్రపట్టును. దానిచూడగానే నీకు మతి బొత్తిగా పోకమానదు, దానినీవుముద్దుబెట్టకమానవు. ఒకతూరి రెండుతూర్లు ముద్దుబెట్టితే పరవాలేదు. మూడోతూరి బెట్టితేనా అది టకీమని మేలుకొనును. నీకొంప మునిగిపోను, గనుక అది మేలుకొంటే, యీగుండలో శెనగ గింజంతతీసి నేలపై చల్లి వక తన్ను తన్ను, అప్పుడు పెద్ద కన్నమొకటి కలుగును, దానిగుండ నీవు పైకెళ్లిపోవచ్చును. అంతాబోధ పడిందా ?

విజ.—చక్కగా బోధపడినది.

మారీ.—బాబు ! నీవుచాలాగొప్పోడు కాబోతావు. నీకుకొన్ని కష్టాలొచ్చునుగాని, కొసలో తేలిపోతువు. దేముడు నీపాలిటనున్నాడు యీడకొంతదవ్వున నాచెల్లియిడింబి వున్నది. దానికీ కఠారిని చూపు. అది నీకు మరి కావలసినదంత చేసిపెట్టును. (ఆత్మ) అది వొట్టి వెఱ్ఱిముండ. వీణ్ని చూస్తే దానికి మతిపోకమానదు.

విజ.—తాత! నీవు రాక్షసతాతకావు, నాసొంతతాతవు (అని కౌగిలించుకొని) నీవునాకుఁజేసినపరమోపకారమునకుఁ దగిన ప్రత్యుపకారము నేను జేయలేను. నీకనంతకోటివందనములు. నా ప్రత్యుపకారమిదే, సెలవు దయజేయించుము.

మారీ.—సుఖంగావెళ్లు, అన్నిగెలుస్తావు. (ఆత్మ) తిలోత్తమ వీనిదే, సందేహమేలేదు. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

విజయుఁడు:— రాగము-శుద్ధబంగాళ, తాళము-ఆది.

పల్లవి. దేవదేవా, రామచంద్రా, ఏవారు నిన్నెఱుఁగగలరు.

అనుపల్లవి. నావశుఁడాయె నీరక్షకుఁడు, నీ
నామస్మరణ విశేషము చేతనే, దేవదేవా.

చరణము. నీపాదధూళి దగిలినయంతనె
పాపవిమోచనమాయె నహల్యకు
నాపన్నార్తుల బాఱఁదోలి
కాపాడెడు బిరుదాంకుఁడవీవె. దేవదేవా.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

---

## చతుర్థాంకము - ద్వితీయస్థలము.

(తిలోత్తమ నగరుతోచేరిన యారామము.)

[తిలోత్తమ - మనోరమ - సుభాషిణి, వీరు పుష్పాపచయము చేయుచుఁ బ్రవేశించుచున్నారు.]

తిలోత్తమ.—సఖీ! సుభాషిణీ! పుష్పాపచయ ప్రారంభములో నావామనేత్రముస్ఫురించుచున్నది.

సుభాషిణి.—సఖీ! తిలోత్తమా! ఈనిమిత్తము భవిష్యన్మంగళసూచకము.

మనోరమ.—సఖీ! తిలోత్తమా! పుష్పములు నీకు మిక్కిలి సుఖావహములుగదా!

తిలోత్తమ.—సఖీ! సుపుష్పములు, సుగంధములు, సుస్వరములు వీనియెడలఁ బ్రేమలేని పురుషుఁడే వ్యర్థుఁడు. స్త్రీసయిత ముండవలెనా?

సుభాషిణి.—సఖీ! సుస్వరముతో పాడఁగా విని విసుగుచు, తలపోటెత్తినవారివలె, తలపట్టుకొని పాఱిపోవువారుకొందఱున్నారే!

తిలోత్తమ.—సఖీ! మనము గంధర్వస్త్రీలము. మనవ్యాపారములన్నియు సుమనోహరములని దిగంతవిశ్రాంతంబులై వెలయు. సంగీతాది శృంగారవ్యాపారములు మనకు జన్మసిద్ధములు. సర్వదా ఇవియే మన వ్యాపారములు-కాఁబట్టి, శూరులు ప్రాణములయినఁ బరిత్యజించి మనప్రక్కలం జేరుటకు సర్వప్రయత్నములు సేయుదురు. ఈహేతువులం బట్టి, నీవుచెప్పినట్లు మూఢవ్యక్తు లుండరని చెప్పవలసి యున్నది.

సుభాషిణి.—అట్లయిన నట్టివారులేరో?

తిలోత్తమ.—ఉండవచ్చును. కాని వారిని మనుష్యకోటిలోఁ జేర్పరాదు. వారిని క్షుద్రమృగములకుసాటి యనవచ్చును. ఏలయనిన, వజ్రమునకన్న కఠినమయిన మనస్సును సయితము కరఁగించునది సంగీతము. అట్టిసంగీతముచే ద్రవీభూతముగాని మనస్సుగలవారు, భూత



దయ, పశ్చాత్తాపము, కనికరము, మొదలగుగుణములులేనివారు కనుకవారు అన్నిక్రౌర్యముల కొడిగట్టుదురు. అట్టివారిని నంతయు నమ్మరాదుసుమీ!

(రాగము - నాదనామక్రియ.)

గీతము దానును నేరక
గీతజ్ఞుల్ శ్రావ్యముగను గీతము సేయం
బ్రీతిమెయి వినఁగ నొల్లని
ఘాతుకునిఁ మించుజీవ ఘాతుకుఁ డున్నే?

సుభాషిణి.—సఖీ! మనోరమా! ఈవిరజాజిపువ్వులను తిలోత్తమశరీరమునుజూడఁగా ఒకసంశయము పొడముచున్నది. నీవదితీర్పఁగలవా?

మనోరమ.—చెప్పుము చూచెదను.

సుభాషిణి.—మార్దవమునను సుగంధమునను విరజాజమేలా? తిలోత్తమ ఒడలు మేలా?

మనోరమ.—తిలోత్తమ దేహముస్వతః అతిమార్దవము గలిగి, సుగంధవాహిగనున్నను, జాజులతో సరిపోల్పఁ బడినయెడల, జాజులే మేలని చెప్పవలసియుండును. ఎందుచేతనన తిలోత్తమయే ఈజాజులను పలుమాఱు తన కురులందు ధరించుచున్నది.

సుభాషిణి.—ఈహేతువును బట్టియే తిలోత్తమదేహమే మేలయినదని నేను తర్కించెదను.

మనోరమ.—అదెట్లు? సఖీ!

సుభాషిణి.—కురులు స్పర్శజ్ఞానశూన్యములయి, దేహమునకన్న కఠినంబులయియున్నవి. కనుక మన సఖి తనదేహము తత్కాఠిన్యసహార్వఁ జాలదని తలంచి, ఆవిరులను తనకురులందు ధరించుచున్నది.

తిలోత్తమ.—సఖీ! సుభాషిణీ! నీవు అన్వర్థనామధేయవనుటకు సంశయమేమి?

మనోరమ.—సఖీ! తిలోత్తమ! ఈజాజీతీఁగ యీ పారిజాతవృక్షముమీఁద నెట్లల్లుకొని యున్నదో చూడుము!

తిలోత్తమ.—(ఆత్మగతముగ) ఆహాహా! ఇట్లే నేనును ఉందునా! (అని పారిజాతము చేరువునకుఁబోయి అచ్చట జాజీతీఁగనే స్తబ్ధముగాఁ జూచుచు నిలుచున్నది.)

మనోరమ.—సఖీ! తిలోత్తమా! ఇదిచూచి నీకుతోఁచిన దేమియులేదా?

తిలోత్తమ.—తోఁపఁదగిన దేమి? సఖీ! సౌదాంపత్యముగల స్త్రీపురుషులవలెనే యివి చేరి పెరుఁగుచుండుటంజూచి యమందానందభరితనై యున్నాను. ఇంతే!

సుభాషిణి.—సఖీ! మనోరమా! మనసఖి తిలోత్తమ యీ జాజి లతను అత్యాదరముతో నేలచూచుచున్నదో నీకు తెలియునా!

మనోరమ.—తెలియునుగాని నీయభిప్రాయ మెట్టిదో కొంత తెలుపుము! చూతము!

సుభాషిణి.—తెల్పెదనువినుము! ఎట్లు యీజాజిలత తనకనురూపమగు వృక్షరాజమును పొందియున్నదో అట్లుతానును తనకనురూపుఁడైన వరుని పొందవచ్చునని తలఁచి చూచుచున్నది.

మనోరమ.—అయినను తిలోత్తమను అడిగి తెలిసికొందము. ఏమనుచున్నావు? సఖీ!

తిలోత్తమ.—(చిఱునవ్వుతో) ఇవి యన్నియు మీమనోరథములు కాఁబోలును?

మనోరమ.—ఔను! సుభాషిణీ! ఔను! మన సఖి వట్టి ముగ్ధ! అజ్ఞాతయౌవనకూడ!

సుభాషిణి.—ఔనౌను! లోకములో స్త్రీలందఱు నిట్టియజ్ఞాతయౌవనలే! మనమేడయందున్న రతిమన్మథ పటమునుజూచి మనసఖి మొన్న నిట్టూర్పులు విడిచినది నీవుచూచితివి గదా? ఇది అజ్ఞాతయౌవన కులక్షణమో?

మనోరమ.—(తిలోత్తమనుచూచి) ఏమి సఖీ? ఇందులకేమి చెప్పుచున్నావు?



తిలోత్తమ.—(ఆత్మగతముగ) వీరుచెప్పినది వాస్తవమే! (ప్రకాశముగ) అదేమోయమ్మా! జ్ఞాతయౌవనయో అజ్ఞాతయౌవనయో నేనెద్దియు నెఱుఁగనమ్మ! అయినను, యీమాటలు రసార్ణవసుధాకరమున చదివి మాత్రమున్నాను-అంతకుపయిని నాకేమియుఁ దెలియదు.

సుభాషిణి.—తెలిసినది తెలియనిది అంతయు రేపు, నెల్లుండిలోగాఁ దేటపడును. ఇప్పుడేలమాకు తొందర?

మనోరమ.—అదెట్లు సఖీ?

సుభాషిణి.—సఖీ! మనోరమా! ఈజాతిపారిజాతములఁ జూచి నీకేమియుతోఁపలేదా?

మనోరమ.—ఔను సఖీ! నీవు చెప్పినదిసరియే! (తిలోత్తమనుజూచి) సఖీ! తిలోత్తమా! రేపుమాత్రము మమ్ములను మఱచిపోకుమా!

తిలోత్తమ.—మీరేల నన్నిట్లు పరిహాసము చేయుచున్నారు? నాకేమియు తెలియరాదే?

ఇద్దఱు.—పరిహాసముగాదు. సఖీ! మేముచెప్పినది వాస్తవమే. అదెట్లనిన: ఈజాతి పారిజాతములను నాటించినప్పుడు నీతల్లి చెప్పిన మాటలు నీకు ఇంకను స్మరణకు రాలేదేమొ? "ఈలతా పాదప మిథునము ఒండొంటితో లెస్సపెనంగుచు, సమకాలమునందే ఆకులు కానరాక సుమభరితమైయున్నప్పుడు తిలోత్తమకు అనురూపవరప్రాప్తిని సూచించును." అని చెప్పుచు నామె దానిని నాటించె. ఆసందర్భమే యిప్పుడు తటస్థించియున్నది. అదిచూచి మామాట లేశము పరిహాసము కాదనుకో. ఇంతియెకాక, ఇంతకు కొంతమునుపు, నీవామనేత్రము స్ఫురించుచున్నట్లును చెప్పియున్నావు. ఇవి రెండునుతలపోసి చూడభవిష్యన్మంగళ సూచకములను నది నిస్సంశయము.

తిలోత్తమ.—(ఆత్మగతముగ) వీరిమాటనిజమే. అయినను, ఇదెట్లు తటస్థింపఁ బోవుచున్నదో? ప్రయత్నమింతయుఁగానను. సర్వము భగవదాయత్తము కదా?

మనోరమ.—ఏలసఖి ! ఊరకున్నావు ? లజ్జచేతనా ? ఆనందముచేతనా ?

సుభాషిణి.—లజ్జచేతనే, మనకు అంతకన్న ఆనందము ద్విగుణము; మన సఖి సుఖమే మన సుఖము కదా ?

తిలోత్తమ.—(తలవంచుకొని) నాకేమియుఁ దెలియలేదు. మీరేమిచెప్పుకొన్నను సరే.

ఇద్దఱు.—ఇప్పుడేల యీచర్చ? అంతయు అనుభవసిద్ధమయినప్పుడు తెలియవచ్చునుగా. సఖీ ! ఈతిన్నెమీఁదఁ గూర్చుండి పూలుగూర్చెదము. రా ! (అని అందఱును పుష్పహస్తలయి కూర్చున్నారు.)

సుభాషిణి.—సఖి ! తిలోత్తమా ! భవిష్యన్మంగళ సూచకముగ నొక పాటపాడుము ! వినెదము ! (తిలోత్తమ పూలుగ్రుచ్చుచు పాడుచున్నది.

రాగము - వసన్త. (చాపుతాళము.)

పల్లవి. అదిగాసుఖము, ఇల, నదిగాసుఖము.
అనుపల్లవి. మదికినింపగు, మగఁడు లభించుట. ॥ అదిగాసుఖము ॥
చరణము. నారీరత్నమది, నాయకమణియతఁడు
వారిపూజా ఫల మెవ్వారికిఁ గలదనుట. ॥ అదిగాసుఖము ॥

ఇద్దఱు.—సఖి! తిలోత్తమా! నీమనస్సున కింపయిన వరుఁడు దొరకిన వాని నీవెట్లు వర్ణింతువని ముందొక తేప మేము అడిగినందులకు నీవు ఒక పాటపాడి యున్నావుగదా. అది మిక్కిలి శృంగారముగనుండెను. మరల పాడెదవా ? వినఁ గోరెదను. ఆలో ఈపుష్పమాలికను నీజడలోఁ జుట్టెదము.(అనఁగా ఒక్కతె పుష్పహారము తిలోత్తమ జడకుచుట్టుచున్నది.) తిలోత్తమ పాడుచున్నది.

రాగము. కైకవసి - ఆదితాళము.

పల్లవి. వాచామగోచరమే, సఖియా
వర్ణింపఁ దరమెవానిమహిమ;



అనువల్లవి. భూచరులలో, ఖేచరులలో
భువనత్రయాన, సాటిలేనివాఁడే. ॥ వాచామగో ॥
చరణము. కమలాసనుఁడు, లోకములోని
కమనీయమగువస్తువులలో
కమనీయ తమభాగములచేఁ
గలిగించిన కనులపండువే. ॥ వాచామగో ॥

సుభాషిణి.—అహాహా ! ఎంతరమణీయము ! ఇట్లుగావర్ణింపవలెను, ముఖము ఆపదార్థమునకు సాటి, కన్ను లీపదార్థమునకు సరిఁ హస్తము మఱియొకవస్తువున కెనయని యిట్లు సరిపోల్పఁగా నేమి సుఖము. నీవుచెప్పినదిగా మంచిపద్ధతి.

(ఈలో నేపథ్యంబున,) తిలోత్తమా !

రాగము - మోహన.

రంభాదుల గానమువిని
జంభారిప్రముఖ దేవ సంఘం,బీమ
త్సంభూత తృప్తితో,సం
రంభముతో, నిన్ను, సభకురమ్మనిపలికెన్.

తిలోత్తమ.—సఖులార!రండు. మనము సుధర్మకు పోయికీర్తిసమ్మానములు పొంది, మరలి వత్తము. (అనియందఱును గూడి యాకాశమార్గమునఁ బోవుచున్నారు.)

---

చతుర్థాంకము - తృతీయస్థలము.

(తిలోత్తమ పడకగదియు దాసితోఁ జేరినయారామమును.)

[విజయుఁడును, హిడింబియుఁ బ్రవేశించుచున్నారు.]

హిడింబి.—ఇదే ! తిలోత్తమ పడకగది, దీనిపక్కనుండేదే తోట, అదో తెలిసేదే కోనేరు. ఆకోనేటిలో నుండేదే కమలం.

విజయుఁడు.—మంచిది, తల్లీ! నేనన్నింటిని చూచుకొనెదను, నీవు వెళ్లవచ్చును.

హిడింబి.—తొందరపడకు, చెప్పేదంతా యినుకో, ఇపుడేనన్ను వొగ్గేయక.

విజయుఁడు.—అట్లయిన చెప్పుము.

హిడింబి.—ఇప్పుడునన్ను చూస్తే నీకుచాలా చులకనగా వుందేమొ. కొన్నాళ్లకుముందు నాయందము చూస్తే నీకు నన్ను విడవడానికి మనస్సే రాదు. తిలోత్తమకాదు, గిలోత్తమకాదు, దానిఅమ్మయినాగాదు, ఎవ్వరినిగాని నీ తలెత్తిచూడవు. నాపక్కవిడచి కదల్నే కదలవు. ఇప్పుడునాకు ఆరువేల యెనమన్నూట తొంబైతొమ్మిది ముప్పై వేళ్లు ఆయెను.

విజయుఁడు—(ఆత్మగతమున) ఇదివట్టి వెఱ్ఱిది. నాకార్యార్థముపొసగఁ బలికిపోవలెను. (ప్రకాశముగ) తల్లీ! నిన్నుచూడఁగ పడుచుదానివలెనే అగపడుచున్నావుగాని, అంతగా వయస్సుచెల్లిన దానివలె తోఁపలేదే? ఇప్పటికిని నీయందునాకు మోహముకలుగుచున్నది. కాని, నీతో తల్లివరుస పెట్టుకొంటినిగదా? ఏమిచేయవచ్చును!

హిడింబి.—ఆలాగు తోస్తుందా? సామి! (అనిముద్దుఁబెట్టి) నీవు బాగా అందమెరిగిన వాడవు. ముందు నావొళ్లు యెట్లుండెనో తెలుసునా? మంచిఘట్టికత్తిరాయివలె వుండెను, కొబ్బరికాయలు కూడ పగలకొట్టవచ్చునులే!

విజయుఁడు.—(నవ్వుచు పరిహాసముగ) తల్లీ! ఇట్లుగదా! దేహము సుకుమారముగా నుండవలెను!

హిడింబి.—ఇప్పుడంటేనో! పూలవలె మెత్తగా అయిపోయింది.

విజయుఁడు.—(ఆత్మగతముగ) మంచిసుఖమునకు ముందుగా కొన్నిసమయములలో దుఃఖమువచ్చురీతిని ఈరమణీయమైన యారామమునుచూచి యానందించుటకు ముందుగానే యీజన్మాంతరప్రారబ్ధమయిన తుచ్ఛవ్యక్తితో శృంగారాలాపములు నేయవలసివచ్చెను.



దీనిచేత మనకు కార్యముగావలసి యున్నందున దీనివచోధోరణి ననుసరించియే మాట్లాడిపోయెదను, (ప్రకాశముగ) నీమగఁడెక్కడనున్నాఁడు?

హిడింబి:—నాయనా! నాను ఎనిమిదిమొగళ్లను కట్టుకుంటిని. దౌర్భాగ్యపుముండాకొడుకులందరు చచ్చిపోయినారు. ఇప్పుడు యింకొక్కణ్ణి వెతుకొంటున్నాను. నీవో అమ్మవరసవొకటిపెట్టుకొంటివి.

విజయుఁడు:—అందులకడ్డేమి? నాస్నేహితుఁ డొకఁడున్నాఁడు. వాఁడును నల్లగా రాతివలె చక్కగానున్నాఁడు. వాని నీమగనిగా చేసికొనుము.

హిడింబి:—ఆలాగా! వానినిపంపిస్తావా? పంపిస్తే యెట్లాపెట్టుకుందునో తెలుసునా? గేదెకూర, గుఱ్ఱంకూర, మనిషికూర, ఈతకల్లు, యిప్పకల్లు, యివంతా యిస్తాను.

విజయుఁడు:—పంపెదను. వానిదశయేదశ, మంచిది. తల్లీ! మనకుప్రొద్దుపోలేదా?

హిడింబి:—నేనుండఁగా నీకేమిబయ్యంసామీ? నీవెవతెకో దొరకపోతావు. అది మంచి అదృష్టంచేసింది. పొయ్యేదిపోతావు. నిన్నురవంతకట్టుకుంటాను. ఒకముద్దెట్టుకుంటాను. (అని వాని చెయిపట్టి లాగుచున్నది)

విజయుఁడు:—(ఆత్మగతమున) ఇదేమి గ్రహచారము? (అని మెల్లగ వదలించుకొని ప్రకాశముగ) తల్లీ! నీవేలవరుసమఱచిపోతివి? నాస్నేహితుఁడు నీకువలదా?

హిడింబి:—నాపక్కలోనే ఉండునా? వాఁడు!

విజయుఁడు:—(ఆత్మగతమున) ఈత్రిలోకసుందరిని జూచువారికి వ్యాపారాంతరముదోఁచునా! (ప్రకాశము) నిన్ను ఒక్కక్షణముగూడ నెడఁబాయఁడు.

హిడింబి:—నిబ్బగానా?

విజయుఁడు:—ఔనౌను! నిబ్బగానే.

హిడింబి:—వాఁడునీవలెనే అందగాఁడేనా ?

విజయుఁడు:—(ఆత్మగతం) నావంటివాఁడేకావలెనో ? బళీ ! ఏమిసాగను! (ప్రకాశముగ) నాకంటెనుఅందగాఁడే.

హిడింబి:—అయి తేసరే ! నీవువచ్చినపనికావలెనుగా ?

విజయుఁడు:—ఔను ! తల్లీ ! నీకుతెలిసియే యున్నది. నీకు తెలిసి యున్న యంశములన్నియు నాకుఁ దెల్పవలెను. ఇప్పుడు దాదాపుగా పది గడియలప్రొద్దాయెను. ఇది మంచిసమయము కాదా ?

హిడింబి:—ఔను, సామీ ! యిదేమంచివేళ. చూడిదిగో ! నీన్నే హితు ణ్ణిపంపిస్తావా పంపించవా ? అది ముందుఖరారుచేయి.

విజయుఁడు:—(ఆత్మ) ఓహోహో ! ఇది విడుచునదిగానుండ లేదే! శూర్ప ణఖవలెనే యీముండకు శృంగారవ్యాపారములలో నేమియా నందము ! (ప్రకాశముగ) అవశ్యముపంపెదను. ఇది ఖరారే.

హిడింబి:—అయి తేసరే ! నేనిప్పుడు చెప్పేవన్నీ చక్కగా యినుకో.

విజయుఁడు:—సావధానముగా వినియెదను.

హిడింబి:—నీకు కమలముగదా ముఖ్యము ?

విజయుఁడు:—ఔను. తల్లీ !

హిడింబి:—గనుక మొట్టమొదట దాన్నికోసుకో ! అవతల యిటు అటు తిరిగిచూడు. పూవుకోయక తిరిగిచూస్తివా, నీమది బ్రమిసిపోను. నీకు ముఖ్యమయినపని చెడిపోను. భోదపడ్డాదా ?

విజయుఁడు:—అట్లే. తల్లీ ! (ఆత్మగతముగ) ఇదిచెప్పినది వాస్తవమే ! మంచిరూపమునుజూచి భ్రమింపని వాఁడెవ్వఁడు ? విశ్వామిత్రాదు లుసయితము ఇట్లుమోసపోయిన వారేకదా ! (ప్రకాశ) మంచిది తల్లీ ! పదికోట్లవందనములు.

హిడింబి:—నానెల్లిపోతాను. నీవుగొప్పదిట్టరివి. నీకేకొరతయు రాబోదు.

విజయుఁడు:—పొమ్ముతల్లీ !

హిడింబి:—(కొంచెముదూరముపోయి మఱలివచ్చి) రాజపుత్రా! మొగిడి మాటమరుస్తావేమిటి ?



విజయుఁడు:—(ఆత్మగతముగ) ముసలివాండ్రకు నమ్మకముతక్కువ. నజ్జు మెండు. (ప్రకాశముగ) మఱవను తల్లీ ! మఱవను. నమ్ముకొని పొమ్ము.

హిడింబి:—భద్రం ! మరిచిపోతావు ? (అనిపోవు చున్నది)

విజయుడు:—అబ్బ ! నన్ను వదలిపోయినది. వెఱ్ఱిదికాని నాకు పరదేవ తయే.ఇందాఁక దీనివలననే నాపనులన్ని యుననుకూలములాయెను. ఇకమీఁద కాఁబోవుచున్నవి, మొట్టమొదట దీనితో శృంగారో క్తులు మిక్కిలిదుఃఖావహము లయియుండెను. అయినను ఇదియు, దీనియన్నయు నాకుఁజేసిన యుపకారములకు ప్రతిచేయ నేనేపాటి వాఁడను ! నావలనకానేకాదు! సహజముగా క్రూరులయినట్టివారు సయితము, మంచిమాటలకులోఁబడుచున్నారుగదా ! "నోరుమం చిదైన నూరంతయుమంచిదే!" అఁటకదా!నామాటకువశ్యులగుట యే గాక నాకుకావలసినపనులను అపాయములేక సాధించునంతటి సదుపాయము సయితము నేర్పిరే ! ఇదిగదా ! మహోపకారము ! వీరియెడల సర్వదాకృతజ్ఞతాబుద్ధివహించియుండవలెను. వీరికార్య ములుచూడఁగా లోకమునందు ఎంతటి దుష్టవస్తువుకాని సర్వత్ర సర్వదా దుష్టముగనుండ దనుటయును, పరమఘాతుకులు సయి తము సమయాసమయములలో ఎవరికైన సహాయభూతు లగుదు రనుటయును స్పష్టమవుచున్నవి. (అని బయలుదేరిపోవ ప్రయత్న పడుచుండ, ఈలోనిమిత్తమును జూచి)

(రాగము - కల్యాణి.)

ఇది యమరుల వాసస్థల<br>
మదరుచు నున్నదిభుజంబు నలదానిఫలం<br>
బెదిరెూ యిచ్చట, నెచ్చట<br>
నొదవును భవితవ్యములకు నొగి ద్వారంబుల్.

అని నిమ్క్రమించుచున్నాఁడు.

---

## చతుర్థాంకము - చతుర్థస్థలము.

---

తిలోత్తమ పడకయింటితోఁజేరిన యుద్యానవనము.

(తిలోత్తమ సఖులతో లతాగృహమునందు నిద్రించుచుండవిజయుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

విజయుడు:—

(రాగము-జయంతశ్రీ. తాళము-ఆది.)

పల్లవి. కమలాపతి, కరుణానిధి. కమలాపతి.
అనుపల్లవి. కమలాపతియా, కమలంబునాదు,
కరమందుజేరు వరమిమ్మునాకు, కమలా.
చరణము. ననుగన్న తండ్రికను బాధకు, నా
జననంబె హేతువను ఘోరవార్త
వినగానెయుల్లమున వీడచే, యీ
తను వెందుకు నా, కని తోచెనయ్య, కమలా.

(నలుప్రక్కలుకలయఁజూచి) ఆహాహా! ఈయారామరామణీయక మేమనవచ్చును? నందనవనమనంగా విని యున్నారముగాని, అది యిదే కాఁబోలు. ఇందలివృక్షములు, లతలు, లతాగృహములు, శిలలు, ధాతువులు, సరస్సులు, కూపములు, వీనిసన్నివేశములు, అశ్రుతదృష్టపూర్వములయియున్నవి. ఇచ్చటి సువాసిత మంద మారుతము అననుభూతపూర్వమై యున్నది. ఇచ్చటి వస్తుసముదాయములు, స్వర్ణరజతరేఖలుగలిగి రత్నరాసులవలె దేదీప్యమానములయి వెలుఁగుచున్నవి. ఇచ్చటి చమర్యాదిమృగములు సహితము మహారజత రజతరత్నవికారములయి యున్నవి. మహాకవులువర్ణించి యున్న యారామాదులును ఇట్లేకదా యుండును. మంచిది! కొండొక తడవూరక నిలుచుండి, యన్నిటిని నిదానించి లెస్సగా చూచుకొని, నేనుపడయఁ గోరియున్న కమలమున్న,



యాసరోవరమును గూర్చి పోయెదను. అపాయము సంప్రాప్తమయ్యేనేని అది తప్పించుకొన నుపాయమేమో, కరతలాగతమైయున్నది. కావున తొందరపాటు దక్కెదను. (అని కొంతనిలువంబడి ఆవల నలుప్రక్కలు కలయంజూచి) ఇదిగో నేకోరిన సరోవరము (అని దానిదగ్గఱించి) ఆహాహా! ఈసుమము, చిత్రవిచిత్రముగను, అద్వితీయమైన కాంతిగలదిగను ఉన్నది. ఇది సర్వదోషఘ్నముగ నుండుననుటకు, సుంతయు సందియంబులేదు. (ఆపుష్పమునుజూచుచు) సుమమా! నీవు సురలోకసంభూతమవు గనుక మొదట నీకు ప్రదక్షిణముచేసి చాగిలఁబడ మ్రొక్కెదను. తదనంతరము నన్ను నీవు అనుగ్రహించి నాహస్తమును అలంకరింతువుగాక! (అని ప్రదక్షిణ ప్రణామంబులాచరించి) ఇదిగో నిన్ను పరిగ్రహించుచున్నాను. (అని పుష్పమును చేతనెత్తికొని చూచుచు) ఓప్రసూనరాజమా! నీకయి నేనుపడ్డపాట్లు వాచామగోచరములు. (దాని తన యురమునఁ బెట్టుకొఁగా తనయందొక విజాతీయమైన సంతోషమును, భావమును, కాంతియును, కలిగినట్లునటించి,) ఇదేమి వింత! ఇపుడేమో సర్వవిషయములయందును విలక్షణమైనబుద్ధి గలుగుచున్నదే! మానుషత్వముపోయి నాకు దేవత్వము సంప్రాప్తమైనట్లున్నదే! ఓ! ప్రసూనరాజమా! నీమాహాత్మ్యము అవాఙ్మానస గోచరము. నిన్ను స్పృశించినమాత్రాన నామనస్సు, మదీయ దేహకాంతియును, దివ్యములైనయట్లు దోఁచెడిని. మంచిది! నిన్ను భద్రముగా దాఁచుకొనియెదను. (అట్లు సేసి) ఇంక మీఁద నీయారామము నంతయుఁ జక్కఁగఁ జూచెదను. (అని నలుప్రక్కల కలయంజూచి) ఆహాహా! ఈయుద్యానము సొంపును, ఇచ్చటి కణవాహియగు మందమారుతమును, పుష్పసుగంధవాసనను, నిర్మలచంద్రికను, లతాగృహముల సొంపును, జూడఁజూడ నాకేమో చిత్తవికారము గలుగుచున్నది. ఇది యుక్తమే! నాయకావనమున కనురూపమైన చిత్తవికారము పుట్టుట

సహజమే! పురూరవుఁడు నాఁడూర్వశింగూడి కుమారవనమందు క్రీడించినట్లిచ్చట నాకును లోకోత్తరయగు నాయికయొకతె లభించునేని నేనును దానింగూడి యథేచ్ఛముగ అత్యుత్సాహము మెఱయ కాలయాపనము సేయుదును గదా! ఇచ్చోటికి తగిననాయికమనుష్యమాత్రుఁడనగు నాకెట్లు లభింపఁబోవును? అయినను చూచెదను. (నలుప్రక్కలుతిరిగిచూచి తుదకు తిలోత్తమ సఖులతోఁగూడి శయనించియుండు లతాగృహమునకు చేరఁబోయి) ఇచ్చట నేమో స్త్రీ లున్నట్లున్నదే! ఇదిగో స్త్రీలే శయనించి నిద్రించుచున్నారు. మంచిది! హిడింబిచెప్పిన చొప్పున మొట్టమొదట వారిమీద కొంచెము చూర్ణముచల్లెద (అలాగు చేయగా అదివఱకే నిద్రించుచున్న స్త్రీలు మఱింత గాఢనిద్రం జెందఁగా వారినిచేరంజని, అచ్చటతిలోత్తమనుజూచి) ఇదేమిటి? ఇదేమి లోకము? నే నిప్పుడెచ్చోట నున్నాను? ఇది నిజమా? లేక వట్టిస్వప్నావస్థయా? నేనుచూచుచున్నది స్త్రీయా? స్త్రీయేనా? లేక మనోభవుఁడు పంపినమోహనశక్తియా? చక్కఁగాఁజూచెదను. (వంగి రెప్పవ్రేయక చూచుచు) ఓహోహో!

(రాగము - భైరవి.)

తనయుని దా పరాజయముఁ దా మదినుంచి రమాకళత్రుఁడా
మనసిజమన్మథుండు హరుమానము లీలఁగఁజూఱఁగొన్న మో
హినియయి, ధాతఁజూచి, సృజియింపఁగలాఁడవెయిట్టికాంతనో
తనయ! యన న్విరించి తనదక్షతనీమె సృజించె నేమొకో.

ఈజగన్మోహినిని ముద్దు బెట్టుకొందునా. పరస్త్రీస్పర్శము పాపావహమఁటగదా! అయినను. ఈనారీరత్నమం దేమో స్వత్వముతోఁచుచున్నది. ఏలయనిన, ఇదివఱకు నామనస్సు చేయరాని పనులయందు చెల్లినదే కాదు. అట్టిది దీనిని ముద్దుపెట్టునట్లు నన్నిప్పుడు ప్రేరేపించుచున్నది. కనుక సందేహమువలదు.



(రాగము - దేవగంధారి.)

ఇది కర్జము కాదో యని
యెద సందేహమ్ముపొడమునెడ సాధులకుం
మదిపోకడ సిద్ధాంతం.
బదియే తా ననుసరింప నగు నెందైనన్.

కనుక నిప్పుడు దీనియెడ నాకు స్వత్వము లేకపోయినను స్వల్పకాలములోనే యీయనర్ఘరత్నము నాకులభించునని దృఢముగ నమ్ముచున్నాను. కాబట్టి నేనొకముద్దుపెట్టుకొందును. (అని ముద్దుఁబెట్టి ఆనందపరవశుఁడై) హా! నన్నుగన్నతండ్రీ! నీకు నేనెంతనెనరుగలిగియుండవలసినవాఁడనో. న్యాయముగనో అన్యాయముగనో నీవు నన్నును నాతల్లిని ఇలు వెడలింపక పోయినయెడల నాకీ దేవలోకసందర్శనమును ఈదేవార్హసుఖమును నెటులలభించును? లోకమునందు తల్లిదండ్రులేకారణమునుబట్టియోతమపిల్లలకుదుఃఖావహములగుకొన్నికృత్యములుచేయుదురు. కాని తుదకది సుఖమునందే పర్యవసించుచున్నది. (సఖులనుజూచి.)వీరు సఖులుగాఁబోలు! ఎంతసొగసుగనున్నారు! నాయికకుఁదగినసఖులె! (తిలోత్తమనుజూచి) నామనోన్మణి! మఱియొకముద్దు! (ముద్దుపెట్టి) ఇప్పటినా సుఖము ఇట్టిదని చెప్పఁజాలను. లోకమునందు సుఖము రెండు తెఱఁగులఁబరఁగును. ఇట్టిచోట్ల లోకోత్తరలగు నాయికలంగూడిమెలంగుటయొకటి, పరబ్రహ్మమునందు మనస్సును నిశ్చలముగఁ జేర్చుట మఱియొకటి. ఇవితప్ప వేఱుసుఖములెవ్వి? ఇచ్చటఁ గాలయాపనముఁ జేయుచుండుటలగ్గుగాదు. తరలిపోయెదను. (కొన్ని యడుగులుపెట్టి మరలవచ్చి) నేనిచ్చటికి వచ్చినందున కానవాళ్లుంచక ఊరక మరలిపోవుట పౌరుషమునకు లక్షణముగాదు. వీరిని లేపెదనంటినా, వీరేమొ స్త్రీలు. ప్రొద్దో! అర్ధరాత్రమాయెను. వీరేమని తలఁతురో! వీరేమిభయపడుదురో! అటుపై నెట్టికీడు మూఁడునో

కనుక వీరిని మేలుకొలుపుట అనుచితము. మరేమి చేయవచ్చును! (కొండొక విచారించి, తిలోత్తమయనామికయం దొకఉంగరముం జూచి) ఈయుంగరమును నేనెత్తుకొని దీనికిబదులుగా నాయుంగరమును ఈయంగుళికితగిలించెదను. అంగుళీయమా! మదీయానందగ్రంథీ! తిన్నగ రమ్ము. నీస్థానమందు నాయుంగరము నుంచెద. (అట్లు చేసి) ఇపుడు మేము ఒండొరులచిత్తమును మార్చుకొన్నట్లుతోఁచు చున్నది. ఇంతమాత్రము చాలదు. నాపటమును సయితము ఈపడకమీఁదనుంచి వెళ్లెదను. ఈ యానవాళ్లు పెక్కు కార్యముల సాధింపఁగలవు. నిస్సంశయము. (కొన్ని యడుగులు పోయి మరల వచ్చి) ఇనుమును కాంతమువలెనే యీస్థలము నామనస్సును ఆకర్షించుచున్నది. నామోహనాంగిని తనివిదీర వీక్షించి పోయెదను. (సావధానముగఁ జూచి) నాప్రాణేశ్వరీ! నామనోన్మణీ! నాపంచప్రాణరూపిణీ! మరల నీవదనకమల మెప్పుడు చూడఁగల్గునో! ఆమహోత్సవము కలుగనియెడల నాప్రాణ మెటులనిల్చునో! కడపట నొకముద్దైనఁ బెట్టుకొని వెళ్లిపోయెదను. ఇదియే నాప్రాణాధారము. ఇదియే మరల నిన్నుచూచునంతవరకు నన్నుకాపాడవలెను. (అని ముద్దుపెట్టి) ఆహాహా! ఏమిసుగంధము! ఏమితీపు! (ఇంతలో తిలోత్తమయు సఖులును లేచుచున్నారు.) ఇంతటియానందములో హిడింబి మాటలు మఱచితిని. (భస్మమును జల్లి భూమిని తన్నగా ఒకబిల మేర్పడుచున్నది. ఆబిలముద్వారావిజయుడు వెళ్ళిపోవుచున్నాఁడు.)

తిలోత్తమ:—(మేలుకొని) ఏమిది! ఈఅర్ధరాత్రియం దిచ్చట మనుష్యసంచార మవుచున్నట్లుతోఁచుచున్నది. ఇదియేమి! నిజమా! లేక స్వప్నావస్థయా! మంచిది. సర్వదోషఘ్నమగు కమలమును జూచెదను. (సరస్సును జేరఁబోయి అచ్చట కమలమునుగానక అదరిపడి) సఖులార! ఇదేటివింత! చూచితిరా! కమలమునుగానమే! (స్తబ్ధముగా నిలుచుచున్నది).



సఖులు:—(దిగ్గున లేచి) ఇదేమివింతసఖి! లెస్సగచూడుము. ఎక్కడికి పోవును.

తిలోత్తమ:—నేనేమిపరిహాసమాడుచున్నానా? దానికిదిగాదువేళ. మీరునువచ్చి చూచుకోవచ్చును.

సఖులు:—(చూచి పుష్పమును గానక) సఖి! ఇది వింతే. ఇదివరకు, మన మిట్టివి కనివిని యెఱుఁగము.

తిలోత్తమ:—అవును సఖి! సుభాషిణి! నీ యభిప్రాయమేమి?

సుభాషిణి:—చోరుఁడెవఁడో వచ్చి వెళ్లిపోయిన జాడగానున్నది. నలుప్రక్కలు చూతము రండు. (వెదకి చూచి)

తిలోత్తమ:—(ఎవరిని గానక చిఱునవ్వుతో) సఖి! సుభాషిణి! నీవెడఁగు మాటలను నమ్మి నేనుగూడ క్షణము మోసపోతిని గదా! ఇందఱుకావలివారుండఁగా, తప్పించుకొని ఈదుర్గములోనికి చోరుఁడేమి! వానిరాకడయేమి! ఇది యేమి వట్టి వెఱ్ఱి యోజన.

మనోరమ:—అట్లుకాదు సఖి! ఒక వేళ చోరుఁడే వచ్చి యుండవచ్చునని తోఁచుచున్నది.

తిలోత్తమ:—సఖి! నీకును వెఱ్ఱియూహాయేనా! చోరుఁడచ్చటకు వచ్చుట యనఁగా మాటలా? అది అసాధ్యము. మారీచుఁడును, హిడింబియును కావలివారుగనుండ, వారిని దాఁటుకొని యిచ్చటికి రాఁగలవాఁ డెవఁడు? ఇతఁడు సామాన్యుఁడుగాఁడు, మంచిది, మీయూహ నంగీకరించెదను. అయినను చోరునకు పుష్పముతో పని యేమి? అనర్ఘరత్నవస్త్రాభరణము లుండఁగా అవి ముట్టక కేవలము ఈపుష్పమునుమాత్రము అపహరింపనేల? నాకట్లు తోఁచలేదు.

మనోరమ:—సఖి! ఆభరణమెద్దియు పోలేదనునది యేమి నిజము? వారి వారి యొడలు బాగుగాఁ జూచుకొనుఁడు.

సుభాషిణి:—నాయొడలి యాభరణములన్నియు సరిగా నున్నవి.

మనోరమ:—నా నగలును సరిగానే యున్నవి.

తిలోత్తమ:—సఖులారా! ఇదిగో ఒక వింత చూచితిరా? నాయుంగరము మాత్రముపోయినది. దానికి బదులు మఱియొకటి నావ్రేలి నున్నది.

సఖులు:—చెలీ! నిస్సంశయము. దొంగయే.

తిలోత్తమ:—తాళు, తాళు. దీనిపై నామముద్రయొకటి ఏర్పడియున్నది. దీనిని చదువుఁడు.

సఖులు:—(చదువుచున్నారు) విజయుఁడు (కొంతయూరకుండి) విజయుఁడో గిజయుఁడో. దొంగయే. సంశయమేటికి చెలి!

తిలోత్తమ:—(చిఱునవ్వుతో) సఖులారా! ఇంతయు యోజనలేక పిచ్చి పట్టినట్టుమాటలాడెదరు. ఏమి చోద్యము? చోరుఁడు దొరకిన వస్తువును పట్టుకొని తిన్నగా వెళ్లిపోవునేకాని బదులొకటియుంచునా? ఇదేమియూహ?

సఖులు:—అయిన నీయూహయేమి సఖి!

తిలోత్తమ:—నాయూహయా (కొంత యోచించి) చెప్పెదను. కొంచెము శ్రద్ధతో వినవలెను.

సఖులు:—ఆలాగే చెప్పుము.

తిలోత్తమ:—ఇచ్చటికి వచ్చినవాఁడు సామాన్యుఁడు కాఁడు, లోకోత్తరుఁడగు మహాపురుషుఁడు, మహాసాహసి, మహాపరాక్రమశీలుఁడు, మహాబుద్ధిమంతుఁడును, అయియుండవలెను.

మనోరమ:—ఏకారణమును బట్టి ఈలాగు తర్కించుచున్నావు సఖి!

తిలోత్తమ:—వినుఁడు. ఆమహాపురుషునికి ఈకమలముతో ఏదో గొప్ప పని యుండవలయును. కనుక దానిని గ్రహించుకొన్నాఁడు. అనంతరము నన్నుఁ జూచి, నాయందు మోహావిష్ట చిత్తుఁడై నాయుంగరమును గ్రహించినాఁడు. అంతటితో వెళ్లిపోయిన తానువచ్చినందుకుతగిన ఆనవాలు లేకపోవునని తలఁచితన నామముద్రాంకితమగు నుంగరమును నావ్రేలనుంచినాఁడు. ఈ పనులన్నియుఁ గడు దూరదృష్టితోను, ఉదారబుద్ధితోను, చేసియున్నాఁడు. అతఁడు మహాపురుషుఁ డనుటకు కొంచెమేనియు సందియము లేదు.



సుభాషిణి:—ఆలాగేయుండనీ. అతనితో మనకేమిపని?

తిలోత్తమ:—నే నాలాగనలేను గదా.

సఖులు:—ఏమి సఖి! నీకు మాత్రమేమి పనియున్నది?

తిలోత్తమ:—సఖులార! నన్ను కనికరింపుఁడు. పరిహాసింపవద్దు.

సఖులు:—ఎందుకు పరిహాసము. నీయూహ యేమి సఖి!

తిలోత్తమ:—(సిగ్గుతో తలవంచుకొని ఊరకున్నది)

సఖులు:—ఏల సిగ్గు సఖి! నిర్భయముగ మాతో చెప్పుము.

సుభాషిణి:—(జనాంతికముగ) మనోరమ! మనసఖికి వానియెడల మోహము కల్గినట్లున్నది. ఇదేమి వింత?

మనోరమ:—నాకును ఆలాగే తోచుచున్నది. లేనియెడల సిగ్గేల?

సఖులు:—సఖి! తిలోత్తమ! నీమాటలవలన వానియెడల నీకును మోహము కలిగినట్లు తోఁచుచున్నదే?

తిలోత్తమ:—సఖులారా! మీతో చెప్పక మఱియెవరితో చెప్పగలను?

సఖులు:—అయిన మాయూహ వాస్తవమేనా!

తిలోత్తమ:—(సిగ్గుతో తలవంచుకొని) అవును వాస్తవమే. అతఁడే నాహృదయేశ్వరుఁడు, హృదయానందుఁడు. అంగులీయక రూపముగా నామనస్సు నతఁడు లాగుకొని, తత్స్థానమందు దన మనస్సు నుంచినాఁడు. అతనినే పెల్లి యాడఁబోయెదను.

సఖులు:—నీవుచెప్పినది బాగుగనే యున్నది. నీకు తెలియనిదా! అయినను వ్యక్తిని జూడకుండనే మోహపడుటకలదా? వాఁడుసురూపుఁడో, కురూపుఁడో, కులీనుఁడో, అకులీనుఁడో, వానిపూర్వోత్తరసందర్భములు బాగుగ తెలిసికొనక, హఠాత్తుగ మోహించుట లోకానుభవమునకు విరుద్ధముగ నున్నదే!

తిలోత్తమ:—సఖులార! హఠాత్తుగాఁ బుట్టు ప్రేమాతిరేకమే మోహము. పూర్వోత్తర సందర్భములను కనుఁగొని ప్రేమనుపుట్టించుకొనుట వ్యవహారమేగాని మోహమవునా? కాదు.

సుభాషిణి:—అవును సఖి! వాస్తవమే. అయినను నీహృదయ చోరుఁడు, రూపకులహీనుఁడైన నీవేమి చేయఁగలవు?

తిలోత్తమ:—సఖీ! నాకు కులరూపములతో పనిలేదు. గుణమునే గ్రహించెదను. లోకమందు గుణములే పూజాస్థానములు.

మనోరమ:—వానియందు నీవేమి గుణములు గ్రహించినావు? సఖి!

తిలోత్తమ:—మారీచ హిడింబ్యాదులను స్వాధీనపఱచుకొని, ఈయర్థరాత్రమందు నిర్భయముగా నీ దుర్గముదాఁటి యీనగరునకువచ్చి, కమలమును కోసికొనుటయే కాక, తన యుంగరమును నావ్రేల నుంచి, నాయుంగరమును గ్రహించుకొని పోయెను. ఇంతటిపని సామాన్యుఁడు చేయఁ గలుగునా? అతఁడు కడుసాహసిగాను, ధీరాగ్రేసరుఁడు గాను, పరాక్రమశాలిగాను, అతిమేధావిగాను నుండవలయును. నిస్సంశయము. వేయేల సఖీ! మనస్సునకు మనస్సేసాక్షి. అతనిమనస్సు నాయందును, నామనస్సు అతనియందును దృఢముగ లగ్నములయి యే యున్నవి. ఇది యొకటి యేచాలును. ఇంతటి వీరుఁడును, మేధావియును కులరూపహీనుఁడై యుండఁడు. అట్లుండిన నాకుసమ్మతమే. నాకు కులరూపములతో పనిలేదు, గుణమే కావలయునని మునుపే చెప్పినాను. కులరూపము లుండకపోవు. ఉండినట్లాయెనా "అధికస్యాధికంఫలం".

సఖులు:—సఖీ! మాకుపైని వాగ్వైభవము లేదు.

తిలోత్తమ:—సఖులార! రండు మన మంతఃపురమునకు వెళ్ళిపోదము. (అని తన పరపుమీఁదనున్న సాలువును తీసి, దానిక్రింద నొక పటమును జూచి, దానిచేతపట్టుకొని, అత్యాదరముతోను, ప్రేమాతిశయముతోను, ఆపటముయొక్క సర్వావయవములు వర్ణించి) సఖులారా! ఇదిగో! ఒక గొప్పవింత. ఇటురండు! ఈపటమును చూడుఁడు! మీచర్చలన్నియు వ్యర్థములై నాజన్మము సఫలమాయెను. (అని పటమును జూపించుచున్నది).

సఖులు:—(సఖులు దాని జూచి అమందాశ్చర్యానంద భరితలయి) సఖీ! తిలోత్తమా! నీభాగ్య మేమనవచ్చు. సాక్షాత్ శ్రీలక్ష్మీ హృదయానందుఁడే జగన్మోహనావతారమెత్తినట్లున్నది గాని యొండు గాదు. ఇతఁడే నీహృదయేశ్వరుఁడు. నీభాగ్యమే భాగ్యము.



తిలోత్తమ:—అవును, సఖులారా! నాభాగ్య మనన్యాదృశము. ఇప్పుడే నాజన్మమనోరథములు సఫలము లాయెను.

(రాగము - కల్యాణి.)

వీనిఁ జూచుకనులె వెలఁదికిఁ గన్నులు
వీఁడు చూచురూపె వెలఁదిరూపు
వీనిఁగవయుమేనె వెలఁదికి నెమ్మేను
వేయిఁ కేల వీఁడెవిభుఁడు నాకు.

సుభాషిణి:—సఖి మనోరమా! మన తెలివితక్కువ కేమనవచ్చును?

మనోరమ:—ఏమిసఖి! అటు లనుచున్నావు?

సుభాషిణి:—నేఁటియుదయాన పుష్పాపచయప్రారంభములో, మనసఖి తిలోత్తమకు వామనేత్రము స్ఫురించినది. ఒకటి, జాతి పారిజాతములు ఏకకాలములోనే సుమభరితములై యుండుట యొకటి, ఈరెండును తిలోత్తమకు అనురూపవరప్రాప్తిసూచకము లని అనుకొన్నాముకదా! అది యిప్పుడు మఱచి వ్యర్థముగా చర్చచేసినాము.

మనోరమ:—ఔనౌను! సఖితిలోత్తమ! మేమాడిన అసంభవపుమాటలన్నియు దయచేసి మన్నింపవలెను సుమా.

తిలోత్తమ:—ఈలా గనుట ధర్మమా! అతిస్నేహము చేత నన్నారు గాని వేఱుగాదే! నాసుఖమే మీసుఖముగదా!

సఖులు:—సఖి తిలోత్తమ! అతనిని మనమేలాగున తెలిసికోఁ గలము?

తిలోత్తమ:—రేపే నేను పురుషవేషము దాల్చి, దేశాటనము చేయ నిశ్చయించియున్నాను. ఇఁక నతనిచూడక నేనోర్వలేను సఖీ!

సఖులు:—నీయిష్టానుసారముగఁ జేయవలయును.

తిలోత్తమ:—సఖులారా! నాకొకచింత కలుగుచున్నది. దానివలన భయమును కలుగుచున్నది.

సఖులు:—అదియేమి? సఖీ!

తిలోత్తమ:—నాప్రాణనాయకుఁ డిచ్చటినుండి సురక్షితముగా వెళ్లిపోయి యుండునా? మనవారు అతని కేమియుఁ గీడుచేయక యుండియుం దురా.

సుభాషిణి:—ఈచింతలేల సఖి! అతఁడు మహాపురుషుఁడని నీవేచెప్పి నావు. మేమును ఆలాగే నమ్మియున్నాము. వచ్చునప్పుడు ఎంత సన్నాహముతోను, జాగ్రత్తతోను, వచ్చినాఁడో, ఆరీతినే వెళ్లి పోయియుండును. చింతవలదుసఖి! మఱియు మారీచిహిడింబుల సహాయముచేతనే, అతఁ డిక్కడికి వచ్చియుండవలయును. గనుక వారు తిరిగి వెళ్లిపోవుటకు తగినసాహాయ్యము చేసియేయుందురు. సందేహము లేదు.

మనోరమ:—అవును సఖి! సుభాషిణి చెప్పినది నిజమే. నీకీచింత లవలేశమువలదు.

తిలోత్తమ:—అవునౌను! అయినను, "అతిస్నేహః పాపశంకీ"కదా! కనుక నాప్రాణేశ్వరుని క్షేమార్థముగా స్వామిని ప్రార్థించెదను.

రాగము - ఖమాంజీ, తాళము - రూపకము.

పల్లవి. ప్రోవనిది సమయమురా. శ్రీదేవదేవ, శరణాగతవత్సల.
అనుపల్లవి. నీవేగతియని నమ్మితిని. సర్వ
పావన. నేనొక బాలిక నైతిని. ॥ప్రోవ॥
శ్రీనివాసుండని బిరుదుగలనీవు.
స్త్రీలరక్షింపక పోవవు, గాన, నా
ప్రాణేశుని కపాయములేక.
పాలింపవలయును కృపానిధి. ॥ప్రోవ॥

(అందఱును నిష్క్రమించుచున్నారు.)



# కమలాపహరణము.

పంచమాంకము - ప్రథమస్థలము.

---

ఒక యరణ్యము.

(మూర్తి, వజ్రుఁడు, పరముఁడు, భట్టుఁడు, వీరు ప్రవేశించు చున్నారు.)

మూర్తి:—తమ్ములారా! నా కూరికివెళ్లుటకు సిగ్గువేయుచున్నది. నే నెక్కడనేని విదేశగతుఁడనయ్యెదను. మీరు సురక్షితముగా నిల్లు చేరుఁడు.

ముగ్గురు:—మనయింటికి మనము వెళ్లుటకు సిగ్గెందుకన్నా? మనుష్య ప్రయత్నములన్నియు కొనసాగునా? అట్లయిన ప్రపంచమే నిలువదే?

మూర్తి:—మనము చేసిన కార్యమేమి? ఆపడచు, లలితను, చతురంగములో సంయితము జయింపలేక, దానికారాగృహములోఁబడి, తుదకు సంకెళ్లు వేయించుకొనువఱకు తెచ్చుకొన్నాము. దానిని జయించి క్రొత్తగాపెండ్లాడిన దాని భర్త పుణ్యమువలన, మనకు కారాగృహవిమోచనము కలిగినది, మనమందఱియెదురుగా సభలో నిలిచి వీరవాదము చేసివచ్చి చేసినపని యింతేకదా! ఈ పరాభవముతో నిల్లుచేరిన మనతండ్రిగారికి లాభమేమి? వారు తప్పకుండ ప్రాణత్యాగము చేసికొందురు. ఇవియన్ని యట్లుండనిండు. ఆమహానుభావుఁడు సర్వానందుఁడున్నాఁడే, వాని ముఖ మేలాగు చూతును? నామట్టుకు ఊరికివెళ్లుట యెంత మాత్రము మంచిదికాదని తోఁచుచున్నది.

పరముడు:—అన్న! నీయోచన యెప్పుడును నిట్టిదే. తండ్రిప్రాణత్యాగముచేసినయెడల హానియేమి? అనేకులు పోవుచుండుట ప్రపంచధర్మము. నీవు రాజుగా నుండిన మేము నీకు సహాయులమై యుందుము. ఆత్మానందుఁడు మనవిధేయుఁడేగదా. వానికి భయమేమి?

వజ్రుఁడు, పరముడు:—ఔనన్నా! నీకేలచింత? నిర్భయముగ వెళ్లుదము. రమ్మన్నా. (అని చెయ్యిపట్టి లాగుచున్నారు.)

మూర్తి:—(ఆత్మగతము) వీరుసహాయులయిన నాకేమిలోపము? రాజ్యము మూడుదినములలో పరిష్కారమవును. (ప్రకాశము) తమ్ములార! మీరు క్షత్రియులుగాఁ బుట్టియు ఆత్మగౌరవము, మానము, వీనియందు మీకు లేశము దృష్టిలేక యున్నదే. ఇది యేమి చోద్యము.

భట్టుడు:—అన్నా! ఇవి యన్నియు పనికిమాలినవారు కొందఱు పనిలేక కల్పించిన మాటలేగాని, లోకవ్యవహారములో దేనికైన నుపయోగముకలదా? "మానము, మానము" అని కూర్చుండువానికి ఏ వ్యాపారము జరుగదు. సమయమునకు తగినట్టు నడుచుకొనువాఁడే పురుషుఁడు. కార్యము సుళువయినఁ గారణములును సుష్టువులే.

పరముడు:—మానము తెల్లదా? నల్లదా? మనమిప్పుడు "మానము మానము" అని కూర్చున్న మనకేమిగతి? రా అన్నా! ఇల్లుచేరుదమురా!

మూర్తి:—(ఆత్మగతముగ) వీరుపరమమూర్ఖులు. వీరితో పుట్టిపెరిగినందుచే నాకును ఆమూర్ఖత గట్టిగ తగిలియున్నది! లేనియెడల నీలాటిపనికి నేనును పూనుకొందునా. సాధారణముగా లోకవ్యవహారములలో, సద్గుణము, మంచిమనస్సు, సత్ప్రవర్తన, వీనికన్నిటికిని, శోభ చాలతక్కువ. (నిట్టూర్పుతో) ఈశ్వరా! ఈపాపభూయిష్ఠమైన లోకము నేమనవచ్చును. (ప్రకాశముగ) తమ్ములార! ఆలలితభర్తను మీరుచక్కగాఁ జూచితిరా?



ముగ్గురు:—ఔనన్నా! వానిముఖము మన మెప్పుడో చూచినట్లున్నది.

మూర్తి:—అదికాదు. దానియందు మనకుటుంబచ్ఛాయయే గాక మన తండ్రిగారి ఛాయయును, సర్వంసహాదేవిగారి ఛాయయును సంపూర్ణముగా నున్నవి. మీరు కనుగొన్నారా?

ముగ్గురు:—మాకేమియు ఆలాగుతోఁచలేదు. నీకెప్పుడును భ్రమ యెక్కువన్నా! సర్వంసహావార్తవిని ఇరువదిసంవత్సరములాయెను గదా! ఆమెయును, ఆమెకొమారుఁడును, ఏగతిని పొందినారో తెలియదు. ఆపనికిమాలిన వృత్తాంతమును నీవిప్పుడు తెచ్చిపెట్టుచున్నావు.

మూర్తి:—ఆలాగుకాదు. తమ్ములారా! నిజమెప్పుడో బయలుపడును గాని తప్పదు. (ఇంతలో విజయుఁడు ప్రవేశించగా అతనిని బాగుగా జూచి దిగ్గన నిలఁబడి, యొండొరులతో జనాంతికముగ)

నలుగురు:—వీఁడేవాఁడు. ఇదేమి ఆశ్చర్యము! వానిమాట ప్రస్తాపించుచుండఁగా ఆకాశమునుండి గభీమని దుమికినట్లు వచ్చినాఁడే! (అని స్తబ్ధులయి నిలఁబడుచున్నారు.)

విజయుఁడు:—(వినయముతో దగ్గరచేరి) అయ్యాలార! మీ రెక్కడికి వెళ్లుచున్నారు? (ఆత్మగతము) దైవాధీనముగ నేను నాయన్నలతో కలిసికొన్నాను. నేను వీరిని కలసియే తండ్రిగారి దర్శనము చేసినచో, నేకకాలములో అయిదుగురు కుమారులను వారుచూచుటయే కాక వారికి దృష్టియు వచ్చినట్లయిన నెంతటి యానందమును బొందుదురో కదా!

పరముఁడు:—(జుగుప్సాగర్వములతో) మేమెక్కడికి వెళ్లిన నీకేమి?

వజ్రుఁడు;—మాకర్మాన మేము వెళ్లుదుము. ఆజోలి నీకేమి?

భట్టుఁడు:—మాతో నీకేమి పని?

మూర్తి:—అబ్బాయి! మేము మధురాపట్టణమునకు వెళ్లెదము. నీవును మావెంటనే వచ్చెదవా?

విజయుఁడు:—ఔను అన్నలారా! కోపమువలదు, నేనును అక్కడికే వెళ్లవలసిన పనియున్నది. కనుక మీవెంటనే వచ్చెదను.

(మూర్తితప్ప) ముగ్గురు:—నీవెవఁడవోయి? మమ్ములను "అన్నలారా" అని పిలిచెదవు?

విజయుఁడు:—ఏలకోపము? మీరు నాయన్నలు. నేను మీతమ్ముఁడనే, చక్కగ నాశీర్వదించుఁడు. (అని నమస్కరించుచున్నాఁడు.)

మూర్తి:—చిరంజీవ, మహదైశ్వర్యాభివృద్ధిరస్తు. (జనాంతికముగ) నేను ముందు చెప్పిన రహస్యమిదియే. నిస్సంశయము.

ముగ్గురు:—విజయుని బాగుగఁ జూచి (జనాంతికముగ) ఔనన్నా! నీవన్నది వాస్తవముగ నుండవచ్చును, గాని అది అసాధ్యము.

మూర్తి:—(జనాంతికము) నామాటే నిజము. అంతయు నిప్పుడే తేటపడును. (ప్రకాశముగ) అబ్బాయీ! మేమన్నలమా? నీవు తమ్ముఁడవా? ఈ పూర్వోత్తరసందర్భము నాకు కొంచెము తెలియపఱచుట బాగు.

విజయుఁడు:—నేను సర్వంసహాదేవి కొమారుఁడను. నాపేరు విజయుఁడు.

ముగ్గురు:—(మూర్తినిజూచి) ఇదేమన్నా! ఇది?

మూర్తి:—(జనాంతికముగ) నేను ముందే చెప్పినానుగదా! (విజయునితో ప్రకాశముగ) తమ్ముఁడా! చాలసంతోషము. నిన్ను గొప్పపుణ్యముచేత చూచుట తటస్థించినది. (అని కౌఁగిలించుకొని) దేవిగారు సురక్షిత లయియున్నారా?

విజయుఁడు:—శ్రీరామకటాక్షముచేత క్షేమముగా నున్నారు. ఇరువది సంవత్సరములు తాళి వీఁడేలాగువచ్చినాఁ డనితలఁచినారుకాఁబోలు. అది యంతయు పెద్దపురాణము. మనము పట్టణముచేరినపిదప చెప్పెదను. (ముగ్గురును విజయుని అసూయతోఁ జూచుచున్నారు.)

మూర్తి:—విజయుఁడ! నీవెక్కడనుండి వచ్చుచున్నావు? లలితను నీవే కదా పెండ్లాడినావు?



విజయుఁడు:—ఔనన్నా! అది అదృష్టవశమేగాని వేఱుగాదు. మీరు దేనిఁ జేయఁగోరి యూరువదలి ప్రయాణమయినారో దాని నేను చేసికొనివచ్చినాను.

ముగ్గురు:—(అతికోపముతో) మేమేమి చేయఁగోరితిమో నీకేమి తెలియును?

విజయుఁడు:—అన్నలార! కోపమేల? మీరుచేసిననేమి? నేనుజేసిననేమి? మనమేకకుటుంబస్థులమేకదా? ఆగౌరవమును మీకే కలుగఁజేయ సన్నద్ధుఁడనై యున్నాను. తిలోత్తమనగరినుండి వచ్చుచున్నాను ఇదిగో ఆకమలము. (అనిపుష్పమును గట్టిగాపట్టుకొని చూపించుచున్నాఁడు. నలుగురు అత్యాశ్చర్యముతో పుష్పమును చూచుచున్నారు.)

మూర్తి:—విజయా! ఇన్నాళ్లు నీవెక్కడనుంటివి? మేమీపుష్పమునకయి బయలుదేరినట్లు నీకెట్లు తెలిసినది?

విజయుఁడు:—ఇవి యన్నియు కాలక్రమమున తెలియును. దయచేసి క్షమించవలయును,

ముగ్గురు:—అన్నా! ఇవన్నీ అబద్ధములు. వీఁడు మనస్సు వెళ్లినరీతిని బొంకుచున్నాఁడు. నమ్మకుమన్నా!

విజయుఁడు:—అన్నలార! బొంకుట యెట్టిదో యిదివఱకు నే నెఱుఁగను, ఇకను నెఱుఁగకుండవలయునని సర్వేశ్వరుని సదాప్రార్థించుచున్నాను. ఈ పుష్పమును జక్కగా చూడుఁడీ! దీని కాంతిచేతనే యిది దేవలోక జాతమని తెలిసికొనవచ్చును. ఇది సర్వదోషఘ్నము, "సర్వరోగఘ్నము" అనుట కేవిధమయిన సందేహము లేదు. అయినను పరీక్ష చేయవలయునని యిష్టముండునేని, ఎవరైనను కన్ను పొడిపించుకొనుఁడు, ఈక్షణమే కంటి నిప్పించెదను.

ముగ్గురు:—ఎంత పెంకెవాఁడవోయి నీవు! నీమాట నమ్మి కన్నుబోగొట్టుకొమ్మనియెదవా? జ్ఞాతిత్వమును బహుబాగుగా చూపిం

చుచున్నావే! అన్నా! వీని గడుసుతనమును దౌర్జన్యమును చూచితివా!

విజయుఁడు:—గడుసుదనము లేదు, దౌర్జన్యము లేదు. త్రికరణశుద్ధితో నుండువాస్తవమునే చెప్పినాను. వేరేమియుగాదు. (ఇంతలో నొక గ్రుడ్డివాడు ప్రవేశించి.)

అంధుడు:—ఎవరండోయి మహాపురుషులు? పొడిపించుకొన్న కంటిని ఇప్పించేవారు? నేను శుద్ధ అంధుఁడను. దయచేసి నాకు కంటిని యిప్పించితిరా మీకు గొప్ప సుకృతము దక్కును.

విజయుఁడు:—(వానినిజూచి) అయ్యో! ఈలాగురండి! మీరు మంచిసమయమునకు వచ్చినారు. మీకు దృష్టి తెలియదా?

అంధుఁడు:—నాకు ప్రపంచము నల్లనిదో తెల్లనిదో ఇదివరకు తెలియదు. మనుష్యులకు నావలెనే రెండు కాళ్ళో ఎనిమిదికాళ్ళో ఎఱుగను.

విజయుఁడు:—అయ్యో పాపము. ఆలాగా? ఈ క్షణమే మీకు దృష్టి నిప్పించెదను. (అని పుష్పమును వానికన్నులమీఁదఁబెట్టఁగా వానికి కన్నులు నిర్మలముగా తెలియవచ్చుచున్నవి.)

అంధుఁడు:—(కన్నులు తెఱచి నలుప్రక్కలు బాగుగఁజూచి, అత్యాశ్చర్యానందములతో విజయుని పాదముల మీఁదఁబడి) ఓమహాత్మా! నీ వెవఁడవో నాకు తెలియదు. కాని నామట్టుకు నీవే సాక్షాన్నారాయణుఁడవు. నీకు అనంతకోటి వందనములు. నేను యక్షరాజును. శాపముచేత ఈ పాపిష్టిజన్మము నెత్తినాను. ఆపాపవిమోచనము నీయనుగ్రహముచేత నాకు కలిగినది. ఓమహానుభావా! ఇఁక నొక నిముసమైన నే నిచట నుండఁజనదు. నావలన నేమయినసహాయము కావలసియుండునేని నన్ను తలఁచినఁజాలు. తత్క్షణమే నీకు ప్రసన్నుఁడనయ్యెదను.

విజయుఁడు:—యక్షరాజా! నీ కనంతకోటి వందనములు. నరాధముఁడనగు నాచేత తమకు శాపవిమోచన మయినదే. నాజన్మ మిప్పుడే



సఫలమయినది. తాము సెలవిచ్చినది మఱవను. దయమాత్ర ముంచవలయును.

యక్షరాజు:—నీవు నరాధముఁడవు గావు; మహాపురుషుఁడవు. అతిశీఘ్రములోనే దేవసామ్యమును బొందఁబోవుచున్నావు. కొలఁదిదినములలో నీమనోభీష్టము కరస్థమవుచున్నది. నీకేలోపమును రాఁబోదు. ఇఁక నే నుండఁజనదు. సెలవు (అని ఆకాశయానముగా వెళ్లుచుఁ నేను చెప్పినది మఱచిపోఁగూడదు. నా సహాయ మెప్పుడైన కోరవలెను. అప్పుడే నామనము స్తిమితము నొందును. (అని వెళ్లిపోవుచున్నాఁడు.)

విజయుఁడు:—చిత్తము. ఆలాగే తప్పను. (అని యక్షరాజుదారిని ఆశ్చర్యభక్తులతోఁజూచుచు ఆత్మగతముగ) దేవసామ్యమును బొందఁబోవుచున్నా వన్నాఁడు. తిలోత్తమ నాకుదొరకునా (అని నిట్టూర్పు విడుచుచున్నాఁడు.)

మూర్తి:—విజయ! కడుచక్కనిపని చేసినావు. నీవు బహుబుద్ధిమంతుఁడవు. (అని కౌగిలించుకొనుచున్నాఁడు.)

ముగ్గురు:—(జనాంతికముగ) వీని కాలుచేతులు త్రాటితో గట్టిగా కట్టి పడవేసి ఆకమలమును మాత్రము లాగుకొనివెళ్లిపోదము. నీవేమి చెప్పుచున్నావు. (అని వారిలో వారు చర్చ చేయుచున్నారు.)

వజ్రుఁడు:—(జనాంతికముగ) అన్న నడిగెదను.

పరముఁడు:—(జనాంతికముగ) అన్నకుమతిలేదు. అడుగవద్దు.

భట్టుఁడు:—ఆలాగుకాదు. అడుగుటమంచిది. అన్నా! ఇలాగురమ్ము! (అని మూర్తి చెవులో చెప్పుచున్నాఁడు.)

మూర్తి:—(జనాంతికముగ) హరిహరీ! నేనెంతమాత్ర మొప్పను. మంచిదికాదు; మంచిదికాదు! మనకే హానికలుగును. వీడు మహాపురుషుఁడు. జాగ్రత్తగా నుండవలయును సుమా

ముగ్గురు:—(జనాంతికముగ) నిన్నడుగుటే మాతప్పు. మావల్ల నయి

నది మేమే చేసికొనియెదము. నీవేమైన నాటంక పర్చితివేని నీకు ఆగతియే.

మూర్తి:—(జనాంతికముగ) ఇదివరకు దెచ్చుకొన్న పరిభవములు చాలవా? ఎందుకు నిష్కారణముగ ఘోరకృత్యమున కొడిగట్టెదరు?

విజయుఁడు:—(వీరి జాడలు చూచి కొంచెముసందేహపడి) అన్నలార! మీకు నాయందు కనికరము నమ్మకము లేనట్టున్నది. నేను మీ కేవిధమైన కీడును చేయలేను చేయఁదలంపను లేను. నేనేమి చేయవచ్చును? నా అదృష్ట మింతియే కాఁబోలు. నాకర్మమున నేను వెళ్లిపోయెదను. అనంతకోటివందనములు. శీఘ్రముగానే మనము మరల కలిసికొందుము. (అని వెళ్లిపోవుటకు తిరుగుచున్నాఁడు. ఈసమయములో మూర్తి తప్పఁ దక్కిన ముగ్గురును విజయునికి తెలియకుండ తిన్నగా వెంటఁబడి, మూర్తి వలదని పలుమాఱు సంజ్ఞచేసినను వినక, విజయునిపై హఠాత్తుగఁబడి, వానిక్రిందఁబడవేసి ఒకఁడు బట్టతో కండ్లను, మరిద్దరు కాళ్లు, చేతులు త్రాటితో కట్టుచున్నారు.)

విజయుఁడు:—అన్నలారా! ఇది మీకు ధర్మము కాదు. క్షత్రియజాతికే మీరు అపకీర్తి దెచ్చుచున్నారు. ఎదురుగా నిలఁబడి మీరు నలుగురునుచేరి యుద్ధముఁ జేసి గెల్చుకొన్నయెడల చాలబాగుగ నుండును, నాకు సయితము సమ్మతమవును. ఈలాగున హఠాత్తుగా నావెంట వచ్చి, నాకు తెలియకుండఁ బడఁద్రోయుట పుంస్త్వ లక్షణము కాదు. పోనీ! దీనికి తగిన ప్రతిఫలమును వెంటనే అనుభవింపకపోరు. ఈశ్వరుఁ డొకడున్నాఁడు గదా! (అని కేకలు వేయుచుండఁగా, ముగ్గురును నేమియు బదులు పలుకక, విజయుని గట్టిగ కట్టి పడవేసి కమలమును లాగుకొందురు.) మీరు మహాపాపులు, రాక్షసులు, ఘోరహింసకులు. మీముఖావలోకనము చేయనేరాదు. (అని మూర్తి కేకలువేయుచుండ వానిచేతులుకూడ వాని ముందు త్రోయుచు వెళ్లిపోవుచున్నారు.) దేవదేవా! పురుషోత్తమ! రామచంద్ర! ఇపుడు నేనేమి సేతును;



రాగము - వేదఘోషప్రియ, ఆదితాళము.

తామరసము పోయెఁగా తల్లడిల్లుటయాయెఁగా
పామరపుస్నేహముతో పథ్యము పల్కితివీరితో
ఏమాత్రంబును సఖ్యం బిట్టిమూర్ఖుల కముఖ్యంబె
నామదికిమోసము వచ్చెనాయన్నలకే ద్వేషమెచ్చె
ఈమహీనరు భోక్తవ్యములే యేసవ్యాపసవ్యములుఁ
భామామణిలలితకుఁ జెప్పిన భద్రములన్నియు దప్పెనా
కోమలి తిలోత్తమా సుఖము గోరికదీర నెటులచూతునో
రామా సీతామనోహరా రక్షింపనిదిసమయమురా

(అని వ్యసనముచే చేతులు పిసికికొనుచుండఁగా, వాని యంగుళ యందున్నమంత్రకల్పితమగు తిలోత్తమయురంగముమీఁద వాని చేయిపడఁగా, ఆయుంగరముయొక్క మహిమచే నొకడు పాతాళమునుండి ప్రత్యక్షమగుచున్నాడు.)

పురు:—(విజయునికెదుట నిలిచి) నావల్ల నేమి కావలయునో చేయసన్నద్ధుడనై యున్నాను.

విజయుఁడు:—(వానింజూచి అత్యానందముతో ఆత్మగతముగ) ఇదియును రామకటాక్షమే! రామచంద్ర! నీవిలాసలు అనుమేయములు. (ప్రకాశముగా) మీరెవరో నాకు తెలియదు. కాని నాదేహమును కట్టియుండు త్రాటిని మొట్టమొదట దయచేసి విప్పివేయవలెను.

పురు:—ఆలాగే (అని విప్పివేయుచున్నవాఁడు.)

విజయుఁడు:—(లేచి) ఇంకనేభయములేదు. (కొంతవిచారముతో) కమలము పోయినది. పోనీ. ఏపనికి తెచ్చినానో ఆపని అవునుగదా! అంతే చాలును. తండ్రిగారికి కన్నులు వచ్చినట్టయిన నాకు సామ్రాజ్యపట్టాభిషేకమయినట్టే. (ప్రక్కదిరిగి) మీరెవరో దయచేసి చెప్పవలెను.

పురు:—నేనెవఁడనో చెప్పవల్లఁగాదు. కాని ఆయుంగర మెవరివద్దనున్నదో వారిసేవకుఁడను. ఎప్పు డాయుంగరమును చేతితో రాసినను తత్క్షణమే వారికి ప్రత్యక్షమయి కావలసినదంతయుఁ జేయవలసినవాఁడను. మీా కేదికావలసినను ఈక్షణమే చేసిపెట్టెదను. నాసామర్థ్యము అనన్యాదృశము. మీారు కావలసినది సెలవియ్యవచ్చును.

విజయుఁడు:—ధన్యుఁడనైతిని. తిలోత్తమ మేడవంటిమేడ ఏతత్క్షణ మీాయరణ్యములో కల్పింపగలవా ?

పురు:—ఇదిగో వచ్చినది. (ఆకాశమునుజూచి) మేడా ! దిగుమా ! (అనఁగానే అత్యద్భుతమగు మేడదిగుచున్నది). మరేమికావలయును ?

విజయుఁడు:—(అత్యాశ్చర్యానందములతో) ఒకచక్రవర్తికి కావలసిన ధనకనక వస్తువాహనములన్నియు సేకరింపఁగలవా ?

పురు:—మీామనోవృత్తి ననుసరించి అప్పుడేనిర్మించితిని. అన్నియు సన్నద్ధములయి యున్నవి. మరేమిసెలవు ?

విజయుఁడు:—ఈధనాదులు అక్షయములయి యుండవలయునని వరమియ్యవలయును.

దేవత:—అయినది, మరేమి ?

విజయుఁడు:—నా తల్లిగారును నిర్మలచిత్తయును ఇప్పుడే యిక్కడికి వచ్చునటుల వరము దయచేయవలయును.

దేవత:—ఇదిగో వచ్చుచున్నారు. మీాఁద చూడుఁడు. (అనఁగా సర్వంసహా నిర్మచిత్తలు, ఆకాశయానమున వచ్చుచున్నారు.)

విజయుఁడు:—వారినిఁజూచి (అతి విస్మయానందములతో నమస్కరించి) అమ్మా ! అనంతకోటివందనములు, నేను విజయుఁడను-సురక్షితుఁడనై తిరిగివచ్చినాను. భయమెంతమాత్రమును వలదు.

సర్వం, నిర్మల:—ఇదేమి అద్భుతము! ఇదేమి యానందము! (అని విమానమునుండిదిగ్గి, విజయునిజేరి, సర్వంసహావిజయుని కౌఁగిలించుకొని) నాబంగారుకొండా ! నాముద్దులపట్టీ ! నాజీవాధారమా ! సర్వస్వమా ! (అనిపలుతెఱఁగుల ముద్దులాడుచు) బిడ్డా ! నిన్నుఁ జూచినానే ! ఇదియే నాకుఁజాలు ! ఇఁక నేమియువలదు.



విజయుఁడు:—అనంతకోటివందనములు. (అని నిర్మలచిత్తకు నమస్కరించుచున్నాఁడు.)

నిర్మల:—నమస్కరింపనేలా ? నీకు సర్వాభీష్టములు సిద్ధించుగాక ! (అని కౌఁగిలించుకొని ముద్దుపెట్టుచు) నీముఖచంద్రదర్శనము లేక మేము పడ్డపాటువ కేమనవచ్చును ! ఇప్పుడు మేము కృతార్థులమయితిమి.

సర్వం:—(నలుప్రక్కలు తిరిగిచూచి) నాయనా ! ఈ యరణ్యమేమి ! ఇందు ఈలోకోత్తరమగు మేడయేమి ? మేమొక్కనిముసములో ఇల్లువదలి ఆకాశయానమున నిక్కడికి వచ్చుటయేమి? ఇవి యన్నియు నాకేమియు బోధపడలేదు.

విజయుఁడు:— ఈపూర్వోత్తర సందర్భములు వెనుక మనవిచేసెదను. ఈమేడయు మీారిక్కడికి వచ్చుటయు మఱికొన్నివింతలును ఈ మహానుభావుని కృపచేత కలిగినవి. (అని పురుషుని జూపించుచున్నాఁడు.)

సర్వం:—వీ రెవరు?

పురుషుఁడు:—దేవిగారు ! నేను "ఫలానా" అని చెప్ప నసాధ్యము. కాని మీాకు కావలసినవన్నియు సన్నద్ధములయియున్నవి. మఱేమికావలసినను సెలవైన ఇప్పుడే సిద్ధము చేయించెదను. నాకు కాలయాపనమవుచున్నది.

సర్వం:—ఏమికావలయునో నాకేమియు బోధపడినదికాదు. ఇది నాకు క్రొత్తప్రపంచముగా నున్నది. నేను మయిమఱచియున్నాను. నాయనా ! నీవేమనుచున్నావు?

విజయుఁడు:—అమ్మా ! ఈమహానుభావుని కృపచేత చక్రవర్తికి కావలసినవస్తువులన్నియు సన్నద్ధములయి యున్నవి. వీరిపూర్వోత్తరసందర్భము తెలియకయుండుటయే కొంతచింత.

పురుషుఁడు:—అయ్యలాలా ! అది కాలక్రమమున తెలియవచ్చును. నా కిప్పుడు సెలవా ?

తల్లి-కొమారుఁడు:—మీరెవరైనను మాకు కులదైవముమీరే! మీకు ప్రత్యుపకారముఁ జేయ మేమెన్ని జన్మములెత్తినను సాధ్యము కాదు. సదామనసున ధ్యానముచేయుచు స్తుతించుచుండుట తప్ప వేఱుచేయ నశక్తులమయియున్నారము. సర్వదా మావందనముల నంగీకరించుచుండవలెనని సవినయముగఁ బ్రార్థించుచున్నారము. ఇంతే మాపునవి...........మమ్ము మఱవవలదు. (అని నమస్కరించుచున్నారు.)

దేవత:—మీరు సంకల్పసిద్ధులు. మీ కేవిధమయినను లోపము రాఁబోదు. అతిత్వరలో మీయభీష్టము లన్నియు సమకూరును. చింత యొకింతయు వలదు. (అని వచ్చిన దారిని వెళ్లిపోవుచున్నాఁడు.)

విజయుఁడు:—తల్లీ ! ఈ గడియలోపల నోటఁ జెప్పలేని అత్యద్భుతము లనేకములు జరిగినవి. దైవాజ్ఞలు కడు దురూహ్యములు.

సర్వాం:—నాయనా ! నీ వేలాగు వెళ్లినావు? ఏలాగు వచ్చినావు? నీవు తేఁగోరిన కమల మేమయినది? ఈయరణ్యములో నెందులకుఁ బడినావు? ఈపురుషుఁడు నీకెట్లు వశమాయెను ? ఈవృత్తాంతములు సమర్థకముగఁ దెల్పుము.

నిర్మల:—దేవిగారు ! ఇప్పుడేమి తొందరపాటు ! మన బిడ్డఁడు చాల అలసియున్నట్లున్నది. స్నానభోజనాదులయిన వెనుకఁ జెప్పవచ్చును.

సర్వాం—స్నానభోజనాదులెక్కడఁ జేయునది ?

నిర్మల:—ఇక్కడనే ! ఈమేడలోపలికి వెళ్లి చూచి వచ్చినాను. ఏమనను, ఇంద్రభవన! మీలాగుండదు. రథగజతురగపదాతులును, సేవకులును, చారులును, తుదకు వంటలుసయితము సిద్ధములై యున్నవి. ఈక్షణములోనే స్నానభోజనములు చేయవచ్చును. ఈయరణ్యములో నేనివియన్నియు నేలాగు కుదిరినవో నేనూహింపలేను.



సర్వాం:—(ఆశ్చర్యముతో) ఇవన్నియు నిజమేనా ?

విజయుఁడు —నేనును జూడలేదు. ఇప్పుడేవచ్చినాను. ఆపురుషుని ప్రసాదముచేత అన్నియు నాలాగేయుండవచ్చును. ఇవన్నియు వెనుక కనుఁగొనవచ్చును. కాని యింతకటాక్షము మనయందుంచిన ఆ పరమకారుణికుఁడగు శ్రీరామభద్రుని కొంచెము స్తుతించిపాడుదము. రమ్ము. తల్లీ ! నిర్మలచిత్తా ! నీవుకూడ పాడుము.

ఆలాగే ! చిత్తము.

(ముగ్గురును పాడుచున్నారు.)

రాగము, కదనకుతూహలము. తాళము, ఆది.

పల్లవి. జలజాతబంధుకులశేఖరా,
జగదీశ సజ్జనశ్రీకరా, జలజాతబంధుకులశేఖరా.
అనుపల్లవి. కలలోనుగూడఁ గనలేనివింత
గలిగించినావు కరుణించిమాపై. ॥జల॥
చరణము. త్రుటిలోనెయిందుండిన కాననం
బెటువోయెనో, యేమాయెనో
మటుమీఱు సామ్రాజ్యంబుతో
నిటువంటి హర్మ్యమ్మిప్పించినావు జలజాత॥
నమస్తే నమస్తే నమస్తే నమః.

(ఇంతలో నిద్దరు వైతాళికులు ప్రవేశించి) దేవ ! అన్నియు సన్నద్ధములై యున్నవి. స్నానభోజనములకు విజయంచేయవచ్చును. దేవిగారికిని అన్నియు సిద్ధమయియున్నవి.

విజయుఁడు.—అమ్మా ! వెళ్లుదమురండు.

వైతాళికుడు.—దేవ ! ఇదిగోమార్గము.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

---

# కమలాపహరణము.

## షష్ఠాంకము - ప్రథమస్థలము.

---

(మధురాపట్టణములో రాజవీధి.)

(లలిత, పురుష వేషముఁ దాల్చి ప్రవేశించుచున్నది).

లలిత.—నాప్రాణనాథుఁడు నన్నుఁబాసి వెడలిపోయి తొమ్మిదిమాసము లయినది. అనేక దేశములు, పురములు, తిరిగిచూచితిని. చారులుచూడని దేశము లేదన్నారు. ఆయనవార్త నాకిదివఱకు నుంతయు తెలియలేదాయెను. హా! విశ్వనాథా నేనేమి సేతును, దేవా! నాప్రాణేశుడు సురక్షితుఁడై యెక్కడనుండినను చాలును. త్రిమూర్తులారా! అష్టదిక్పాలకులారా! ఈయబలపై కనికరింపుఁడు. మిక్కిలి దుఃఖించుచున్న నావంటి నిరపరాధినియగు నబలమనసు నూరడింపఁదగినవార్తను మీరైనను జెప్పరా? మీరు నయితము దెల్పకపోయిన నాకేమిగతి? హా! ఈశ్వరా! కరుణింపవలయును,

రాగము, కేదార. తాళము, రూపకము.

పల్లవి. కరుణింపవలెరా, కరుణాజలధీ, కరుణించవలెరా,

అనుపల్లవి. పరమపురుషుఁడైననాదు పతిభిక్షంబొసఁగినన్ను॥ కరుణింప॥

చరణము. ప్రతిలేని ప్రతిజ్ఞఁ జేసి, మనమునొచ్చియుండిన, నా
కతుల సుఖానందంబుల నమర జేసియొకానాఁడే
సతీమణి చింతవలదు సర్వముసాధించియె, నే
నతివేగిమె వచ్చెదనని యీ ప్రయమము జేసివెడలె ॥కరు॥



నామనోహరుఁడు మహాపురుషుఁడు. అతని కేకీడునుగాని దేవుఁడు చేయఁడు. (ఇంతలో తిలోత్తమ పురుష వేషముఁ దాల్చి ప్రవేశించుచున్నది.) ఎవరోవచ్చుచున్నారు వారిద్వారా నానాథుని వృత్తాంత మేమయినను తెలియునేమో? కానీ చాటుననిలఁబడి వీరివృత్తాంతము కొంచెము తెలిసి కొందును గాక. (అని చాటున నిలువఁబడుచున్నది.)



తిలోత్తమ.—ఈయాఱుమాసములనుండియు ననేకనగర గ్రామసీమలు తిరిగిచూచుట మైనది. నాహృదయచోరుఁడగు నాప్రాణనాయకుని వృత్తాంతము ఎంతమాత్రము తెలియదాయెను. నేనేమి సేతును! రామచంద్రా! నాహృదయానందుని ముఖ చంద్రదర్శన మెపుడు లభించునో! అతని కటాక్షవీక్షణంబు లెప్పుడు నాపయిబడునో, అతనివాగమృతము నేనెప్పుడు పానము సేతునో అతనిస్పర్శ హరిచందనాను లేపనము నేనెపు డనుభవింతునో! అహాహా! నామోహము నేమనవచ్చును! (నిట్టూర్పుతో) అతనిదర్శనాదిసుఖములు నయితము వలదు. అత డెక్కడనైనను కుశలముగానున్నాఁ డను వార్త దెలిసినంజాలును. అదికూడఁ దెలియలేదే! దేవదేవా! రామచంద్రా!

రాగము, శాహాన. తాళము, త్రిపుట.

పల్లవి. వార్తామాత్రము చాలునే, నాసామి శుభ
వార్తామాత్రము చాలునే.

అనుపల్లవి. ఆర్తరక్షకా నిన్ను నడుగను వేఱొండును ॥వార్తా॥

చరణము. కనులారఁజూడకయే కనుగొనకయే పూర్వోత్తరముల్
వనితా బుద్ధితో వాని దలచియున్నానుగా
మనసిచ్చినానుగాన మనసు నియ్యకపోదు
ఇనకులతిలక! వా డిందున్నాడను శుభ ॥వార్తా॥

లలిత.—(ఆత్మగతము) ఈయెదుటివ్యక్తి యొక్కమాట పాటలు వినగ నాగతియే తటస్థించి యున్నటులున్నది, ఏకగతినిం బొందినవారిదఱు మారువేషముతో నొకచోటంగలిసి కొనుట! ఏమి చిత్రము (అని తిలోత్తమచెంతఁజేర నిద్దఱు నొండొరులఁ జూచి, పరస్పరమాత్మగతము) ఓహోహో! ఏమికాంతి! ఏమిలావణ్యము! ఏమితీరు! ఏమిస్థితిగతులు! ఇటువంటివ్యక్తిని నేనీవఱకు నెందును చూడలేదు. ఈలోకమునకర్హమైన వ్యక్తిగాదు.

తిలోత్తమ:—(లలితదగ్గఱఁజేరి) అయ్యా! నమస్కారము. నావలెనే తామును అధ్వగవేషధారులయి యున్నారు. తా మెవ్వరో సెలవిచ్చితిరేని చాల సంతోషించెదను.

లలిత:—అయ్యా! అనేక నమస్కారములు. నేను జ్యోతిష్కుఁడను. దేశాటనము నేయుచున్నాను. తామెవ్వరో దయచేసి సెలవియ్యవలయునని నాప్రార్థన.

తిలోత్తమ:—నేను గాయకుఁడను. తమవలెనే నేను దేశాటనము చేయుచున్నాను.

లలిత:—నేఁడు కడుసుదినము. తమవంటిమహనీయుల సాంగత్యము లభించినది. ఇప్పుడు తామెక్కడకు దయచేయఁదలఁచి యున్నారు?

తిలోత్తమ:—ఈపురము మిక్కిలి గొప్పదిగనున్నది. ఈరాజవీథి మిక్కిలి గంభీరముగ కనఁబడుచున్నది. ఈపట్టణములోపలికి వెళ్లవలెనని నాయుద్దేశము. తమయభిప్రాయమెట్టిదో?

లలిత:—నాయుద్దేశమును నదియే.

తిలోత్తమ:—అయిన మనమిద్దఱము కలిసి వెళ్ళుదమా?

లలిత:—అట్లేని చాల సంతోషము.

తిలోత్తమ:—నాకు చాల డప్పియగుచున్నది.

లలిత:—నాకును దాహముగ నున్నది. ఇదిగో నొక గొల్లదివచ్చుచున్నది. కొంచెము చల్లత్రాగుదము. (గొల్లది ప్రవేశించుచున్నది) అమ్మీ ఇలాగురమ్ము, దాహమునకు కొంచెము చల్లయిచ్చెదవా?



గొల్లది:—(వారిద్దఱినిజూచి విశేషగౌరవముతో ఆత్మగతము) వీరెవరో గొప్పవారుగా నున్నారు. (ప్రకాశముగా) బాబు పుచ్చుకొండు (అని లలిత చేతికిచ్చుచున్నది).

లలిత:—తాము పుచ్చుకొండు వెనుకనేను పుచ్చుకొంటాను. (అని తిలోత్తమ కిచ్చుచున్నది.)

తిలోత్తమ:—(త్రాగిచూచి) కడుబాగుగనున్నది. నాశ్రమమంతయు నివారణమైనది. తాము పుచ్చుకొండు. (అని లలిత కిచ్చుచున్నది.)

లలిత:—(తాగిచూచి) కడుస్వాదుగనున్నది. నేనిప్పుడు రెండామడనడువగలను. (గొల్లదానితో) అమ్మీ! నీవీసమయమందు మాశ్రమ పరిహారము చేసినందులకు మేమేమి ప్రతిచేయఁగలము! అయినను దీని నుంచుకొనుము. (అని యొక రత్నకంకణము నిచ్చుచున్నది.)

తిలోత్తమ:—దీనినుంచుకొనుము (అని యొక ముక్తాహారము నిచ్చుచున్నది.)

గొల్లది:—బాబు! మీరెవరో దేవులుగాని మనుష్యులుగారు. నేను యీకుండ చల్ల అమ్మితే ఒక అర్ధరూపాయి దొరకునో దొరకకపోనో. ఒకనేరుచల్లకే అనేకవేలు చేసే ఈలాటివస్తువు లిచ్చుచున్నారే. నేను చాలా చిన్నమనిషిని దీనికి తగినదాననుగానే.

ఇద్దరు:—అమ్మీ! ప్రతివస్తువునకును దానిలో నేమియు విలువలేదు. దేశకాలవర్తమానములనుబట్టి విలువయేకాని వేఱుకాదు. ఈసమయములో నీవు మాకు కలుగఁజేసిన శ్రమశాంతికి నీ కేమిచ్చినను జాలదు. ఈశ్వరసృష్టిలో అందఱు మనుష్యులును సమానులే కాని చిన్న, పెద్ద అని యేర్పాటులేదు. విద్యాబుద్ధులను పట్టి కొన్నిసమయములలో చిన్న, పెద్ద, అని అన్నను అనవచ్చునుగాని ద్రవ్యాదులనుపట్టి అనుట వట్టిమతిలేమియే. మఱియు లోకములో సాధారణముగ బుద్ధిగలవారే తొంబదితొమ్మిదిపాళ్లు

కాని, సమయము, సందర్భము, ఇవి కొందఱకు లేకపోవుటచే, ఆబుద్ధిని వినియోగించి విద్య సంపాదింప తప్పిపోదురే కాని వేఱుకాదు. ఈకారణమునుబట్టి అందఱు మనుష్యులునుసములే. నీకింతయు చింతవలదు. ఈవస్తువుల నుంచుకొనుము.

గొల్లది:—చిత్తం! మీరు మిక్కిలి దొడ్డవారు. మీదయచేత నేనిఁక వీధిఁబడఁబని లేదాయెను. ఈవస్తువు నమ్ముకొని పెద్దమోతు బరి సంసారినవుతాను. మీవంటివారు ఒక్కొక్క దేశమున కొక్కొక్కరుంటే చాలు.

లలిత:—అమ్మో! కనఁబడుచున్నదే. అదిగో పెద్దమేడ. అది యెవరిది?

గొల్లది:—శ్రీభీమేశ్వరమహారాజావారి మహాలు.

లలిత:—వారికి జ్యోతిషసంగీతములలో సరదా కలదా?

గొల్లది:—వారికెప్పుడున్ను సరదాలావు, ఇప్పుడైతేనో ముందటికంటె పదంతలు లావుగా నున్నదంట.

తిలోత్తమ:—కారణమేమి?

గొల్లది:—వారు చాలాదుఃఖపడియున్నారు. ఆదుఃఖాన్ని జోస్యసంగతములు వినుటలోనే పోగొట్టుకొంటూన్నారట. రాజ్యమేమో పాడైపోతున్నది.

లలిత:—వారు దుఃఖపడుటకు కారణమేమి?

గొల్లది:—వారికి కన్నులుపోయి ఇరవైసంవత్సరములకు పైఁగానైనది. ఎక్కడనో తామరపువ్వున్నదనిన్నీ, దానినితెచ్చి కంటికద్దితే, కన్నొస్తుందనిన్నీ ఎవరోఅన్నారఁట! దానికై వారికుమారులు నలుగురున్ను వెళ్లిపోయి సంవత్సరంపైగా నయినది. ఇదివరకు వచ్చారుకారు. ఈకారణములుబట్టి ఏజ్యోతిష్యుడువచ్చినా, మా కుమారు లెప్పుడువస్తారని అడగడం ఏసంగీతపాటకుడువచ్చినా వానితో ప్రొద్దుబుచ్చడం, ఇంతేకాని రాజ్యకార్యములన్నియు సుభ్రంగా వదిలి వేసినారు.



తిలోత్త:—(ఆత్మగతము) ఈవార్త అనుకూలముగానే యున్నది. నా హృదయేశ్వరుఁడు ఈనలుగురిలో నొకఁడుగానుండవచ్చును. అతఁడు తేఁగోరిన తామరసము మనదే, కాని ఆతామరసముపోయి ఆఱుమాసములయినదే. ఇదివఱకు అతఁడు ఇల్లుచేరలేదే! ఏమయి నాఁడో? జగత్పతి! రామభద్ర! నాప్రాణనాయకునికి ఆపదలురాకుండ రక్షించి నన్ను పాలింపవలసినభారము నీదేగాని నేనేమి చేయఁగలను! అఘటితఘటనాసమర్థుఁడవు నీవేగదా! (నిట్టూర్పుతో) అన్నిఁటికిని రాజునొద్దకు వెళ్లినచో వృత్తాంతమేమయినను తెలియవచ్చును. అక్కడికి వెళ్లుదము.

లలిత:—(ఆత్మగతం) ఈనలుగురికిని నాప్రాణనాథునికిని ఏమో అనుబంధమున్నది. కనుకనే వీరిని జ్ఞాపకమున నుంచుకొనుమని నాప్రాణనాథుఁడు చెప్పినాఁడు. వెళ్లునప్పుడు తనవ్యాపారము జనకప్రయుక్తమని చెప్పివెళ్లినాఁడు. అతఁడును ఈతామరసమునకే వెళ్లియుండునా? అతనికార్యము జనకప్రయుక్తమన్నాఁడు గనుక అతఁడు వీరియన్నదమ్ముఁడై యుండవలయును. ఏమో గొప్పవింతగానున్నది. ఈరాజువద్దకువెళ్లిన కొంతవర్తమానము తెలియవచ్చును.అని తోఁచుచున్నది. (తిలోత్తమతో ప్రకాశముగ) ఈరాజుగారికి సంగీతజ్యోతిషములయం దాసక్తియు, అభిరుచియు నున్నదిగనుక మన మక్కడకు వెళ్లుట మంచిది యని తోఁచుచున్నది. తమ అభిప్రాయ మెట్టిదో?

తిలోత్తమ:—నేను పూర్తిగ తమతో కలిసినాను. ఇద్దరము కలిసి వెళ్లుదము రండు.

గొల్లది:—బాబు! నాకు సెలవు. అనంతకోటివందనములు (అని వెళ్లిపోవుచున్నది.)

లలిత:—మనము ఒండొరులనామధేయమేమో తెలిసికొన్నాముకాము. నాపేరు గణితమూర్తియందురు. తమనామధేయ మేమో?

తిలోత్తమ:—నాదబ్రహ్మ మందురు.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

## షష్ఠాంకము - ద్వితీయస్థలము.

---

(భీమరాజునుహాలులోని సభామంటపము. భీమరాజు, మంత్రి, ఆత్మానందుఁడు, సర్వానందుఁడును ప్రవేశించుచున్నారు.)

భీమ:—మంత్రీ!

మంత్రి:—చిత్తం మహాప్రభూ!

భీమ:—ఆత్మానందులు, సర్వానందులు వచ్చియున్నారా?

ఆత్మా, సర్వా:—కనిపెట్టియున్నాము దేవరా!

భీమ:—మనబిడ్డలు, ఆ కమలమునకై వెడలి చాలకాలమాయెనుగదా?

మంత్రి:—అవును మహాప్రభూ!

భీమ:—కమలము దొరకకపోయినచో వారైనను సురక్షితులై వచ్చినఁ జాలునని తలఁపవలసియున్నది.

సర్వా:—ప్రభువువారి కన్నియు వేగమే సఫలమౌనని దృఢముగఁ జెప్పఁగలను దేవా!

భీమ:—తమవాక్యమందు నాకెప్పుడును నమ్మకమే, కాని యీనమ్మకమును మఱింత దృఢపఱుపఁదగినది మఱియొకటికూడ సంభవించినది. దాని మనహితులకందఱకును దెలుపవలెననియే నేడు సభకు వచ్చితిని. సావధానముగా నందఱును వినవలయును.

అందఱు:—అతిజాగరూకులమై యున్నాము మహాప్రభూ!

భీమ:—నిన్నరాత్రి చిత్రమైనకలయొకటిగంటిని; అదియేమన, రమారమి రెండుజాములరాత్రివేళ, నొకసిద్ధుఁడు నాయెదుటకు వచ్చెను. ఆకమలముయొక్క పూర్వోత్తరములఁ జెప్పిరే వారే. నన్నులేపి "రాజా నీవుచింతమానుము, అతివేగముగా నీకొమరులు వచ్చుటయేకాక, నీయాంధ్యముసైతము తీరిపోవుచున్నది. మఱియు, నీస్వయంకృతానర్థముచేఁ బ్రస్తుతము నష్టమైయుండు ననర్ఘమగు రత్నమొకటియు, తదనుగుణములైన మఱికొన్నిరత్నవిశేషములును నీకు లభింపఁబోవుచున్నవి. ఇకనైనను జాగ్రత్తగాను సుఖము



గాను ఉండుము" అనిచెప్పి యంతర్ధానమాయెను. దీనికేమనుచున్నారు మీరు?

అందఱు:—చాలసంతోషము మహాప్రభూ! ఏలినవారి కన్నిమంగళములును త్వరలో సమకూడఁబోవుచున్నవి. మఱేమిచింత?

భీమ:—కాని, నాస్వయంకృతానర్థముచేఁ బ్రస్తుతము నష్టమైయుండు ననర్ఘరత్నమొకటి, దానికనుగుణములగు మఱికొన్ని రత్నవిశేషములును లభింపఁబోవుచున్నవి. అనుమాటలు నాకు బోధపడకున్నవి.

ఆత్మా:—శ్రీయేలినవారికి సంతోషము గలిగించుటకై యన్నమాటలేకాని వేఱుకాదు.

మంత్రిసర్వా:—సిద్ధులమాటలు సహేతుకములై యుండునుగాని నిరర్థకములైయుండునా?

ఆత్మా:—(కోపముతో) సార్థకములగుట కేమియున్నదండీ?

సర్వా:—కోపమేల మహాత్మా, ప్రపంచములో మహర్షులుసైత మీవఱకు విని కని యెఱుఁగని వింతలు పెక్కు గలవు. తమకుఁ దెలియని యంశమా?

ఆత్మా:—(ఆత్మగతము) వీరిద్దఱును చేరి యేమికుట్రచేసినను లాభమేమి?

భీమ:—పోనీ, లేని కాని వానినిగుఱించి చర్చయిప్పుడేల? ఏమౌచున్నదో చూచుకొందముగాక.

అందఱు:—చిత్రము దేవా!

భీమ:—ఇపుడు నాయుల్లము కొంచెముత్సాహమును బొందియున్నది. ఆయుత్సాహమును వృద్ధిఁజేయఁదగిన వ్యాపారమేదైన వెదకవలెను. (కొంత ఆలోచించి) సరియే, సర్వానన్దులుగారు! ఎవరో జ్యోతిష్కులును, సంగీతవిద్వాంసులును, వచ్చియున్నారంటిరిగదా. వారినిరప్పించినచోఁ గొంతవఱకు సంతోషముగా కాలక్షేపముఁ జేయవచ్చును.

సర్వా:—వారు ప్రతిదినమును వచ్చి సమయము కాలేదని వెళ్ళిపోవుచున్నారు. ఇపుడును నాతోఁగూడనే వచ్చి,సింహద్వారములోఁ గని పెట్టియున్నారు.

వేత్రవతి:—నేనుకూడ చూచేను, మహాప్రభూ !

భీమ:—ఆలాగా? వేత్రవతి! వెళ్లి వారిని తోడ్కొని వేగముగా రమ్ము.

వేత్ర:—చిత్తం మహాప్రభు. (కొన్నియడుగులు నడిచి మరలివచ్చి)మహాప్రభు, వారిద్దఱును ఈలోకములోనివారుగా కనఁబడ లేదు, మహాప్రభూ !

భీమ:—మఱెవరుగాఁ గనుపడుచున్నారు ?

వేత్ర:—నాకుఁజెప్ప శక్యంగాదు మహాప్రభు, వారిముఖముయొక్క తేజస్సు, వారిసొగసు, ఠీవి, స్థితిగతి, యేమిచెప్పను మహాప్రభు ! మన్మథుఁడు వారిని జూచితే సిగ్గుపడకమానఁడు.

భీమ:— ఆర్యులారా ! వేత్రవతిమాటలు వినుచున్నారా !

సర్వా:—వేత్రవతి యన్న-ప్రతిమాటలోని ప్రత్యక్షరమును నిజమే.

భీమ:—ఆలాగా, సరియే, మీకందఱికిని నేత్రశ్రోత్రానందము సిద్ధము. నామట్టుకొక్కటియే; సిద్ధులు వరమిచ్చినరీతిని త్వరలో రెండును లభింపవచ్చునేమో, ఆయాశతోనే యుందుముగాక, ఆశలేనియెడ ప్రపంచకృత్యమే యుండదుగదా ?

మంత్రిసర్వా:—శ్రీయేలినవారికి పైయానన్దములు రెండును వెంటనే లభింపకతప్పవు.

భీమ:—అనుగృహీతోస్మి. వేత్రవతి ! వారినివెంటనే తోడ్కొనిరమ్ము.

వేత్ర:—చిత్తం మహాప్రభూ (అని వెళ్లుచున్నది.)

భీమ:—వేత్రవతి చెప్పినది వాస్తవమేనా.

సర్వా:—ప్రత్యక్షరమును వాస్తవమే. వారినిజూచి నాకు మతిభ్రమగఁబోయినది, మహాప్రభు ! శ్రీయేలినవారు చూచినతరువాత మమ్మందఱిని మీఱి యానన్దింతురని గట్టిగ మనవి చేయఁగలను.

ఆత్మా:—రాజు మెచ్చినది రంభకదా !



సర్వా:—రాజుమెచ్చునదిరంభో రెడ్డిమెచ్చునదిరంభో యీక్షణమే తేటపడుచున్నది. ఇదిగో వారువచ్చిరి.

వేత్ర:—ఇలాదయచేయండి (అనుచు నిద్దరితోఁ బ్రవేశించుచున్నది.)

లలిత, తిలో:—విజయతాం విజయతాం దేవః.

భీమ:—ధన్యోస్మి, అనుగృహీతోస్మి, విద్వాంసుల కాసన మొసగుఁడు.

లలిత, తిలోత్తమ:—కూర్చున్నాము మహాప్రభు.

ఆత్మా:—(జనాన్తికము) అవునోయి ! నీమాటలన్నియు వాస్తవమే. ఈ రీతివ్యక్తులు అశ్రుతదృష్టపూర్వములే. అహాహా! ఏమిసొగసు, నేఁడు మంచిసుదినము వీరిని జూచినాను.

సర్వా:—నామాటంటే మీకు లక్ష్యములేదు, ఏమిచేయను.

భీమ:—సంగీతవిద్వాంసుల నామధేయ మేమో.

తిలో:—నాద బ్రహ్మమందురు.

భీమ:—జ్యోతిష్కులదో.

లలిత:—గణితమూర్తి యందురు.

భీమ:— మిమ్ముఁ జూచునంతటిపుణ్యము నేఁజేసికొనలేదు.

ఇద్దరు:—త్వరలోనే తమ కావిచారము దీరునుగాక.

భీమ:—కొంచెము సుస్తిగా నుండినందున వెంటనే దర్శన మిప్పింపలేకపోతిమి. వేఱొకవిధముగా నెంచవలదు.

ఇద్దరు:—ప్రభువుగారు ఆలాగు సెలవియ్యనక్కఱలేదు. "రాజ్యంస్వహస్తధృతదండమివాతపత్రం" అనునంశము మేము నెఱిఁగినవారమే.

భీమ:—చాల బాగుగ నన్నారు. సర్వానందులుగారు ! సంగీతములో కొంతకాలక్షేపము చేయుదమా.

అందఱు—చిత్తము మహాప్రభు !

భీమ:—మీరు గాత్రజంత్రములలో దేనిని వినియోగించెదరు ?

తిలో:— పాడుచు వీణవాయింపఁగలనుగాని నావీణ తెచ్చుకోలేదు.

భీమ:—అయిన గాత్రముతో పాడెదరుగదా!

తిలో:—చిత్తము.

భీమ:—సరియే. కాని, సంగీతశాస్త్రవిచారము కొంతచేయవచ్చునా.

తిలో:—నామనవియే యది.

భీమ:—చాలసంతోషము, కమలామనోహరి యే రాగజన్యము?

తిలో:—సరసాంగిజన్యము. ౨౭ వ మేళకర్త.

భీమ:—గానమూర్తి జన్యరాగములేవి?

తిలో:—లలితతోడి, సారంగలలిత, సామవరాళి, భిన్నపంచమము, గిరికర్ణిక, సురటి, మలార్, మంగళగౌరి, త్రియంబకప్రియ.

భీమ:—కోకిలధ్వనికి ఆరోహణావరోహణక్రమమును, దెలుపవలయు.

తిలో:—సరిగమ, ధనిధస, సనిధనిపమగరిస.

భీమ:—చాలబాగుగ నన్నారు. పుష్పలతికారాగములో వర్జ్యస్వరము లేవి. అది యే మేళకర్త జన్యము?

తిలో:—ధైవతమొకటియే వర్జ్యము; ౨౨ వ మేళకర్త:ఖరహరప్రియా జన్యము.

భీమ:—నాయకికిని దర్బారునకును దేనిలో భేదము.

తిలో:—ఆరోహణములో పధపస-నాయకి. పధనిస-దర్బారు. రెంటికిని గాంధారము వర్జ్యము.

భీమ:—మీజ్ఞానమునకుఁ జాల మెచ్చితిమి. విశేషముగఁ బరిశ్రమచేసి పరిజ్ఞానము సంపాదించియున్నారు.సర్వానందు లేమనుచున్నారో.

సర్వా:—ఏలినవారు సెలవిచ్చినదే నాయభిప్రాయముగూడ. సెలవైనచో శృంగారరసవిషయములందుఁ గొన్నియంశముల నడిగెదను.

భీమ:—ఆలాగే. విద్వాంసు లేమనుచున్నారో?

తిలో:—తెలిసినంతవఱకుఁ జెప్ప బద్ధుడనై యున్నాను.

సర్వా:—మంచిది అడిగెదను. శఠనాయకునికి లక్షణమేమి?

తిలో:—"గూఢవిప్రియకృత్ శఠః."



సర్వా:—ఖండితనాయికకు లక్షణపద్య మేదైనఁ జదివినఁ జాల సంతోషింతును.

తిలో:—చిత్తము. జ్యోతిష్కులుగారు తమకేదైనఁ దెలియునా (అనగా)

లలిత:—నాకొకటి తెలియును. "జాతస్తే నిశి" అనునది.

తిలో:—నాకును అది తెలియును గనుక మనమిద్దఱమును గలసి చదువవచ్చునుగదా.

లలిత:—ఆలాగుచేయవచ్చును. (అని యిద్దఱును జదువుచున్నారు.)

(రాగము - భైరవి.)

"జాతస్తేనిశిజాగరః, మమపునః, నేత్రాంబుజే శోణిమా
నిష్పీతం భవతామధుప్రవితతం, వ్యాఘూర్ణితం మేమనః।
భ్రామ్యద్భృంగఘనేనికుఞ్జభవనే, లబ్ధంత్వయా శ్రీఫలం
పంచేషుః పునరేషమాం, హుతవహాక్రూరైశ్శరైఃకృన్తతి."

భీమ:—సెబాస్! మనసంస్థానపండితు లందఱును వీరివద్ద శిష్యఱికము చేయవలసియుండు నన్నట్టులున్నదే.

సర్వా:—ఆలాగేయున్నది మహాప్రభు. వీరిప్రజ్ఞ, చాలదొడ్డదిగఁ గనఁబడుచున్నది. మఱియొకప్రశ్నమాత్ర మడుగుచున్నాను. దానికేమిసమాధానము చెప్పెదరో చూడవలెను.

లలి, తిలో:—మాకుఁదెలిసినంతవఱకు మనవిచేసికొనుట మాకు విధాయకముగదా.

సర్వా:—విధాయకమని నేననుగాని మీరు చెప్పఁదగిన సామర్థ్యము గలవారనియే యడుగుచున్నాను.

లలి, తిలో:—సెలవియ్యవలయును.

సర్వా:—నాయకులను, అనుకూలుఁడు, దక్షిణుఁడు, శఠుఁడు, ధూర్తుఁడు అని నాలుగుతెరగతులుగా మాత్రమే విభజించి పాఱవేసిరే. నాయికలనుమాత్రము దిక్కుమాలినన్ని తరగతులుగా విభజింపఁ గారణమేమి?

తిలో, లలిత:—ఈచర్చ చాలసాగనై నదిగాని, తగిన సమాధానము చెప్పఁగలమో లేమో. అయినను ప్రస్తుతము స్ఫురించుదానిని మనవిచేసికొనుచున్నాము. సృష్టిలోనే, పురుషులకును స్త్రీలకును భేదముగొప్పది. ఇదిగాక, పురుషులపద్ధతులు, అవస్థలు, ఊహలు, బుద్ధికౌశలములు వేఱు. ఇవియే స్త్రీలయందు వేఱుగానున్నవి.

భీమ:—అయిననేమి.

తిలో:—ఈభేదములనుబట్టి స్త్రీలకు సహజములగు కొన్నియంశములు పురుషుల కదుకవు.

సర్వా:—నాకు బోధపడ లేదు, తేటతెల్లముగ దయచేసి చెప్పవలెను.

తిలో:—చిత్తము; నాయికలను స్వీయ, పరకీయ, సామాన్య, అనివిభజించియున్నారుగదా. నాయకునకు పరకీయత్వము ఎంతమాత్ర మదుకదే.

సర్వా:—ఏల?

తిలో:—పరకీయత్వము నాయకులకుఁ జెప్పినచో, ప్రతిదక్షిణనాయకుఁడును పరకీయుఁడగునుగదా.

భీమ:— బాగు.

తిలో:—మఱియు నాయికలకష్టవిధావస్థలు చెప్పియున్నారుగదా. ఈయష్టవిధావస్థలు నాయకుల కదుకవే.

సర్వా:—ఏలయదుకవు. ప్రోషితనాయికత్వము, విరహోత్కంఠితత్వము, కలహాంతరితత్వము, అభిసారికత్వము, నాయకుల కుండవచ్చును గదా.

తిలో:—చిత్తము, ఇవియుండవచ్చును, గాని స్వాధీననాయికత్వము, వాసకసజ్జికత్వము, ఖండితత్వము, ఇవినాయకుల కుండఁదగినవి కావుకదా?

సర్వా:—ఖండితత్వ మేలకూడదు?

తిలో:—నాయకుఁడు ఖండితుఁడగునేని, తన్నాయిక కులటయగును;అనాయకుఁడా నాయికయొక్క ముఖముఁ జూడఁడు.



సర్వా:—అటులేల? తన్నాయిక పరకీయగ నుండఁగూడదా?

తిలో, లలిత:—ఒకనాయిక కులకాంతగనుండియు, తనభర్తపైఁగాక యన్యునిపై మోహావిష్టచిత్తురాలై, కక్కుర్తిపనులఁ జేయునది పరకీయగాని, వ్యవస్థలేక యనేకులతోఁ బ్రవర్తించునది కాదుగదా.

సర్వా:—మీరన్నది సత్యమే; (కొంత యాలోచించి) కాని యానాయిక సామాన్యయన్నచో?

తిలో, లలిత:—సామాన్యకుసయితము కులమున్నదిగదా, తనకులమునకు నుచితమగు ప్రవర్తనల వదలిపెట్టి యథేచ్ఛముగఁదిరుగునది కులట కులకాంతగనుండి, అన్యసంగవికృతగ, స్వనాయకుని కగుపడునదికులటయేగాని సామాన్యకాదు. నాయకుఁడట్టినాయికను కన్నెత్తిచూడఁడు. కనుక నాయకునికి ఖండితత్వముఁ గల్పించుట కడు రసభంగద్యోతకముగనుండును.

సర్వా:—మంచిసమాధానము.

తిలో:—ఈకారణములంబట్టి నాయకులకును నాయికలకును నేకరీతిగ విభాగము గల్పించిన అవ్యాప్తిదోషము, అతివ్యాప్తిదోషము రెండును తటస్థించునని మానివేసిరని తోఁచెడిని.

భీముఁడు:—చాల ప్రశస్తమైన సమాధానము.

లలిత:—మఱియొక కారణముగూడ తోచుచున్నది, మహాప్రభు!

భీముఁడు:—ఏమది?

లలిత:—ఈయష్టవిధావస్థలఁ దెలుపుమాటలుగాని కల్పనలుగాని నాయికల నోటవచ్చిన చాల నాజూకుగనుండును. నాయకులనోట మోటుగానుండుటయేగాక అంతగా పొందిపొసగియుండదనుట.

భీము:—నేబాసు, నేబాసు, మీరు చెప్పినది బహుయుక్తియుక్తముగనున్నది. ఏమనుచున్నారు సభవారందరును.

అందఱు:—నోరెత్త నెవరికిని శక్యముగాకయున్నది. వీరిద్దరి విద్వత్తును కడునిర్మలమైనది.

భీము:—సంగీతవిద్వాంసులకు మరల శ్రమము కొంచెము గలుగజేయ వలయునను కోరిక కలిగి యున్నది.

తిలో॰, లలిత:—శ్రీయేలిన వారియాజ్ఞను శిరసావహించుట మా ప్రధాన ధర్మము.

భీము:—కొన్ని రాగప్రయుక్తశంక చిరకాలము నాకు గలిగియున్నది. దాని నివారణము గలిగించదగిన సందర్భ మిదివరకుదటస్థించలేదు. సంగీతములో వీరి ప్రజ్ఞచాల దొడ్డదిగనున్నది. కనుక వీరే యాశంకను దొలగింతురని దృఢముగ నమ్మెదను.

తిలో॰, లలిత:—దయచేసి సెలవియ్యవలయును.

భీము:—ఆభేరి రాగమే మేళకర్తాజన్యము ?

తిలో॰:—ఈప్రశ్నచాల నాజూకైనది. కాని యీశంకయే నాకునుగలిగి యొకరీతిని నివారించుకొని యున్నాను. దాని మనవి జేసికొనియెద. ఈరాగమును శుద్ధధైవతముతో కొందరును, చతుశ్శ్రుతిధైవతముతో మరికొందరును పాడుట వాడుకలో నున్నది. రెండుపద్ధతులును రమ్యములుగానే యున్నవి. కనుక పై రాగము నటభైరవిజన్యముగనుండిన నుండవచ్చును, లేక ఖరహరప్రియజన్యముగ నుండిన నుండవచ్చును. (కొంతతాళి) ఇది నాసిద్ధాంతము.

భీము:—సారంగ శుద్ధమధ్యమ రాగమా, ప్రతిమధ్యమ రాగమా ?

లలిత:—ఈరాగములో రెండుమధ్యమములును బలుకుచున్నవి. కాని ప్రతిమధ్యమ మూర్ఛనకే ప్రాధాన్యమిచ్చియున్నారు గాన శుద్ధమధ్యమరాగమనుటకు వీలు లేదని తోచుచున్నది.

భీము:—సౌరాష్ట్రమే మేళకర్తాజన్యము ?

తిలో॰:—ఈరాగము మాయామాళవగౌళజన్యమని పెక్కు గ్రంథములలో జెప్పఁబడి యున్నది, కాని ప్రకృతము గొప్పవిద్వాంసులు పాడుచుండురీతింబట్టి ధీరశంకరాభరణజన్యమని తోచుచున్నది.



భీము:—మీయభిప్రాయములంబట్టి చూడ, ప్రాచీనసంగీతలక్షణగ్రంథములలో వివరించియుండు పద్ధతికిని ప్రకృతము సంగీతవిద్వచ్ఛిరోమణులు పాడుటలో నవలంబించు పద్ధతికినికొన్ని యంశములలో భేదమున్నదని యూహించవలసినదే కదా ?

ఇద్దరు:—చిత్తము లక్ష్యములోనుండి లక్షణముబుట్టుట సహజము. లక్ష్యము ప్రధానము. లక్షణము తల్లక్ష్యములోనుండి కల్పింపబడి, దానికి సహకారిగ నుండవలసినదే; కనుక ప్రాచీనసంగీతోద్గ్రంథములలో వివరింపబడియుండు పద్ధతికిని, ప్రస్తుతము పాడు వారిపద్ధతికిని, యథోచితముగ సవరణము జేయ నిప్పటిసంగీతవిద్వాంససార్వభౌములుద్యమించుట సుతరాం శ్లాఘనీయమని మా మనవి.

భీము:—సర్వానందులుంగారు! సంగీతము, జ్యోతిషము, రెంటిలోను వీరిద్దరికిని సమానమైన దొడ్డప్రజ్ఞ కనఁబడుచున్నది. కొన్ని రాగప్రయుక్తమై నాకు గలిగియుండు శంకను నివారించుటకై వీరిచ్చిన యభిప్రాయములు ఇదివరకు నాకు గలిగియుండినవియే, నాయభిప్రాయములనే వీరు కనుగొని చెప్పుట గొప్ప విచిత్రము. జ్యోతిషముయొక్క శక్తి కాబోలు.

ఇద్దరు:—శ్రీయేలినవారికి మాయందు గలిగియుండు నిర్హేతుక జాయమానకటాక్షఫలమే కాని వేరుకాదు.

భీము:—శాస్త్రచర్చనుచాలించి, సంగీతము కొంచెము విందుము గాని.

అందఱు:—చిత్తము మహాప్రభూ!

భీము:—జ్యోతిష్కులకు గూడ గీతములో మంచిప్రవేశమున్నది. ఇద్దఱును కలసిపాడుట మంచిది.

ఇద్దఱు:—చిత్తము (కలసిమాటలాడి) సెలవుప్రకారము పాడెదము (అని పాడుచున్నారు.)

(రాగము-కాపి. తాళము-చాపు.)

పల్లవి:—పరిపాలయ, కేశవ! మాం, పరిపాలయ కేశవ.

అనుపల్లవి:—పరిపాలయ, కేశవ! మాధవ,
శ్రీధర దామోదర! పరిపాలయ కేశవ.
చరణము:—జానకీదేవీ మనోనాయక, దు
ర్దానవవంశ దాహకసాయక!
శ్రీనివాసదాస శ్రేయోదాయక! పరిపాలయ.

భీము:—కడు రమణీయమగు సంగీతము, భావమును తదనుకూలముగ నున్నది. భక్తిరసముచాలు శృంగార రసములో నొకటి పాడినఁ జాల సంతోషించెదము.

ఇద్దరు:—అలాగే (అని పాడెదరు).

(రాగము-యదుకులకాంభోజి. తాళము-త్రిపుట)

పల్లవి:—విజయకుమార! విజయావతార!, వినుమా మావిన్నపము.
అనుపల్లవి:—సుజనాంబుధిచన్ద్ర! సుగుణసాన్ద్ర! నిన్ని
గజరాజగమన గతిగా నమ్మియున్నది. విజయ.

చరణములు:—పుష్పబాణరూప! పురుషసింహా! నిన్నీ
పుడమిలోనందఱు పొగడగ వినియే, యీ
పూబోణివలచి, యాపూవింటివానితో
పోరాడలేక నీ పొందే కోరియున్నది. విజయ.

మోహనాకార! యీ ముద్దియమారుని
మోహానివలెవచ్చి, మొఱబెట్టుచున్నది
మోసమయ్యెనాకు మురవైరిసుతునిచే
మోముఁజూపి యొకముద్దైననిమ్మని. విజయ.

గానలోల! వేఱు మానవేశుని, నీ
మానినికోరదు, శ్రీనివాసుఁడెసాక్షి



ప్రాణత్యాగముఁ జేయఁ, బూనుకొన్నది, దీని
పాణిగ్రహణముఁజేసి పాలింపవలెదేవా. విజయ.

భీము:—మీరందఱును విన్నారుగదా! ఇదిగదా సంగీతము. ఒకతూరి కాదు నాలుగుమాఱులు, అతిజాగ్రత్తతో వడపోసిన సంగీత మిది. ఆధీమా, భావానుగుణముగ రాగము, సంగతులు అన్నియు చాల సొగసుగ పొంది పొసగియున్నవి. మంత్రి! మీయభిప్రాయమేమో? పండితు లేమనుచున్నారో.

అందఱు:—శ్రీయేలినవారు సెలవిచ్చినదంతయు వాస్తవమే. విన్న నిటువంటి సంగీతమే వినవలెను.

ఆత్మా:—విషమతాళములతో బనిసేతురేమో?

తిలో:—చిత్తము చేయగలనుగాని యవియన్నియు సంగీతపుగరిడియే, కాని వానిలో సుఖభాగము చాలతక్కువ.

ఆత్మా:—ఆపనులు చాల కష్టమైనవికావా?

తిలో:—చిత్తము. అవును. గుండురాళ్లమ్రింగుటకష్టమే. కొందరద్దమును గొఱికినను లెదరు. ఇదియు గష్టమే. వీనిజేయువారి కేమిలాభము? ఇతరులకైన నేమిలాభము? సంగీతము సుఖమునకై పుట్టినది. పాడువారికిని, వినువారికిని, సుఖమునిచ్చుసంగీతమే సంగీతము. విషమతాళముతోఁ బల్లవిపాడుచు, ఆవృత్తమొకటి నాలుగుగడియలసేపుపాడుచు ౕ ౯ ముక్తాయింపులియ్య బ్రయత్నముచేయువారిముఖధాతువు, కరచరణాద్యవయవములయవస్థలు నెంతసొంపుగనుండునో, తామందఱును జిత్తగించినయంశములే గదా! అట్టి యవస్థలో వారియెదుట నొక నిలువుటద్దమునుంచినచో వారికి వారే సిగ్గుపడకమానరు.

సర్వా:—సెబాసు! మంచిదెబ్బ గొట్టితిరి. మంచిరసభరితములగుమాటలంటిరి.

భీము:—వీరికి జాల శ్రమము గలుగ చేసినాము.

ఇద్దరు:—ఎంతమాత్రములేదు మహాప్రభు, రెండునిమిషములు సెలవుదయచేయవలయును. ఇప్పుడే వచ్చెదము.

భీమ:—అలాగే.

ఇద్దఱు:—(పైకివచ్చి) ఈరాజుగారు రసికాగ్రేసర శిరోమణిగ నున్నారు.

లలిత:—కాని, ఆత్మ బుద్ధి యంతగా శ్లాఘ్యములని నాకుతోఁచలేదు.

తిలో:—ఏలాగు.

లలిత:—వెనుకమనవిచేసెద (అనివెళ్లుదురు).

భీమ:—మంత్రీ రెండవతూరిపాడినశృంగారపదము ఏమో భావగర్భితముగనుండు నటులు దోఁచుచున్నది కాదా!

మంత్రి, సర్వా:—అవును మహాప్రభూ!

మంత్రి:—(జనాన్తికముగ) సర్వానన్దులు గారు! వీరిద్దఱిమోములును జక్కఁగఁ జూచినారా?

సర్వా:—(జనాన్తికముగ) నేనడుగఁ దలఁచి యుంటిని, మీరే యడిగితిరి. మంచిది. వీరెవరో లోకోత్తర స్త్రీలు, ఏదోకార్యార్థముగఁ బురుషవేషములు దాల్చి వచ్చియున్నారని తోఁచుచున్నది.

మంత్రి:—బాగుగా సెలవిచ్చినారు. "విజయకుమార" అనియారంభములో నుపయోగించిరి. ఇందేదో పరమాద్భుతరహస్యమున్నదనుట స్పష్టము.

సర్వా:—అవును. అదియు వేగమే తేటపడును.(ఇంతలో సిద్ధులునురాఁగా) ఇదిగో వారేవచ్చిరి.

భీమ:—జ్యోతిష్కులకు కొంత శ్రమయియ్యవచ్చునా.

లలి:—చిత్తము కనిపెట్టికొనియున్నాను.

భీమ:—నానలుగురు కుమారు లెప్పుడువత్తురు?

లలి:—"ప్రశ్నాక్షరం ద్విగుణితం ద్వాదశాక్షర మిశ్రితం, గ్రహసంఖ్యాహరేద్భాగం శేషం ఫల ముదీరయేత్." (కొంత లెక్కచూచి) "రసైశ్చతుర్భిః నిజకార్యసిద్ధిః" మహాప్రభు! అతివేగమే వచ్చుచున్నారు.



దౌవారి:—(తొందరతో బ్రవేశించి) మహాప్రభూ! కుమారులునలుగురును చాలతొందరతో పరుగెత్తివచ్చుచున్నారు.

అందఱు:—ఏమాశ్చర్యము! జ్యోతిష్కులకోటిమాటనోటనుండగానే వచ్చిరే! (కుమారులు, మూర్తితప్పముగ్గురును నొకరిపై నొకరుపడుచు బ్రవేశించి) నేను తెచ్చితిని. మహాప్రభు! నేను తెచ్చితినిమహాప్రభు! అని కేకలువేయుదురు).

భీమ:—బిడ్డలారా! సురక్షితులై వచ్చినారుగదా చాలా సంతోషము. నేడుమంచిసుదినం.

ముగ్గురు:—(మూర్తితప్ప ముగ్గురు కమలమునుబట్టుకొని) చాలగొప్పసాహసములుచేసి యీపూవుఁదెచ్చినాము తండ్రీ మేము దీనికైపడినపాట్లు చెప్పశక్యముకాదు. (అని పూవునుతండ్రిగారు కంటిమీదనుంచుదురు).

తిలో:—(ఆత్మగతము)నలుగురేమి! నాస్థలమునకువచ్చుటేమి! ఈపూవును తెచ్చుటేమి! ఏమో గొప్పవింతజరిగియున్నది. త్వరలోనే తేటపడవచ్చును.

లలిత:—(తిలోత్తమతో జనాంతికము) ఏమోగొప్ప ఘోరముగజరిగియున్నది. పూవుదెచ్చినవారువీరుకారు, వేఱొకరుండవలెను. అతనికిని వీరికిని సంబంధముండునటులనున్నది. ఈపూర్వోత్తరము వెనుక మనవిచేసెదను.

భీముఁడు:—(ఆపూవు కంటికిదగిలినంతనే దృష్టిరాఁగా (గన్నులు తెఱచి చూచివిశేషానందముతోనలు ప్రక్కలముఖము ద్రిప్పి) ఓహోహో! ఏమివింత! ఈకుసుమముయొక్క మహామహిమ నేమనవచ్చును! నాకిపుడొకవిజాతీయమగు బుద్ధికుశలతయును బ్రహ్మానందమును గలుగుచున్నవి. బిడ్డలారా! పుత్త్రులనఁగా మీరేపుత్త్రులు, మఱే మనకక్కఱలేదు. క్రొత్తజన్మము గలిగించితిరిగా (అని వారిని వేఱువేఱుగా నాలింగనము జేసికొనును.)

ఆత్మా:—చూచితిరా. కుమారు లేలాటిగొప్పపని చేసినారో.

మంత్రి, సర్వా:—బాగుగనున్నది. (జనాంతికముగ నొండొరులతో)

ఏమిపండితవర్యా? ఏదియో గొప్పవింత జరిగినట్లున్నది. (అని మంత్రియనఁగా సర్వానందుఁడు) వింతేకాదు గొప్పకృత్త్రిమము మోసమును జరిగియున్నవి. నిస్సంశయము కాని యన్నియు వెంటనే బయలుపడకమానవు. కొంత తాళవలెను.

భీము:—సభ్యులార! నాజీవితకాలములో నేఁటిదినమువంటి దిన మిదివఱకును లేదు. ఇఁక రాదు. నాపుత్త్రులే పుత్త్రులు. (అని వారిని మ, మఱియుఁ గౌఁగిలించుకొనును.)

ముగ్గురు:—తండ్రి! ఇదియేమి గొప్పపని. సెలవైన నీక్షణమే యింద్రునికి సంకెళ్లుతగిలించి తమయెదుటఁ బెట్టెదము.

భీము:—ఈరీతిని మీరు వాగ్వ్యయముఁ జేయుట శ్రేయోవహముగాదు. ఇంద్రుఁడు అందఱికిం బూజనీయుఁడు (దౌవారికుఁడు ప్రవేశించి మంత్రిచేతికి జలదారుతో బ్రకాశించుచున్న సంచియొకటియియ్యగా దానిలో నుండు ఖూర్జపత్త్రములో వ్రాసియున్న యుత్తరమును మంత్రి చదువుకొని)

మంత్రి:—మహాప్రభు; మనరాజ్యముయొక్క సరిహద్దులో మనరాజధానికి కొంతదూరములో నెవఁడో మహానుభావుఁడు కొన్నాళ్లకు ముందువచ్చి, గొప్పనగరమొకటి నిర్మించెననియు, మనపురవాసులనేకులు మననగరమును వదలిపెట్టి, యామహానుభావునియాశ్రయముచే నతని నగరమునకు వెడలిపోయి, యక్కడనే కాపురస్థులయి యుండిరనియు శ్రీయేలినవారి దివ్యచిత్తమునకు విశదమైనదే కదా.

భీము:—అవునవును, అతఁడు మనదర్శనముగోరి తనపురమునకు దయచేయుఁడని యీవఱకే ఒకటి రెండుమాఱు లుత్తరములు వ్రాసెను. మీరిప్పుడు చదివిన యీయుత్తర మతనివద్దనుండి వచ్చినదేనా.

మంత్రి:—చిత్తము మహాప్రభూ!

భీము:—ఏమనుచున్నాఁడు చదువుఁడీ.

మంత్రి:—మహాఘనతవహించిన శ్రీ శ్రీ శ్రీ భీమేశ్వరమహారాజుగారి



దివ్యపాదపద్మములకు, అనంతకోటివందనము లాచరించి, అతి వినయపురస్సరముగఁ జేయువిజ్ఞాపనము; శ్రీమహాప్రభువువారు సకుటుంబపరివారులై యిపుడైనదయచేసి, నాగృహమును దమపాదాంబుజస్పర్శముచే పునీతముఁ జేసి, నాయందు కరుణార్ద్రచిత్తులై నాయాతిథ్యమును జేకొనవలయునని మిగులఁ బ్రార్థించుచున్నాఁడను. తమసేవకులలో నొకఁడు.

భీముఁడు:—అతనిపేరేమియుఁ దెలుపలేదా?

మంత్రి:—లేదుమహాప్రభు.

భీముఁడు:—సభ్యులయభిప్రాయమేమో.

మంత్రి, సర్వా:—మహాప్రభు! అతఁడు గొప్పవాఁడుగ నగపడుచున్నాఁడు, అతనివ్యవహారవ్యాపారములు కరుణాద్భుతరహస్యమిశ్రములై యున్నవి. శ్రీయేలినవారు అతనిప్రార్థనమంగీకరించి, దయచేసినచో నతనిపూర్వోత్తరములు దేటపడును, ఇది మామనవి.

ఆత్మా:—అతనియందుండు గొప్పతనమును కరుణాద్భుతరహస్యములు నేమో సెలవిచ్చెదరా?

సర్వా:—మనవిచేసెదను. నాస్తి యనుమాట యతని నోటలేదు; సరి కదా. అడుగువారికోరికకు ద్విగుణమునకుఁ బైఁగానే యేదిగాని సవ్యమైనది యడిగిన నిచ్చుచున్నాఁడు. ఇది కరుణాసూచకము. అతని నగరము ప్రస్తుతమేస్థలమునందుఁబుట్టి పెరిగియున్నదో యాస్థలముకొన్నాళ్లకుఁ గ్రింద క్షుద్రజంతుభూయిష్ఠమగు ఘోరారణ్యమైయుండెను; అతని మహాలన్ననో విశ్వకర్మనిర్మితముగాని మనుష్యులు కట్టినదికాదని చూచినవారందఱు నుద్ఘోషించుచున్నారు. అతనిపదవి యింద్రుని పదవికన్న దశాంశమధికముగ నీభూలోకములో నున్నదని మననగరవాసులు, ఆబాలవృద్ధముఁ జెప్పుచున్నారు. వేయేల? ఈనగరవాసులలో మూఁడుభాగముల వారు, ఆనగరమునఁ జేరిరి. ఇచ్చట గుడిసెలకు గతిలేనివారికి అచట మిద్దెలు మేడలు వస్తువాహనములు అతిసులభముగ సంప్రాప్తములైనవి. ఇవి యన్నియును అద్భుతములుకావా?

వీని నన్నిటిని గల్పింప నతనికి శక్తియేలాగు కలిగెనో యది రహస్యముకాదా ? ఇతఁడెవఁడో, ఏవర్ణస్థుఁడో, ఎక్కడివాఁడో, తెలియదు. అతిస్వల్పకాలములో నిట్టివింతలును లోకోపకారమును గలుగఁజేసినవాఁడు గొప్పవాఁడు గాఁడా !

భీముఁడు:—బాగుగనన్నారు. అతనిగుఱించి నేను గూడ కొన్నియంశములువిన్నాను. గొప్పవాఁడే. మనము దర్శనమియ్యఁదగినవాఁడే. అక్కడికి వెళ్లుటకు మీకిష్టమేనా?

మంత్రి, సర్వా:—మాప్రార్థనయే యిది.

భీముఁడు:—అయిన రేపే వెళ్లుదము. ఇది మనకుత్సవకాలము గనుక నీయుత్సవానందమునుగూడఁ బొందుదముగాని. ఆనగరము చాల దూరమున నున్నది గదా!

మంత్రి:—ఏలినవారు దయచేతురని తలఁచి, యొకవారమువఱకు గజతురగాందోళికలను అంచీలుగాఁబెట్టి యంతయు జాగ్రత్తచేసియున్నానని వ్రాసియున్నాఁడు. కనుక జాముకాలములో నానగరముఁ జేరవచ్చును.

మూర్తి మొదలు నలుగురు:—మహాప్రభూ ! మేముగూడఁ జూచినాము. దారిలో నెక్కడఁజూచిన నేనుఁగులు, గుఱ్ఱములు, పల్లకీలు మున్నగునవి నిండియున్నవి. వాఁడెవఁడో గొప్పవాఁడుగానేయున్నాఁడు. మేము వెళ్లునప్పుడు ఆచోటు వట్టియడవిగనే యుండెను, మరల తిరిగి వచ్చునప్పుడుకూడ నదియడవిగనే యుండెను. అక్కడ నుండి పైకివెళ్లిపోయి మరల తిరిగి యాదారిగానే వచ్చినాము. అప్పుడా జాగాలోనే గొప్పబ్రహ్మాండమంతపట్టణమొకటి కనఁబడెను. మనపట్టణముకన్న నది చాల గొప్పది మహాప్రభూ !

భీముఁడు:—ఆలాగా, మీరుగూడ వానిఘనతను జూచితిరా, మంచిది. మీరు చాలకాలము దేశాటనముఁ జేసితిరిగదా. మీకందఱికిఁ బ్రయాణసదుపాయము లేలాగు జరిగెను?

వరముఁడు:—(మూర్తివద్దువద్దని సంజ్ఞలుచేయుచుండఁగా) మేము కాశికిఁ



జేరితిమి మహాప్రభు. అచ్చట నొక పదునెనిమిదేండ్లప్రాయముగల యాఁడుపడుచు రాజ్యముఁ జేయుచున్నది. అది గొప్పసొగసుకత్తెయని యందఱుఁ జెప్పఁగా దానిని జూడవలెనని మా కాశపుట్టెను.

భీముఁడు:—చూచినారా?

వజ్రుఁడు:—చూచినాము. చూచినాము. ఓహోహో, !! ఏమి చెప్పుదుము మహాప్రభూ! దానివంటి యందకత్తెను కని విని కూడ నెఱుఁగము. మన మెఱిఁగిన రాజస్త్రీలందఱును దానికి దిష్టితీసివేయుటకుఁగూడఁ దగినవారు గారు. సాక్షాద్విశాలాక్షీదేవి యవతారమేమో (అటునిటుఁజూడ లలిత కనఁబడగా దాని ప్రక్కకుఁ దిరిగి చేతితోఁజూపి) ఈముఖముయొక్క వాటమే యామెముఖము; కాని దానిసౌందర్యము వర్ణింపతరమే కాదు మహాప్రభు.

భీముఁడు:—సరేకాని దానిసౌందర్యముతో మనకేమిపని యిపుడు ?

భట్టుఁడు:—ఆపడుచు మాకు దారిలో కావలసిన సదుపాయములకు అన్నిసన్నాహములు చేసిపెట్టెను. కాని యాపడుచు చాలగడుసుదియు పెంకెదియును కూడ. (ఈమాటలన్ని విని లలిత మోము నొకప్రక్కకుఁ ద్రిప్పుకొనును, తిలోత్తమ లలితనే చూచుచుండును.)

భీముఁడు:—మీకుఁ జేసినసదుపాయములకై నెనరుంచక ఆపెను దూషించుట బాగుకాదు. మంచిది మనము రేపే సకుటుంబపరివారముగ నక్కడికి వెళ్ల నిశ్చయించుకొన్నాము, మంత్రీ! ఈవర్తమానమతనికి తెలియఁ జేయవచ్చును.

మంత్రి:—చిత్తము మహాప్రభూ !

భీముఁడు:—ఆత్మానందులుగారు ! సర్వానందులుగారు ! మీరును తప్పక రావలెను.

ఇద్దఱు:—చిత్తము, చిత్తము.

భీముఁడు:—ఈగడబడలో విద్వాంసులనుమఱచితిమి(వారింజూచి మంత్రి మొదలగువారితో జనాంతికముగ) అవునవును. సర్వానందులు

గారు! మీరును వేత్రవతియును జెప్పిన ప్రత్యుత్తరము నిజమే. వీరు మిక్కిలి చక్కనివారిలోఁ జిక్కనివారు. (ప్రకాశముగ) విద్వాంసులార! మీరు కూడ మాతో నాస్థలమునకు రావలయునని మాయిష్టము. అక్కడి వింతలు మీరును జూడవచ్చును.

ఇద్దఱు:—మాప్రార్థనయు నదియే.

భీముఁడు:—మేమిపుడుకుమారులతో నంతఃపురమునకుఁబోయెదము. ఆత్మానందులుగారు రండు. (భీముఁడు కుమారులు ఆత్మానందుఁడు వెళ్లుదురు)

మంత్రి:—(జనాంతికముగ సర్వానందునితో) ఇదేమిస్వామీ! "వినాయకం ప్రకుర్వాణో రచయామాస వానర" మ్మనినట్లే అయిన దే.

సర్వా:—ఱేపే అన్నియంశములు శీఘ్రముగ బయలుపడకమానవు. వాఁడు మనవాఁడే అనియెంచవలసియున్నది.

మంత్రి:—మీకు నాలాగే తోఁచుచున్నదా?

సర్వా:—తోఁచుటయేకాదు, దృఢమైననమ్మకముగూడఁ గలిగియున్నది. కాని యీపూవు వీరిచేతికిదొరకినదిమాత్రము కడువింతగనున్నది.

మంత్రి:—ఏమోగొప్పమోసముజరిగియుండును. ఱేపంతయుఁబరిష్కారముగాకమానదు. ప్రస్తుతముమనము చేయునదియేమియు లేదు, వెళ్లుదమురండు. (విద్వాంసులతో) మీరుసన్నద్ధులైయుండవలయును (అనిమంత్రియు, సర్వానందుఁడు వెళ్లుదురు.)

లలిత.—మనముఁగూడ వెళ్లుటబాగు.

తిలో:—వీరివృత్తాంతము వెనుకఁ జెప్పెదమంటిరే.

లలిత:—నేను కాశికివచ్చియుంటిని. అపుడురాచకొమరులు నలుగురు కాశీరాణిగారి చెఱసాలలోఁ బడియుండి విడిపింపఁబడిరని లోకులనఁగా వింటిని, వీరే వారుగనుండవచ్చును.

తిలో:—ఆలాగా, తాముచెప్పినదినమ్మఁదగినదే. (ఆత్మగతముగ) ఆరాణి యీమెయే యయియుండనోపు. అన్నివింతలు ఱేపుబయలుపడవచ్చును.)



లలిత, తిలో:—(ఆత్మగతము) ఱేపుచూడఁ బోవునగరాధిపుఁడునాప్రాణేశుఁడై యుండవలయును. అతఁడును వీరును ఏకకుటుంబములోఁ జేరినవారుగ నుండవలయును. ఈయంశమును దెలుపఁదగినపోలికలు వీరందఱియందును బాగుగఁ గనపడుచున్నవి. మేమిద్దఱమునతనినే కోరి వెదకుచున్నాముగాఁ బోలు. అహాహా! ఏమిసంవిధానకము!!

రాగము-సావేరి లేక వరాళి.

సఖియఁ బోలుఁ దొలుత, సవతిఁబోలును వెనుక
మదికిఁ గానవచ్చు నెదుటివ్యక్తి
మైత్రివిడువదెటులో మదికసూయతగ్గుఁ
గలుగఁ బోవుఫలము దెలియరాదు.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

# కమలాపహరణము.

## సప్తమాంకము-ప్రథమస్థలము.



[సర్వంసహాదేవిగది]

(విజయుఁడు సర్వంసహాదేవియుఁ బ్రవేశించుచున్నారు)

విజయుఁడు:—అమ్మా! మాతండ్రిగారికి మనపై నుండువిసువును ద్వేషమును నేఁడుపూర్తిగా తొలఁగునుగదా?

సర్వం:—మనమిన్నాళ్లదాఁక నీప్రపంచములో నుంటిమని వారికి జ్ఞాపకమే యుండదు. ప్రస్తుతమెక్కడనైన నుండవచ్చునేమో యనుతలంపుసయితమునుండదు.

విజయుడు:—నీవన్నదివాస్తవమే! కానిమనఖికరిన్నాళ్లదాకసుంతయులేకుండనేయుండి, యిప్పుడు గభీమనియాకాశమునుండి దుమికినట్టు కనఁబడి,యీయత్యుచ్ఛ్రాయదశలో మనముండుటంజూడఁగా, వారికి మనమీఁదను గనికరముఁ బ్రేమయుఁగలుగవా?

సర్వం:—కలిగించఁగలవాఁడవు నీవేకాని నాచేత నేమియుఁ గాదు నాయనా !

విజయుఁడు:—ఔను ! దానికిఁదగినశస్త్రాస్త్రములు నాయొద్దనున్నవి.

సర్వం:—నీకాధైర్యముండిన నాకుఁ బరమానందము. కాని నాబంగారు తండ్రీ ! ఈపనికిఁ బూనుకొనుటచే నీకేకీడును రాకుండునా ?

విజయుఁడు:—నన్ను గూర్చి నాకేచింతయులేదు.ఇప్పుడే యీచింతలఁ బెట్టుకొనఁ గూడదు. ఇఁకనాస్థితిగతులు పెక్కుమార్పులం బొందవచ్చును.పొందకమానవు.ఇపుడిపుడేనేనీ ప్రపంచముంజూడనారంభించియున్నానుగదా? ఇఁకననేకసుఖదుఃఖములు,మేలుగీడులును రా



కమానవు. కనుక నన్నిటిం జేకొన సన్నద్ధుఁడనై యున్నాను. కాని నీగర్భవాసమునఁబుత్త్రుడనై పుట్టినందులకు నిరపరాధురాలవగు నీయందు నీభర్తకు నిష్కారణముగఁ గల్గిన ద్వేషమును దొలఁగించి, ప్రప్రథమమునమీకిద్దరికినుండిన సౌదాంపత్యమునుమరలఁగలుగఁజేయుట నాప్రధానధర్మము. ఆధర్మమును నేఁటికాచరించెదను.

సర్వం:—నీకు నేనుజెప్పవలసినదికాని నీకు డెలియనిది కాని యేమియున్నది?

విజయుఁడు:—ఏమియులేదు. కాని నేనువర్తమానముంబంపునపుడు వెంటనే సభకురావలయుననినాప్రార్థన.

సర్వం:—అలాగే! నేనువెళ్లుచున్నాను.

(అని నిష్క్రమించును).

విజయుఁడు:—ఎవరోయి అక్కడ?

సేవకుఁడు:—(ప్రవేశించి) చిత్తం!

విజయుఁడు:—ఇపుడు ప్రొద్దెంతాయెను.

సేవకుఁడు:—మూఁడుఝాములు.

విజయుఁడు:—నాసెలవందఱును బోధపఱుచుకొన్నారా?అన్నియు సన్నద్ధములయియున్నవా?

సేవకుఁడు:—చిత్తం!

విజయుఁడు:—నీవు సింహద్వారమునఁ గనిపెట్టియుండి వారిసవారియరక్రోసులోఁ గనఁబడఁగా, నాతోమనవిచేయవలెను. నేను సభామంటపముననుందును.

సేవకుఁడు:—చింత్తే! (అనివెళ్లును)

విజయుఁడు:—నాతల్లిగారిని బట్టినశని నేఁటికివదలునుగా

(అనినిష్క్రమించుచున్నాఁడు)

---

## సప్తమాంకము - ద్వితీయస్థలము.



(విజయునిహర్మ్యములోఁ బ్రధానమంటపము)

(స్వర్ణరజత మిళితములగు శిల్పికల్పితాలంకారములతో నిండి యుండు మంటపములలో గొప్పచక్రవర్తికిఁ దగిన శ్వేతచ్ఛత్రము, వాలవ్యజనములు, శిఖిపింఛతాళవృంతములు చేతఁబట్టుకొని సేవకులును, మంగళహారతులుపట్టుకొని కన్నియలిద్దఱునుండ, విజయుఁడు సాధారణములగు వస్త్రాలంకారములు ధరియించినవాఁడై ప్రవేశించుచున్నాఁడు)

విజయుఁడు:—(నిలఁబడి అంజలిఁ జేసి) శ్రీరామచంద్రప్రభూ! నేఁటిదినము అన్నియంశముల సుదినమై యుండునటుల ననుగ్రహింపవలయునని నీపాదపద్మములఁ బ్రార్థించుచున్నాను.

రాగము - బలహంస. తాళము - ఆది.

పల్లవి:—కరుణతోఁ జూడుమా రఘుపతీ
శరణంబని న్నే కోరితి.
అనుపల్లవి:—ఎఱుక లేక నాతండ్రి చేసిన
పరిభవంబులం బాఱఁద్రోలి - కరుణ.
చరణము:—ఇఁక నైన గృహచ్ఛిద్రము లేక
యింటనందఱేకచిత్తులయి
సుకముతోఁ గలసిమెలసియుండు
శుభము మాకొసఁగి సుప్రసన్నుఁడవై. కరుణ.

(అని యాసనముపైని గూర్చుండ పరిజనులు సమీపింపఁగా) ఈ మర్యాదలు నాకుఁగావు రాఁబోవువారికి.

సేవకుఁడు:—(ప్రవేశించి) సవారీవచ్చుచున్నది.

విజ:—అలాగా! (అనివెళ్లి వారితోఁ బ్రవేశించి) సుదినము! స్వాగతము! నాజన్మమిపుడే సఫలము. నాగృహమిపుడే పావనము. దయచేసి



యందఱు నాసనముల నలంకరింపవలయునని ప్రార్థించుచున్నాఁడను (భీముఁ డగ్రాసనముపై నతనికుడిప్రక్క కుమారులు, ఎడమ ప్రక్క నొకయాసనము వదలి, ఆత్మానందుఁడు, మంత్రి సర్వానందుఁడు, లలిత, తిలోత్తమ కూర్చుందురు. (లలితయును తిలోత్తమయును విజయునిచూచి)

లలిత:—(ఆత్మగతము) దేవ దేవ! నాప్రాణేశుని ముఖచంద్రదర్శన మాయెను. ఇఁక నాజన్మము సఫలమే.

తిలోత్తమ:—(ఆత్మగతము) నాహృదయచోరుఁడు హృదయానందుఁడు దొరకినాఁడు. ఇఁక నేచింతయు లేదు.

విజయుఁడు:—మంగళహారతి! (అనఁగా నిద్దఱుకన్నెలు హారతినెత్తుచు పాడుదురు.)

రాగము - ఆనందభైరవి. తాళం - ఆది.

పల్లవి:—మంగళం మంగళం మంగళం
మధురాపురీశ మంగళం.
అనుపల్లవి:—సంగరరంగభీకరధామ
సజ్జనసంఘ సన్నుతనామ. మంగళం॥
చరణము:—నిమివంశాంబుధిచంద్రా
కమలాకటాక్షసాంద్రా
అమరేశ రమాలంకృతభూప
సుమశరతుల్యసుందరరూప. మంగళం॥

మంత్రి-సర్వా:—(అమితానందముతో జనాంతికముగ) మనయూహలు నిజమాయెనే! ఈగడియలోనే పెక్కు గొప్పవింతలు చూతుము కాఁబోలు. ఏమి మహాదశవీనికి! ఏలాగువచ్చెను? (భీముఁ డత్యాశ్చర్యముతో మయిమఱచి మెల్లగ నలుప్రక్కలు చూచుచుండ)

మూర్తి:—(జనాంతికము) తమ్ములారా! చూచితిరా? ఈక్షణమే మన

భవిష్యము నున్నగనారఁబోవుచున్నది. అనుభవింపుఁడు. నా మాట వినకపోవుటకు ఫలమిది! మనకుగతి దేవుఁడే! (తమ్ములు లజ్జచే తలవంచుకొందురు)

భీముఁడు:—ఇదేమిమంటపము! ఇదేమిమహాలు! ఇదేమినగరము! ఈ పరిజనపరివారము లేమి! ఈయేర్పాటు లేమి! ఈమహాసంపద యేమి! ఈనగరముచుట్టు కొన్నియామడలవఱకు లేమి యనుమాటయే యుండదనితోఁచుచున్నదే! ఈయేఁబదియాఱు దేశములరాజుల సంపదలన్నియుం గూడఁబెట్టిన నీసంపదలో సగము కానేరదే! ఇదేమి యశ్రుతదృష్టపూర్వాద్భుతము! సభ్యులారా! ఏమను చున్నారు?

కుమారులుతప్ప నితరులు:—మహాప్రభూ! మా కిదమిథ్య మ్మని తోఁచక యున్నది. అమరావతి యనునగరమిదియే కాఁబోలును.

భీముఁడు:—సుధర్మ యునిదియే! కాని దేవేంద్రుఁడును, బృహస్పతియును లేకపోవు టొక్కటియేలోపము.

విజయుఁడు:—(అతివినయముతో) కొద్దియో గొప్పయో అన్నియు భగవంతునియొక్కయు తమయొక్కయు అనుగ్రహమహిమయేగాని వేఱుగాదు. నాసాష్టాంగదండప్రణామంబులం జేకొనవలయునని వినయముతోఁ బ్రార్థించుచున్నాను. (అని నమస్కరించును.)

భీముఁడు:—దీర్ఘాయుష్మాన్భవ! సకలసంపత్సద్గుణ సంపన్నోభూయాః! (లేచికౌఁగిలించుకొని) నాయనా! నిన్ను నేను "నాయనా" యని పిలువవలయునని నామనసు ప్రేరేపించుచున్నది. ఏలయన, నీదర్శనముం జేసిన నిముసము మొదలు నీయెడల నాకుఁబుత్త్రవాత్సల్యమే కలిగియున్నది. కనుక వేఱు మర్యాదచేయ నక్కరలేదుగదా? నాప్రక్కను గూర్చుండుము.

విజయుఁడు:—ధన్యోఽస్మి! అనుగ్రహీతోఽస్మి! నామనఃపూర్వక ప్రార్థన యిదియే! వేరేమియుఁగాదు.

భీముఁడు:—(ఆత్మగతము) ఇదేమి యద్భుతము? వీనిముఖము సర్వంసహా



దేవిముఖమువలెనేయున్నదే! ఆతల్లీపిల్లలను బహిష్కారముచేసి రమారమి పదునెనిమిదివర్షములాయెను. ఇంతకాలముః వారిప్రస్తావమే లేకపోయెనుగదా! ఆపిల్లఁడు వీఁడుగనుండునా? (ప్రకాశముగ) నాయనా! నీపూర్వోత్తరములు మాకేమియుఁ దెలియవు. కొంత తెలిపిన చాలసంతోషింతుము.

ఆత్మా:—(ఆత్మగతము) వీఁడు సర్వసంహా కొడుకుగనుండునా!

విజయుఁడు:—తమయనుగ్రహమే నాపూర్వోత్తరము. మఱియేమియు లేదు.

మంత్రి-సర్వా:—(జనాంతికము) సెబాన్! మంచి గడుసైనప్రత్యుత్తరము.

విజయుఁడు:—కాని తమతో దయచేసినవారికి నమస్కారములు సేయవలయునుగదా? (అని లేచి) వీరుమంత్రిగారుగదా? నమస్కారము. వీరుపండితులు! నమస్కారము.

మంత్రి-సర్వానందుఁడు:—దీర్ఘాయుష్మాన్భవ! సర్వమంగళాభీష్టసిద్ధిరస్తు. (ఆత్మానందుఁడు కన్నులెఱ్ఱఁజేసి ఊరకుండును.)

విజయుఁడు:—(లలితాతిలోత్తమల ప్రక్కఁజేరి) వీరును పండితులే. (వారి ముఖములు నింపాదిగఁజూచి యాత్మగతము.) ఈముఖములు క్రొత్తముఖములుగావే! చూచినవిగానే కనఁబడుచున్నవి. ఏమి గాత్రము! ఏమి తేజస్సు! ఏమిసౌందర్యము! కొంతసేపుతాళుదును గాక (ప్రకాశము) వీరు నాకన్న చిన్నవారివలెనున్నారు. తమదర్శనముచే నేను ధన్యుఁడను సఫలజన్ముఁడనైతిని. (కుమారులవైపు తిరిగి) కుమారులుకదా! నాకన్న కొంచెము పెద్దలవలె నున్నారు. నమస్కారము. (వారు చేతులుమాత్రము జోడించి యూరకుందురు. విజయుఁడు భీముని ప్రక్కనున్న యాసనముపైని గూర్చుండును.)

భీముఁడు:—నాయనా! నీవు గొప్పసుజనుఁడవు. నీసాంగత్యము మాకు మిగుల శ్రేయోవహము.

విజయుఁడు:—తమకన్న నాకు సహస్రాంశమధికము. తమకు దృష్టిలోనేమో లోపముండెనని ప్రజలు చెప్పఁగా విన్నాను. భగవంతుని కృపచే నది తొలఁగినటులున్నది. ఇదియు నాభాగ్యమే.

భీముఁడు:—ఈనాకుమారుల సాహాయ్యముచే నాకు మరల దృష్టిలభించెను. ఆమహిమ వీరిదే.

విజయుఁడు:— ఆలాగా, వీరికి మరలవందనము చేసెద. తలిదండ్రులకును తమకును సుఖముగలిగించువారే సుపుత్త్రులు. (అని చిఱునవ్వుతో వారిని చూచును, వారు తలవంచుకొందురు) ఏరీతిని వీరు తమకు మరలదృష్టి నిప్పించిరో? (కొంతతాళి) అదియొక పురాణము కాఁబోలును.

భీముఁడు:—అవును, నాయనా!

విజయుఁడు:—ఈ కుమారరత్నములుగాక తమకు వేఱొకకుమారుఁ డెవఁడైనగలఁడా?

భీముఁడు:—వేఱు కుమారుఁడా! (కొంతతాళి) చాలకాలమునకు ముందొకఁడు గలిగెను. ఏమీ?

విజయుఁడు:—వానికి నామకరణము జరిగెనా?

భీముఁడు:—(ఆత్మగతము) వీనిముఖమో సర్వంసహాదేవి ముఖమే! వీని ప్రశ్నోత్తరములలో, మిగుల గూఢార్థములుగలవై యున్నవి.ఏమో గొప్పవింత బయలుపడునటులున్నది. (ప్రకాశముగ) వాని జనన కాలము కడుశ్లాఘ్యమనియు, వాఁడు గొప్పసాహసిగ నుండునని యు, జ్యోతిష్కులుచెప్ప, విజయుఁడని వానికి నామమిడిరి. (కొంతతాళి) కాని వాని జననాంతరమే మాకు దృష్టిహానికలిగెను. కనుక వానియందును వాని జననియందును మాకు జుగుప్సకలిగెను. వారేమయిరో మాకుఁ దెలియదు.

విజయుఁడు:—ఆలాగా? ఈయంశములో తమరును, వారును, ఇరుప్రక్కవారును శోకింపవలసినదే! కాని భగవంతుని యనుగ్రహముచేతఁ దమకు మరల దృష్టివచ్చెనుగదా? ఆరీతిగనే భగవంతుని యనుగ్ర



హముచేత నావిజయుఁడును సజీవుఁడైయుండి, యిపుడు తమయెదుటఁ బడిననో?

భీముఁడు:—(ఆత్మగతము) వీఁడే. నిస్సంశయము. లేనిచోఁ బుత్త్రవాత్సల్యము వీనియం దేలాగుకలుగును? (ప్రకాశము) మిగుల సంతోషించి యాలింగనముఁజేసి ముద్దుఁబెట్టుకొందును.

విజయు:—(లేచి పాదములపైఁబడి) మహాప్రభూ! నాతండ్రి! సర్వంసహాదేవిపుత్త్రుఁడు విజయుఁడు వీఁడే. ఏకమలముచే దమకు మరల దృష్టివచ్చెనో యాకమలమును దెచ్చినవాఁడునువీఁడె! వీరుకారు.

మంత్రి-సర్వా:—సెబాస్! నిక్కము దాగునా?

మూర్తితప్ప ముగ్గురు:—మహాప్రభూ! వీఁడెవఁడో పెద్దదొంగ. ఇచ్చకు వచ్చినమచ్చున డచ్చీలుకొట్టుచున్నాఁడు. వీని వ్యవహారవృత్తాంతములంజూడఁ జిత్రదీపకథగానున్నది. మహాప్రభూ!

విజయుఁడు:—చాల బాగుగ సెలవిచ్చిరి. నా వ్యవహారవృత్తాంతములు చిత్రదీపకథవంటివే. నిస్సంశయము. అవి యింతటితో బరిసమాప్తినొందునవి కావు. వీనికన్న గొప్పచిత్రములువింతలు నావిషయమై యికమీఁదనుగూడ కలుగునేమో? నేనువింతలకై జన్మించినవాఁడనుగనున్నాను. కాని "డచ్చీ" అనఁగ నేమో? 'ఇచ్చకు వచ్చిన మచ్చునడచ్చీలుకొట్టుట' యనఁగ నేమో నేనెఱుఁగను. నేను దొంగనో మఱియెవరు దొంగలో యీక్షణమే నిరూపించెద. (చేతులు జోడించి) యక్షరాజా (అని పిలువఁగా అతఁడు ప్రత్యక్షమౌను. అదిచూచి యందఱును ఆశ్చర్యముతో స్తబ్ధులయి నిలఁబడుదురు.)

యక్షరాజు:—(విజయునితో) ఇది మంచిసుదినము. తమదర్శనము మరల లభించెను. నా మనవి జ్ఞాపకముంచి నారాకనుగోరితిరే. చాల సంతోషము. ఏమి యాజ్ఞ!

విజయుఁడు:—నన్నుగుఱించి తమ కేమిదెలియునో దయచేసి సెలవియ్యవలయును.

యక్షరాజు:—ఇంతేనా ? అందరువినుడీ! నాకుశాపముచే దృష్టినష్టము సంభవించియుండెను. అందుచే బ్రాణమువిసిగి దేశాటనముజేయుచుండ, గొన్నాళ్లకుమునుపు ఒకానొకస్థలములో "కన్నుపొడిపించుకొండి-పోయినకన్ను మరల నిప్పించెద' అనుమాటలు నాచెవింబడెను. వెంటనే "ఎవరోయామహాత్ముఁడు పోయినకంటినిప్పించువాఁడు నాకుగన్నుపోయెను దయచేసియిప్పించవలెను" అని కేకలువేసితిని. అపుడు (విజయునిజూపి) ఈమహానుభావుడు కమల మొకటినాకంటి మీఁదను బెట్టగానే యథాపూర్వకముగ నాకు దృష్టివచ్చెను. అపుడు "మహాత్మా! నీకృపచే నాకుఁబోయినకన్ను మరలవచ్చెను. నాచేత నీకెపుడైన సాహాయ్యముగావలసియుండు నేని యక్షరాజా! అని పిలిచిన ప్రత్యక్షమయ్యెదను." అని మనవిచేసి సెలవుపుచ్చుకొని వెళ్లితిని. (కుమారుల ప్రక్కంజూచి) ఈనలుగురును శృంగభంగ మయినవారివలె నితనివెనుక నిలఁబడియుండిరి. సెలవు. అని యంతర్ధానమౌను.)

పరముఁడు:—(లేచి గెంతుచు) మహాప్రభూ ! వీఁడుగారడి, ఇన్ద్రజాలము మహేంద్రజాలము, చిల్లంగి, మొదలగు నీచవిద్యలచే జీవనోపాయము వెదకు క్షుద్రుఁడు. మంచిది! ఇప్పుడువచ్చినాఁడే యెవఁడో యక్షరాజని, వాఁడేమన్నాఁడు? ఈ పువ్వును కంటిమీఁద బెట్టె నన్నాఁడుగాని తెచ్చెనన్నాఁడా! పైవారుదెచ్చినదాని లాగుకొని వీఁడు కంటనుంచియుండఁగూడదో?

భీముఁడు:—ఇదంతయు నేమో అయోమయముగనున్నది. ఇదమిత్థమని నాకేమియుఁదోఁచలేదు. మంత్రి; సర్వానందులు! ఆత్మానందులు ! మీరే యీవ్యవహారమును బరిష్కరింపవలయును.

విజయుఁడు:— ఆత్మానందులుగారును కరటకసిద్ధాంతిగారును కలసి చేసిన కుట్రచేతగదా యింతదూరమునకువచ్చెను. కనుక నీవ్యవహారము పరిష్కారముగాకపోవుటయే వారిప్రార్థన, మంత్రిగారికిని సర్వానందులుగారికిని, నాయన్నలు నలుగురును నాకమలమునకై బయలుదేరిన పిదప నేను దానికై బయలుదేరి వెళ్లినంతవఱకును దెలియునుగాని పైనిజరిగిన దేమియు తెలియదే !



భీముఁడు:—ఏమనియెదరు ? ఇది నిజమేనా ?

మంత్రి-సర్వానందులు:—నిజమే.

లలిత:—(తిలోత్తమతో జనాన్తికము) ఈ రాజుగారికి మనస్థైర్యము స్వబుద్ధి లేదని ముందు మనవిచేసితినిగదా ?

తిలోత్తమ:—(జనాన్తికము) అది యిప్పుడు చక్కఁగఁదేటబడెను.

భీముఁడు:—అయిన పెద్దగమ్మత్తే !

విజయుడు:—జరిగినవృత్తాంతమును మనవిచేసెద. నేనాకమలమును సంగ్రహించి మననగరముంగూర్చి వచ్చుచుండ నీస్థలములోనే నాయన్నలు నలుగురునుగనఁబడిరి. ఈస్థల మప్పుడు ఘోరారణ్యమై యుండె. వీరితో నాకమలవృత్తాంతముం జెప్పితిని. అప్పుడే కన్ను పొడిపించుకొన్న మరల కంటినిచ్చెద ననుమాటలు వినవచ్చినవి. ఈయక్షరాజునకు దృష్టివచ్చుటంజూచి యేరీతినైననీపూవును సంపాదింపవలయునను దుర్బుద్ధివీరికిఁగలిగెను. "అన్నలార ! మనము కలసి మననగరమునకు వెళ్లుదము." అని పలువిధముల నేనుప్రార్థించినను నామాటలువినరైరి. వీరిజాడలగనుకొని నామానాన నేను వెళ్లుచుండ, క్షత్రియధర్మముమాని, నాకుఁ దెలియకుండనే వెనుకప్రక్కకు వచ్చి, నన్నుబడద్రోసి, కాళ్లుచేతులు గట్టివేసి యాపూవులాగుకొని పరుగెత్తిరి. ఇది జరిగినవృత్తాంతము. దీనికి త్రిమూర్తులుసాక్షులు.

మన్త్రి-సర్వా:—(జనాంతికము) ఆహాహా ! ఏమిఘాతుకత్వము !

లలిత-తిలోత్తమ:—(జనాన్తికము) ఎంతగొప్పశౌర్యము ?

తిలోత్తమ:—(లలితతో జనాన్తికము) ఇది మంచిసమయము. వీరివృత్తాంతము మీకు దెలిసినంతవరకు స్పష్టముగఁ బలుకుట బాగు. ఈమహాపురుషునికిని మఱికొందఱికింగూడ పరమోపకారముఁ జేసినవారాదురు. లజ్జకుసమయ మిదికాదు.

భట్టుడు:—వీడు చెప్పినదంతయు నబద్ధమే. సర్వానందమును. మంత్రియు మాకు విపత్తులేకదా ?

లలిత:—(పైకివచ్చి) సభ్యులార ! ఈవ్యవహారము నాకు కొంచెముదెలియును. అదిమనవిచేసెద. 'కాశిలో నొకపడుచేలుచున్నదనియు, అది మిక్కిలి గడుసుది, పెంకెది అనియు, నిన్న తమతో నీనలుగురును మనవిచేసిరి కదా? దానిం బెండ్లాడఁగోరి, చదరంగములో దానిం జయింపలేక, దాని కారాగృహములోఁ బడియుండిరి. ఈ మహాపురుషుఁడు వీరిని విడిపించెను.

ముగ్గురు:—(అతికోపముతో) నీకేలాగు తెలియును. పెంకెమనిషి ?

లలిత:—వీరివీపుమీఁద నారాణి రాజ్యాంగముద్ర కాలవేసి ముద్రింపించినది. చిత్తగింపవచ్చును. (అనఁగా నలుగురు చిన్నబోయి తలవంచుకొందురు.)

భీముడు:—మూర్తి ? నిన్నటినుండి నీవు మర్మముతో నన్నిటికిని నోరెత్తకనేయున్నావు. ఈవ్యవహారముయొక్కతత్వమేమో అందఱికి బోధపడినటులే, అయినను నిజమేమో నీనోరారఁ జెప్పుము.

మూర్తి:—(సాష్టాంగముచేసి) మహాప్రభూ ! విజయుఁడన్నమాట లన్నియు సత్యము. సత్యము. సత్యము.

ముగ్గురు:—(దీని లక్ష్యపెట్టక) నీవెవరు ?

లలిత:—నేనా ? మీరైదుగురు నెఱిగినవ్యక్తినే (అనఁగా విజయుఁడు దానిదగ్గఱకు వెళ్లును. లలిత నిజరూపమును జూపును.)

విజయుఁడు:—నాప్రాణేశ్వరీ ! లలితాదేవి! ఏమిమహాభాగ్యము ! ఏమియద్భుతము ! ఏమి బ్రహ్మానందము! (అని రెండుచేతులుపట్టి తనకంట నద్దుకొని చేతులముద్దాడి) నేఁడు కడుసుదినము. ఈసమయమో మహా సమయము. లజ్జ కిది వేళకాదు. నాతోఁగూడరమ్ము: ఇదిగో మామగారు. నమస్కారముచేయుము:

లలిత:—(నమస్కరించును.)



భీముఁడు:—దీర్ఘసుమంగలీభూయాః!ఏమి బ్రహ్మానందము!!ఏమిభాగ్యము!!!

విజయుఁడు:—వీరు నీబావలు. నీకుఁ దెలిసినవారే. నమస్కారము నేయుము.

లలిత:—(నలుగురు బావలకును వరుసగ నమస్కరించును.)

మూర్తి:—ధీమతీభవ ! గుణవతీభవ ! (తతిమబావ లూరకుందురు)

తిలోత్త:—(ఆత్మగతమున) లలిత ! నీభాగ్యమేభాగ్యము. నన్ను మించుకొన్నావుకదా ? బాధకము లేదు.

విజయుఁడు:—వీరు మహాపండితులు. వీరు మంత్రిగారు. వీరే మనభాగ్యములకుఁ గారణభూతులు.

లలిత:—(నమస్కరించును.)

ముగ్గురు:—దీర్ఘసుమంగలీ భూయాః మరేమియు మేమాశీర్వదింపనక్కఱలేదు.

భీముఁడు:—ఇవన్నియు నటుండనీ. నీతల్లియెక్కడ ? ఈగడబడలో దానిని బొత్తిగామఱచినామే.

విజయుఁడు:—ఎవరక్కడ ?

సేవకుడు:—చిత్తం.

విజయుఁడు:—అమ్మగారిని దయచేయుమను.(అనఁగా వెళ్లి సర్వంసహాతోఁ బ్రవేశించును. అందఱు నిలఁబడుదురు).

భీముఁడు:—(పరుగెత్తి) దేవిసర్వంసహా ? నేను నీకును మనకుమారరత్నమునకును పరమాపరాధముం జేసితి. నీవు నన్ను దయతో క్షమింపవలయును. కాలములో నాకు బుద్ధిస్థైర్యములేకపోయెను. కనుక, అబుద్ధిపూర్వకముగ కొంతవ్యవహరించియున్నాను.

సర్వంసహా:—ఆర్యపుత్త్రులాలాగు సెలవియ్యనక్కఱలేదు. నాపూర్వజన్మకృత పాపఫలము లప్పుడాలాగు పరిణమించినవి. ఇదిగాక ఆర్యపుత్త్రు లాలాగుసేయకపోయిన మనముద్దుకుమారుని కీమహాదశ, ఈభాగ్యము, ఈవైభవము, ఏలాగుసంపాప్తముతౌను.

భీముఁడు:—భాగ్యమన్న భాగ్యమా? భాగ్యమటుండనీ. నీకోడలినింజూచి నావా? ఈనారీరత్నము మనకోడలౌటకు నేనుచేసిన మహాపరాధమే కారణము.

ఆత్మా:— దేవిగారు! నేనే యీభాగ్యాతిశయములకు ముఖ్యకారణభూతుఁడనైయున్నాను గాన నామీఁద నాగ్రహింపఁగూడదు.

సర్వం:—చిత్తము. ఈవ్యవహారములో నాకుఁ గీడుచేయఁదలచినవారందఱును నాకును కుమారునికిని బరమాప్తులే. వారికి సదానమస్కరించెదను.

భీముఁడు:—లలిత! అత్తగారికి నమస్కారముసేయుము.

లలిత:—(నమస్కరించును.)

సర్వం:—అన్నియంశములలో విజయునికిఁదగినదేవిగ నుందువుగాతే! (సర్వానన్దునిమంత్రినిఁజూచి) తమరిద్దరు మాకుఁజేసినమహోపకారమునకుఁ దగినప్రత్యుపకారముంజేయ మాతరమా? కానేకాదు. ఉపచారపుమాటలాడుటచే ఫలమేమి? మాకృతజ్ఞతకు మామనస్సే సాక్షి.

ఇద్దరు:— దేవిగారు! మాధర్మము మేముచేసితిమిగాని గొప్ప యేమియును గాదు. తమకటాక్షమే మాభాగ్యము. తమవైభవమే మాకుఁబ్రత్యుపకారము.

భీముఁడు:—సంగీతవిద్వాంసులుగారు! మాకు నేటిదినము శ్లాఘ్యతరమైన దినము. మేమందఱము కడుస్వాదువైన యానందామృతమును బానముచేయుచున్నాము. అమృతముతో మధువు కొంచెముగలిపిన దానిరుచి ద్విగుణమౌనుకదా?

అందఱు:—చిత్తముమహాప్రభూ!

భీముఁడు:—మీసంగీతము శుభ్రమైనమధువే! కనుక మీసంగీతమును తేనెను మాయానన్దామృతముతోఁ గొంతగలుపవలయుననునుత్సాహము మాకుఁగలిగియున్నది. మఱియు మంగళకాలములో సంగీతము నితరాముద్దేశ్యముగదా? కనుక భైరవియందు నాకుపక్షపాతము; ఆరాగముతో నొకచిన్నశ్లోకమును చదివి యొక పాటఁ బాడవలయునని నాప్రార్థన.



తిలోత్తమ:—చిత్తము! అలాగే. (అనిపాడుచున్నది)

రాగము భైరవి.

తవేదంపశ్యన్త్యాః ప్రసరదనురాగంబహిరివ
ప్రియాపాదాలక్తస్ఫురితమరుణచ్ఛాయహృదయం
మమాద్యప్రఖ్యాతప్రణయభరభంగేన, కితవ!
త్వదాలోకః, శోకాదివ, కిమపిలజ్జాంజనయతి.

భీముఁడు:—విన్నారాశ్లోకముచదువుట. ఇదిపద్ధతి, రాగముయొక్క తేటులు కళలుపూర్తిగవచ్చినవిగదా. రాగమాలాపించినటులేయున్నది.

సర్వా:—ఇంతియేగాక మఱికొన్నిసొగసులు గనఁబడుచున్నది. మంచి పండితు లనేకులుచదువునప్పుడుగూడ, అక్షరములుగాని పదములుగాని శ్రోతలకేమియు వినరావు "తననసరిరిరిరి" తో శ్లోకములు గప్పఁబడుచుండును. శ్లోకము లేమియుబోధపడవు. వీరు చదువు పద్ధతిలోఁ బ్రతియక్షరము బ్రతిపదము శుభ్రముగవినువారికిఁ దెలియవచ్చుచున్నది. "తననసరిరిరిరి" పిసరైనను లేదు. విరామములు కడురమణీయములుగ నున్నవి. ఏయచ్చులో విరామమో ఆయచ్చులోనే రాగాలాపనము. వీరిపద్ధతిలో శ్లోకభావము వినువారికి స్పష్టముగ తెలియవచ్చుచున్నది. గొప్పఖండితనాయిక యొకతె, అన్యాసంగ వికృతుఁడగు తననాయకుని యెదుటనిలఁబడి, తన యవస్థను దెలుపుటకై చదివినటులున్నదిగాని, మగవారు చదివినటుల లేనేలేదు. (అని తిలోత్తమనుజూడఁగా ఆపెతలవంచుకొనుచున్నది).

భీముఁడు:—శ్లోకముచాలును.

తిలోత్తమ:—(పదముపాడుచున్నది.)

రాగము - భైరవి - తాళము త్రిపుట.

పల్లవి:— ఇటువంటివిభుఁడు నీకెటులలభించెనె
ఇది నీపూజాఫలమే

అనుపల్లవి:— కుటిలాక్షిరో! నీదుకోరికలెల్లను
కొనసాగివచ్చెనుగా యీయిలలో. నిట.

చరణము:—భూలోకమారుఁడే భువనైకవీరుఁడే, లోలాక్షిహృచ్చోరుఁడే
పాలకడలీకన్యాపతియవతారుఁడే, నీలనీరదసన్నిభోదారుఁడే. ఇటు.

నానాశ్రితజన నవనిధిసమానుఁడే, మానైకయానుడే
గానాద్యానందకరకలాభిమానుడే, శ్రీనివాసకృపాశ్రేయస్సంపన్నుడే.
ఇటు.

లలిత:—(జనాంతికము విజయునితో) విన్నారా! ఈపదముయొక్క భావము. (అని సిగ్గుతో తలవంచుకొనుచున్నది.)

భీముఁడు:—వీరిపాటలో ప్రతిపదము సాభిప్రాయమైయున్నది. చిత్రము. (అనగా తిలోత్తమ సిగ్గుచూపును.) వీరికి చాలశ్రమ మిచ్చినాము. కాని తగినసమ్మానముచేయ మాశక్యముగాదు. విజయకుమారుఁడే చేయఁదగినవాఁడు.

తిలో:—(కొసమాటలు విని ఆత్మగతము) సత్యం! సత్యం! పునః సత్యం!

భీముఁడు:—కుమారా! ఈస్థలము ఘోరారణ్యముగా నుండెనంటివిగదా? ఈస్వల్పకాలములోనే యమరావతిం ధిక్కరింపఁదగిన యీనగరవరము, వైజయంతముంబరిహసింపఁదగిన యీప్రాసాదము, ఈమహావైభవము, ఇవియన్నియు నీస్థలములో బాలుఁడవగు నీకేలాగు లభించెను? ఇది చిత్రములో చిత్రముగనున్నది. (అనఁగా నందఱును వానిప్రక్కఁదిరిగి శ్రద్ధతోఁ జూచుచుండ నతఁడు కొంత యాలోచించుచుండును.)

తిలోత్తమ:—(ఆత్మగతము) లలిత! నన్ను మించుకొన్నావుగదా? మంచిది! బాధకము లేదు. కాని నీభాగ్యములో నాకును భాగము గలదు. "తనదువిభునివేఱు తరుణిచేతికినిచ్చి తాళవశమెయెట్టితరుణికయిన" అనుమాట లున్నవిగాని నిజమయినసాధ్వి కది లక్షణముకాదు; కనుక నీయందు నా కసూయ యుండదు. నీకును నాయందుండదనినమ్ముదును. మనస్సునకు మననేసాక్షి. నీభాగ్యములోని నాభాగమును రేపే గలుగఁజేసికొనుచున్నాను. (అనియంతర్ధానమౌను.)



విజయుఁడు:—(ఆత్మగతమున) బదులేమిచెప్పను? ఇది పరమరహస్యమే! నాకు నది సమూలముగఁదెలియదు. కాని యీలాగనుట బాగు. (ప్రకాశము) ఇవి యన్నియు నీయుంగరముయొక్క మాహాత్మ్యములు. (అని యుంగరమును జూపి) కాని "ఇదియెవరిది? యెక్కడిది"? అనిమాత్రము ప్రస్తుత మడగకయుండవలయు నని నా ముఖ్యప్రార్థన. కాలక్రమమున నన్నియుఁ దేటపడును.

భీముఁడు:—మంచిదాలాగే (తిరిగిచూచి) సంగీతవిద్వాంసు లేమైరి?

అందరు:—(నలుప్రక్కలంజూచి) కనఁబడలేదే!

లలిత:—విజయునితో (జనాన్తికము.) విద్వాంసురాలనుట బాగు. ఆపె నావలెనే యేకారణముచేతనో పురుషవేషముదాల్చి వచ్చియుండెను.

భీము:—ఇదేమి వింత? అంతర్ధానమైరే? కుమార! నీ వేమనుచున్నావు?

విజయుఁడు:—ఏమో నాకును వింతగానే యున్నది (ఆత్మగతము). లలిత చెప్పినది నిజముగ నుండవచ్చును.

సర్వా, మంత్రి:—మహాప్రభూ! మాకుఁ దోఁచిన కొన్నియంశముల మనవిచేసెదము. అన్తర్ధానమైనవ్యక్తి విద్వాంసురాలేగాని విద్వాంసుఁడుగాఁడు. కోడలుగారివలె నేకారణముచేతనో పురుషరూపమున వచ్చియుండెను. మనకుమారుఁడు వింతముద్దుపట్టియై పుట్టియున్నాఁడు. ఈసంగీతవిద్వాంసురాలు టకీమని కనఁబడకపోవుట, యీయుంగరముయొక్క మహిమ, ఇదివఱకు మనము చూచినవింతలు, ఇవియన్నిటి నాలోచించిచూడ నిటుపయినిగూడ మనము కొన్నివింతల ననుభవింపఁబోవుదుమని మాకుఁ దోఁచెడిని.

భీముఁడు:—నాకును నాలాగే తోఁచుచున్నది. కుమారుఁ డేమనుచున్నాఁడో?

విజయుఁడు:—నేనేమియుం జెప్పఁజాలను మహాప్రభూ! ఇప్పట్లో సమర్థకముగ నాకు నేమియుఁదెలియదు.

మూర్తి, ముగ్గురు:—దొడ్డమ్మగారు! తమకు మేమేమియు కీడుచేయలేదుగదా?

సర్వం:—అయ్యో! మీరేమిచేసితిరి? మీరు నాకుమారులేగా? మీరు పెద్దలు. విజయుఁడు చిన్న. అంతే!

నలుగురు:—మామీఁద నాగ్రహము లేదుకదా?

సర్వం:—ఎంతమాత్రము లేదు.

భీముఁడు:—మూర్తీ! ఈకకూర్తిపని యేలచేసితిరి?

మూర్తి:—మతిలేక మహాప్రభూ! వలదువలదని పలుమాఱు చెప్పినను విన్నారుకారు.

భీముఁడు:—తుచ్ఛులార! మీకేమిశిక్షచేయవలెను?

విజయుఁడు:—(అడ్డపడి) మహాప్రభూ! శ్రీయేలినవారాలాగు సెలవిచ్చుట ధర్మముగాదు. ఏయుపాయముచేతనైనను దనకుచ్ఛాస్థితిని నేనుండిన నేను నాలాగే చేసియుందునేమో? యదశను సంపాదింపఁగోరుట మనుష్యసహజమైన ధర్మము. వారి

భీముఁడు:—అయిన నీయభీష్టమేమి? కుమార!

విజయుఁడు:—శ్రీయేలినవారికి నెనరియం దేరీతి నాగ్రహ ముండఁగూడదు. మనకుటుంబములో కలహము, మనస్తాపము, అల్లరి,వినఁబడగూడదు. ఇది నాప్రార్థన. (అని పాదములమీఁదఁబడును.)

ఆత్మా:—(విజయుని లేవఁదీసి కౌగలించుకొని) నీవింతటిసుజనోత్తముఁడవవుదువని కొందఱు దలఁపకే పోయిరిగదా! వారియందు నీకాగ్రహ ముండఁగూడదని మిగులఁ బ్రార్థించెదను.

విజయుఁడు:—స్వామి! ఆగ్రహమనుమాట మనకుటుంబములో నిఁకనెవరినోటనురాదు, ఈసభకుఁ దమరందఱును దయచేయుటకు మునుపు నేనుచేసినప్రార్థనచే నాసిద్ధాంతము నందఱును గనుఁగొనవచ్చును. అది మరలఁబాడెదను. అమ్మ! కలసిపాడుదము. (ఇద్దఱును పాడుదురు.) కరుణతో......

భీముఁడు:—"సుపుత్రః కులదీపకః" అనువాక్యము విజయునికై పుట్టెను.

కంచుకి:—సంధ్యాకాలము మహాప్రభూ!

(అందఱు నిష్క్రమింతురు).

---

# కమలాపహరణము.

## అష్టమాంకము - ప్రథమస్థలము.

(తిలోత్తమనగరుతోఁజేరిన యారామము.)

(పై యారామములో నేకాంతస్థలముననుండు లతాగృహమందు పర్యంకమునం గూర్చుండి, విశేషానందోత్సాహభరితులై, తిలోత్తమావిజయులు ప్రవేశించుచున్నారు).

విజయుఁడు, సుందరి:—

(రాగము - తోడి.)

కొంటివినాదుదృష్టి నతికోమలరూపముచేత, దానితోఁ
గొంటివి శ్రోత్రనాసికలఁగూడ సునాద సుగంధ శక్తిచే
తుంటరియైన జిహ్వయును ధూర్తశరీరము నేల నాకు, ని
న్నంటియెయుంటవీనివిధి యానతి యిమ్మటు సేయ మానినీ.

మఱియు.—

నాదు మనంబుఁగొంటివి, గొనందగుఁగాని మనంబులేక, కాలూఁదఁగనౌనె, జూడుము తలోదరి! నీమనమైన నిమ్ము, సమ్మోదమునం జరింతు, నిట ముద్దులగుమ్మ! యొసంగు టాత్మకుంజేఁ దగునేని, ము ద్దొకటి చిన్నది యిమ్ము మనంబుపుట్టెడిన్.

తిలో:—నా మనోహర!

(రాగము - తోడి.)

వపువు, హృషీకము, న్మనము, ప్రాణము,మానము, చేతనాత్మలుం
గపటి యొకండుఁ దాఁగొనియెఁ గానకరోసెద, వాఁడు నీవొకో,
నృపవర! నిన్నెనీవడిగి, నెమ్మదియో, మఱి ముద్దొ, మోహమో
వపువో, రుచించునెద్ది, యది వారక గొమ్మొరులేఁడ వేఁడఁగన్.

(ఇది నాయకనాయిక లేకాంతముగనుండుసమయము గనుక, దత్సూచకముగ మొదటితెరను దింపి, రెండుమూఁడునిమిషము లుంచి, మరలఁ బైకెత్తవలయును.)

తిలోత్తమ:—సామి !

(రాగము - కళ్యాణి, తాళము - చాపు.)

పల్లవి:—ఏమని విన్నవింతు, నామోహము, నేమని విన్నవింతు

అనుపల్లవి:—నామనసువంటిదే నీమనసైన
కామదేవునికోర్కెల్ కడతేరు నాసామి. ఏమని.

చరణము:—ముందు, వెనుక, ప్రక్కలెందుఁజూచిన నీదు
సుందరరూపై యుందురా, నీపై
తంత్రీయుక్తమైపాడ, నీవు నాతొడపైని
తాళము వేసినట్లుండురా,
మందయానలు వీఁడెమగఁడు నీకన
బ్రహ్మానందమగ్న నౌదురా
కందర్పజనకునిసాక్షిగ నీకు నాడెంద మర్పించితిరా,
ముద్దులసామి ఏమని.

విజయుఁడు:—ప్రియురాల ! నీమోహమును వర్ణించితివిగాని, నామోహమెట్టిదో తెలిసికొన్నావా ?

తిలోత్తమ:—తెలిసికొన్నాను, కాని నామోహమునకు సరి కాదు సామీ!

విజయుఁడు:—అయినను కొంతదయచేసి వినుము.

(రాగము - కళ్యాణి, తాళము - చాపు.)

సోముని బింబముచూచిన నీముద్దుమోముగానే యుండునే,
సౌదామినీలతను, వేమాఱుఁజూడ నీమేనుగగనఁబడునే
కామదేవునిపూజఁ గావింపఁదలఁపనీ నామమె మునువచ్చునే
కోమలీమణినాదు ప్రేమాతిరేకంబీ మహి నెందుండునే, నాముద్దియ.
ఏమని.



తిలోత్తమ:—ఇపుడు మనమోహములు సమానములే; అయిన నొకచిన్న మనవి?

విజయుడు:—ఆజ్ఞాపింపుము, సుందరీ !

తిలోత్తమ:—

(కందార్థము. రాగము - తోడి.)

వలపెఱుఁగదు సిగ్గనునది
తెలియనుగా సామి! నేను తెలిపినవిషయం
బుల, వేరుగఁ దలచినను౦
జులకనగానెంచఁ దగదు

(తాళము - ఆది.)

సుగుణిగణాగ్రగణ్య గంధర్వ జాతీసుమతిలోత్తమపుణ్య !
సొగసిదేయని యెంచి, మగనిగా నినునాకు
భగవంతుఁడేచేసె నాభాగ్యమేభాగ్యము, సుగుణిగణాగ్రగణ్య.

విజయుఁడు:—ప్రాణేశ్వరీ !

(కందార్థము. రాగము - తోడి.)

నరుఁ డొకఁడు సిరినిగోరం
దొరకునొ దొరకకయెపోనో, దుర్లభయగునా
సిరికెవ్వఁడు దుర్లభుఁడగు,
బరమాద్భుతకరముగనా

(తాళము - ఆది.)

భవనలక్ష్మి నీవైతివి, దానిచేనేను నాసవుండనైతిని
ఎవరు నాసాటివారిలలోనే లేరు, త్రి
భువనములోను నాబోటిధన్యుఁడులేఁడు, భవనలక్ష్మీవైతివి.

తిలోత్తమ:—(ఆత్మగతము) ఏమిముద్దుమాటలు, ఏమిప్రేమాతిరేకము !

విజయుఁడు:—(తిలోత్తమను కౌఁగిలించుకొని) నాప్రాణనాయికా ! నాజన్మమిపుడే సఫలమయినది; నాజీవితకాలమునందు నేఁటిదినము

వంటిదినము మఱియొకటి యింక దొరకదు. నీవిట్టులేయుండుము. నీకు తాంబూలమిచ్చెదను.

తిలోత్తమ:—చిత్తము నాకును శ్రమముగనున్నది (అని ప్రియుని యురమున బవ్వళించుచున్నది. విజయుఁడు తాంబూలమిచ్చుచు, దానిలో సగము వేసికొనుచు).

విజయుఁడు:—ప్రాణేశ్వరీ!

(రాగము - సావేరి.)

నీవే నాగృహలక్ష్మివి, నీవే నాకన్నుఁగవకు నిర్మలసుధవు
నీవు శశిశిశిర దేహవు, నీవిరహముదప్ప నీదు నిఖిలముసుఖమా.

(ఇంతలో తిలోత్తమ తల్లిదండ్రులు ప్రవేశించుచున్నారు)

తల్లి:—(తిలోత్తమ దగ్గఱఁగాఁజేరి) ఎక్కడనావంశనాశకురాలు? దౌర్భాగ్యురాలా! ఈలాటినీచపుఁబని చేయుటకా నాకడుపునఁబుట్టినావు? (తిలోత్తమ భయముతో లేచుచున్నది, తల్లిదండ్రులిద్దఱును విజయుని చెయ్యిపట్టిలాగి) ద్రోహీ! నీకీపనితగునా? నీరూపముచేతఁగదా యీపిల్లను మోహింపఁజేసినవాఁడవు. నీకీరూపముపోయి, పిశాచరూపమువచ్చి పిశాచలోకములోఁ బడుదువుగాక. (అని తోసివేయుచున్నారు)

తిలోత్తమ:—(ఇది యంతయుఁజూచి) హా నాప్రాణేశ్వరా! (అని మూర్ఛపొంది క్రిందఁబడుచున్నది)

తల్లి:—ఎవరక్కడ? దీనినింటిలోపలికిఁ దీసికొనిపొండు (అనఁగా నిరువురు చెలులు వచ్చి తిలోత్తమ నెత్తుకొని లోపలికిఁబోవుచున్నారు). మనము వెళ్లిపోదమురండు.

తండ్రి:—(కోపముపోవఁ బశ్చాత్తాపమునొందుచు) అక్కటా! ఈచండాలపుఁగోపమ్మున నెంతటిపని నేసితిని! (అని దుఃఖించుచు నందఱితోడను నిష్క్రమించుచున్నాఁడు.)

---

# కమలాపహరణము.

## నవమాంకము - ప్రథమస్థలము.

ఒకగుహతోఁజేరిన ఘోరారణ్యము.

(విజయుఁడు వికృతరూపుఁడై ప్రవేశించుచున్నాఁడు.)

విజయుఁడు:—(తన దేహమును తాను పలుమాఱుచూచుకొనుచు) హా! దేవదేవా! రామభద్ర! ఈగతి నాకుఁగల్పించినావే! నేనేమిసేతును! నీవుపరమకారుణికుఁడవే! ఇదివఱకు ననేకాపదలనుండి తేల్చినావే! అది అంతయు నీఘోరగతిని గలుగఁజేయుటకేనా! హా! ఆశ్రితవాత్సల్యజలధీ! నీకరుణతప్పునంతటిపాపము నేనేమిచేసినానో! అంబా! నన్నిందులకాకంటివి? యథాక్రమముగ రావలసినరాజ్యమా పోయినది. హఠాత్తుగావచ్చిన లలితరాజ్యమాపోయినది. మహానాయికయగు లలితసాంగత్యమాపోయినది. తల్లిగారిసన్నిధానమా పోయినది. తుదకు నాదివ్యమంగళవిగ్రహముగూడఁబోయినది. ఇవియన్నియుఁబోవుటచేత చింతలేదు. తిలోత్తమా! నీముఖచంద్రదర్శనము పోయెనుగదా! హా ప్రాణసఖి! (అని మూర్ఛనొందిపడుచున్నాఁడు.)

(ఇంతలో గుహలోనుండి ముగ్గురుపిశాచపుపిల్లలువచ్చి విజయుని నూరడించి "నానా" "లేలే" (అనఁగానే విజయుఁడు కన్నుతెఱచిచూచి)

విజయుఁడు:—హరిహరీ! దేవదేవా! ఇదేమిప్రారబ్ధము. ఇదివఱకుపడిన పాట్లుచాలవా. ఈఘోరముఁగూడనా! (అని మరల కనులు మూసి

కొనుచున్నాడు. పిశాచపుపిల్లలు విజయునిచుట్టు గెంతుచు పాడుచున్నారు.)

పిశాచపుపిల్లలు:—యేాలరావు ? నాయనా ! చాలు, చాలు, కోపము.
మాలిమితోవచ్చి మాపాలనంబు సేయుమా.

విజయుడు—(లేచి)మీరెవరు ? ఓదరిద్రురాలా,

పిశాచపుపిల్లలు:—మేమిపుడు దరిద్రగొట్టైపోయినామా ?

హద్దులేల మీరేవు? వద్దు పెంకెవేషము
నిద్దురించెమాయమ్మ సద్దువింటె లేచును.

విజయుఁడు:—ఓరి దరిద్రపిశాచములారా ? మీరెవరు ? మీ తల్లియెవరు? ఈశ్వరా ! ? ఇదేమి ప్రారబ్ధము ! మీయమ్మలేచిన నాకేమి?

పిశాచపుపిల్లలు:—ఆలాగా! మాఅమ్మనస్తే తెలుస్తుంది. గమ్మత్తు.

అమ్మవస్తేపిలకబట్టిచిమ్మి గుద్దులాడును,
ఉమ్మను నీమూతిపై, రమ్మురమ్ము యిప్పుడే.

విజయుఁడు:—అయ్యయ్యయ్యో ! ఇదేమిగ్రహచారము. దేవ! నాకు మంచికుటంబమును గల్పించినావు!

పిశాచపుపిల్లలు:—పదనం అమ్మను తెస్తాం రండి (గుహలోకి వెళ్లిపోదురు).

విజయుఁడు:—ఇదేమి ఇది ! అమ్మయేమి. పిల్లలేమి ! ఇదేమి అద్భుతము! రామచంద్రా! ఇవియన్నియు నీకు ఉత్సాహములే ! అన్నియుఁబోవ ఇట్టిఘోరసంసారమొకటి నాకు తెలియకుండనే కల్పించినావే ! ఇదేమి! అనుకూలురును మనోహరులునైనదారాపత్యములు కలిగియుండుసంసారము స్వర్గమే. ఆసంసారసుఖమునకు సమమగు సుఖాంతరము దైవసృష్టిలో లేదు. బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసము, అను నీనాలుగాశ్రమములలో గృహస్థాశ్రమము, అన్నిధర్మకర్మములకును అనుకూలముగ నుండుటచేతను,సమస్తసుఖావహముగనుండుటచేతను, శ్రేష్ఠతమమని పెద్దలు చెప్పియున్నారు. దీనికి గొప్పనిదర్శనము త్రిమూర్తులు గృహస్థాశ్రమము నవలంబించియుండుటయే. ఇట్లుండ కొందఱు ఇట్టి రమ్యమయిన సంసారమును ఘోరసాగరమని నిందించుచున్నారు. కారణమేమో వారికే తెలియును. అయినను అట్టి ఘోరసంసారమనునది ఇప్పుడు నాతో బంధుత్వముగోరుచున్న యీ తుచ్ఛవ్యక్తులతోఁ జేరియుండుసంసారమే,నిస్సంశయము. (ఇంతలో పిశాచపుపిల్లలు తల్లితో ప్రవేశించున్నారు.)



తల్లి:—(గెంతుచు)

రారా నాసామి! ఇంటికిరా. రాకుంటే నిన్ను నేవదలనురా,
పోరాదు, నన్నువదలకురా, పోతే నీకాళ్లను విరిచేనురా
కూరగలు నారలు లేవంటేరా, కొనితెస్తానన్నావు యేమాయెరా
గారెలు బూరెలు జేసేనురా, జోరుగా దినవచ్చు వెంటనేరా
బిరాన నాకొకముద్దియ్యరా, భేషైన గమ్మత్తు చేస్తానురా.

విజయుఁడు:—ఓ బ్రహ్మహంత్రీ ! నన్నెందుకు పిలచెదవు ? నీ వెవరు ! నేనెవరు ?

తల్లి:—నీవు మొగుడు. నేను పెళ్లాం. అందరు పెళ్లాలు మొగుళ్లను ఎందుకు పిలుస్తారో అందుకే పిలుస్తాను.

విజయుఁడు:—ఇటువంటి కర్ణకఠోరములగు మాటలను గూడ వినవలసివచ్చెనుగదా ! హరిహరీ !

తల్లి :—(విజయుని పిలకబట్టుకుని) ఇంటికొస్తావా లేదా ? (అనిలాగగా విజయునికి కోపమువచ్చి తల్లి పిల్లలను గట్టిగా తన్ని కొట్టగా, వారు గుహలోనికి పారిపోవుచున్నారు.)

విజయుఁడు:—ఇంతహింసతో ఈప్రారబ్ధమువదలినది. ఇఁక నేమిసేయును ! సర్వముపోయినది. దేహముకూడ ఘోరవికృతిజెందినదే ! ఆహా! ఏమిగతి నాకు వచ్చినది ఈశ్వరా !

(రాగము, శ్రీరంజని - తాళము, ఆది.)

పల్లవి:— కరుణించురా, శ్రీరామచంద్ర, కరుణించురా!

అనుపల్లవి:—సురబృందమున కమృతంబొసగి
వరసౌఖ్యములఁ వర్షించినావె, కరుణించురా

చరణము:— పరమదయాకరుఁ డైన నీవే
పరదైవమని భజియించు, నొక
నరమాత్రుఁ డైన నాకీవిహాపా
కరణంబుచేత ఘనహానినీకు, కరుణించురా

పోని, ఈమహాఘోరశిక్ష కర్హుఁడనుగా నను జేయఁదగిన
నేరమేమిచేసినాను? రామ చంద్ర, కరుణా సాగర!!!

(రాగము యదుకుల కాంభోది)

అతిమోహము నాపైఁగల
సతిపై నేనుంచు ప్రేమసైఁపక, నాకీ
గతిని విధించితి వకటా!
క్షితిఁ బాపుల నెటులనీవు శిక్షించెదవో.

ప్రాణత్యాగముచేయువారికి సూర్యప్రకాశము లేని గాఢాంధకార నిబిడమగులోకము విధింపఁబడుచున్నది. అని ఋషులు చెప్పుచున్నారు, అయిన నాకిప్పుడే యీలోకము విధింపఁబడియున్నది. ఎటులనిన, నీపిశాచలోకములో సూర్యరస్మి లేనే లేదు. ఇదేకాఁబోలు. ఆలోకము. కనుక నాకు నేరముచేయుటకు మునుపే శిక్ష తటస్థించినది. ఈకారణమునుఁబట్టి ప్రాణత్యాగముచే యుటకన్న గత్యంతరము కానరాదు. నాయొద్దను ఏయాయుధమును లేదాయెను. (అని నలుప్రక్కల దిరిగిచూచి) ఇదిగో నుయ్యొకటి గనఁబడుచున్నది. దీనిలోఁ బడిపోయెదను. (అని దానిప్రక్కఁ జేరి కూర్చుండి) ఆహా! నేను పుట్టినదెక్కడ! పెరిగినదెక్కడ! అనుభ



వించిన దేవార్హములును లోకోత్తరములు నగు సుఖములెక్కడ? ఇప్పుడు నాకు వచ్చి యున్న యీగతియెక్కడ! ఇరువదియేండ్ల ప్రాయములోనే యిన్నిమార్పులయినవిగా! (అని నూతిలోఁ బడఁబోయి మనసురాక) హాహా! ఈనశ్వరదేహమెంత తీపుగనున్నది! ఈలోకపాశ మెంతగొప్పది! ఇఁక నా కేరీతి సుఖముండదని దృఢముగ తెలిసియు నీఘోరరూపముగల దేహమును వదిలివేయ మనస్సు రాదే! ఆహాహా! ఏమితత్వము! ఇక నెంత యాలోచించిన నిదేగతి. ఈతూరి మనస్సు గట్టిచేసికొనియెదను.

రాగము, ఊశేని. తాళము, రూపకము.

హరి హరి హరి దీనరక్షక! ఓనారాయణ!
ఆపద్బంధు! దుష్టశిక్షక!
పరమపురుష! భక్తపోషక ఓదేవదేవా!
పాపబృందపంకశోషక!
సరసిజాక్ష! గరుడవాహన! శ్రీదైత్యరిపు!
శత్రుతూలహవ్యవాహన!
కరిమొరవిని కాచినావుగా! సర్వేశ నాపై!
కరుణయుంచిప్రోవ నీవుగా!
శరణము వేఱెఱుఁగలేనురా! శ్రీనాథ! నీదు
చరణముల నే నమ్మినానురా!
గరళమమృత మరియు మిత్రము నీయాజ్ఞచే, నా
గాత్రము నీకరుణావశము.

(అని నూతిగట్టుచేరి) తల్లి సర్వంసహా! సఖి నిర్మలచిత్తా! దేవి లలితా! ప్రియసఖ మారీచుఁడ! సఖి హిడింబి! హృదయేశ్వరి తిలోత్తను! నాగతి ఇంతే! ఇదేకడసారి మిమ్ముతలఁచుట. నేను జనిపోయెదను. (అని నూతిలోఁ బడిపోవును. ఆనూతియందు

వికృతరూపమును పోఁగొట్టి యథార్థరూపము నిచ్చు శక్తియుండు టంజేసి, విజయుఁడు మునిఁగి తేలగా తననిజరూపము వచ్చియుం డుటంజూచి) ఓహోహో! ఇదేమిచోద్యము! (అని గట్టుమీఁదికివచ్చి తన దేహమును లెస్సగా చూచుకొని) నా నిజరూపము మరలవచ్చినది! ఇది కొంతపుణ్యమే! ఈనూతిలో నేమో విశేషమున్నది. మరల మునిఁగిచూచెద (అని మునిఁగి తేలగా, మరల ముందటివికృతరూపము వచ్చుటనుజూచి గట్టునకువచ్చి) ఇదేమిది! మరల వికృతరూపము వచ్చినదే! పరీక్షచేయఁబోయి ప్రమాదము దెచ్చుకొన్నట్లున్నదే! అయిన మరల మునిఁగిచూచెద. (అని మునుఁగఁగా, మరల నిజరూపవచ్చినఁ జూచి) ఇంతటితోఁ జాలు నీపరీక్ష. ఈనూతిస్వభావము తెలిసికొన్నాను. నా నిజరూపము దొరకినది చాలు. ఇదియురామచంద్రుని కృపాబలమే! ఇక నేమి చేయను. (నాలుగడుగులు ముందుపెట్టి) ఇదిగో ఒకదారివెళ్లుచున్నది. దీనింబట్టి నడచెదను. ఇదివఱకు సకలశాస్త్రకోవిదులును, తత్వజ్ఞానులును, కనుఁగొనని గూఢరహస్యము లనేకము లీధరణియం దున్నవి. కనుక వెళ్లుచువెళ్లుచు నుండగాఁ గొత్త వింత లేమేమి తటస్థింపనున్నవో! (ఇంతలో కుడికన్నదరుటఁ జూచి సంతోషముతో) ఇక్కడేమి శుభసూచన.

రాగం - పున్నాగవరాళి.

అదరెదవేలే కన్నా!
యిదివఱకును సౌఖ్యబృంద మెంతో కలిగె
న్నదిదలచినదుఃఖావహా
మదియే, నిను నమ్మరాదిఁకఁగుడుచాలుఁ.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

---

నవమాంకము - ద్వితీయస్థలము.

---

అరణ్యములో మఱియొకభాగము.

(విజయుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విజయుఁడు:—ఈయది ఋష్యాశ్రమముగనుండవలయు. అతిరమ్యముగనున్నది. (నలుప్రక్కలు తిరిగిచూచి) అయినను బహుదినములుగా మనుష్యసంచారము లేనట్లున్నదే! ఆరవేసిన కాషాయవల్కలములు ఆరవేసినట్లే యున్నవే! అనేకదినములకు ముందు వ్రేల్వఁబడిన అగ్నిత్రయము ఉంచిన దుంచినట్లున్నది. దర్భ,సమిధలు బహుదినములుగా కోయఁబడక యథేచ్ఛముగాఁ బెరుగుచున్నవి. మఱియు చిలుకపంజర మొకటి, దానిప్రక్కను ఒకటి, రెండు, మూఁడు, నాలుగు, అయిదు, ఆఱు రాళ్లదిబ్బలున్నవి, ఇదే మిది! (అని యాలోచించుచుండును.)

ఆకాశమున:—"ఓమహాత్మా! ఈచక్రముపై నిలువఁబడి, ఈపంజరముననుండు చిలుకను మూఁడుదెబ్బలు కొట్టితివేని మాశాపము పోయి నిజరూపము వచ్చును, మాశత్రువును హతుఁడౌను. తప్పితివేని నీవును రాయివై పోదువు" (అని వినబడును).

విజ:—ఇది యొకవింత! వింతలకై నేను పుట్టితినిగదా! ఈరాళ్లదిబ్బలన్నియు నాలాటి రాళ్లేకాఁబోలు! అయ్యో! వీరల కెంతటికష్టమువచ్చినది! పాపము. కొన్నిసమయములలో దేవుఁడు నిర్ఘృణుండుగ నగపడుచున్నాఁడు. ఏలొకో! ఈలోకములో ఎవఁడు తన శక్తికొలఁది ఎల్లరకు సౌఖ్యమునిచ్చి తాను సుఖించునో వాఁడే యుత్తముఁడని పెద్దలు సిద్ధాంతముచేసియున్నారు. మఱియు ప్రతిమనుష్యుఁడును, ఇతరులకు బుద్ధిపూర్వకముగా మేలుచేయువచ్చునేకాని, యొంతమాత్రమును గీడు చేయఁగూడదు. తనకుఁదానేమి

చేసికొన్నఁ జేసికొనవచ్చును, కనుక నే నీపనికి పూనుకొని కొనసాగించితినా ఇతరులు సుఖపడుదురు నేనును సుఖపడుదును. తప్పిపోతినా వారికేమియు హానిలేదు, నాకేకదా హాని! మంచిది! కొన్నాళ్లు పిశాచరూపమును ధరించి యుంటినికదా! ఇపుడు శిలయయిపోయిన దానికన్ననయమే, ఏ జ్ఞానమునులేక యుండవచ్చును. (అని ధనుస్సునెత్తి గుణమునెక్కించి బాణసంధానము చేసి) రామభద్ర! నీకటాక్షముండిన నాకే కొఱఁతయు రాదు. (అని యొకబాణము వేయఁగా తప్పిపోయి విజయుఁడు మోఁకాలువఱకు రాయైపోవును) ఇంతలోనే మోఁకాలువఱకు రాయియైనదే, ఏమిచేయు నిఁక! "శ్రేయాంసి బహువిఘ్నాని" అను తెలుఁగున నేనే మంచిపనియారంభించిన ప్రథమమున కీడే వచ్చుచున్నది. మఱియొకదెబ్బ కొట్టిచూచెదను. (అని రెండవబాణము వేయఁగా నదియు తప్పిపోయి నడుమువఱకు శిలయైపోవును, (దుఃఖముతో) హా దేవ! నాగతియు దగ్గరించినదే ఏమిసేతు నిఁక! ఈయొకదెబ్బతో క్షేమమో నాశమో, పరిష్కారమై పోవుచున్నది. దీనిని కొట్టివేసెదను. రామభద్రా! నన్ను కాపాడవలయును. (అని పాడుచున్నాఁడు.)

రాగము-కేదార. తాళము. ఆది.

పల్లవి:— రామ నిన్నె నమ్మినాను రాక్షసవనదహనా!
అనుపల్లవి:— తామసంబు నాపైఁ జూపిన,
తాళగలన నే తృణప్రాయుఁడను॥ రామ
చరణము:— ఇక నీక్షణమే నాగతియేమో, యెఱుకలేదు నాకు
ప్రకటించి శిలన్నారిగ జేసితి పాదధూళితోనే
పికములగ్రుడ్లు పిల్ల లౌట కొక ప్రకరణముంచితివే
సకలలోకపాలక శ్రీనివాస!
సంతసించినను సంరక్షింపుమా॥ రామ



(అని మూఁడవదెబ్బకొట్టఁగా అది చిలుకపై తగులుచున్నది, విజయునికి మొలవఱకును కలిగియుండిన శిలాత్వముపోయి నిజరూపు మరల వచ్చుచున్నది, అప్పుడు అదివఱకు నొకకొమ్మమీఁదను గూర్చుండి ఘోరాకృతివహించియుండిన యొక బ్రహ్మరాక్షసి క్రిందకుదిగివచ్చి, అతివేగముగ విజయునిదగ్గరఁ జేరి అతివినయముతో)

బ్రహ్మరాక్షసి:— ఓమహాత్మా! నీకృపచే నేను, మఱికొందఱును, ధన్యులమయితిమి. నీకు అనంతకోటిపుణ్యములు గలవు. నీవు దీర్ఘాయుష్మంతుఁడవుగాను, సకల సంపత్సంపన్నుఁడవుగాను, నుందువుగాక.

విజయుఁడు:— (వానింజూచి భయభక్తులతో) మునినాథా! మీరెవరు? ఈఘోరరూప మేలవచ్చె? ఈఘంటలేమి? మువ్వలేమి? దయతో సెలవియ్యవలయును.

బ్రహ్మరాక్షసి:— నేను భరతమునిశిష్యుఁడను, ఒకగంధర్వకన్యక నాదగ్గర సంగీతనృత్యవిద్య లభ్యసింపఁగోరి నన్నడుగఁగా, నాకు మతిపోయి నాతో కలసిననేకాని నీకు విద్యచెప్పనన్నాను. అందుపై ఆపె కోపగించి, నాసహపాఠియగు మఱియొక ఋషియొద్దచేరి, ఈవృత్తాంతములుచెప్ప, నతఁడు నామీఁదనాగ్రహించి, కక్కుర్తిపడి విద్యచెప్పనందున బ్రహ్మరాక్షసియై పోవలయునని నన్ను శపించినాఁడు. అందుమీఁద నాకాగ్రహమువచ్చి ఆగంధర్వకన్యకయును ఆఋషియును శిలలై పోవలయునని, నేను శపించినాను. వారు, మాకెప్పుడు శాపవిమోచనమనియడుగ, నీచిలుకపంజరమును ధనుర్బాణములును నీచక్రమునుగల్పించి, ఎవ్వఁడైననొకఁ డీచక్రము మీఁద నిలఁబడి, మూఁడుదెబ్బలలో నీచిలుకను ఎప్పుడు గొట్టునో అప్పుడనియు, ఆలాగు కొట్టఁ దప్పిపోయిన వాఁడును శిలయై పోవుననియు, వీరందఱకు నీలాగున నొకఁడు కొట్టునప్పుడు శాపవిమోచనమనియు నేను జెప్పినాను. నాకును నాశాపవిమోచనమప్పుడేయని, ఆఋషియు చెప్పినాఁడు. వేదచతుష్కమును ఈచేతనున్న

నాలుగు పెద్దఘంటలయినవి, షట్ఛాస్త్రములును ఈచేతనున్న చిన్నఘంటలైనవి, సంగీతశాస్త్రము మెడనున్న మువ్వలయినది. నృత్యశాస్త్రము కాళ్లనున్న మువ్వలైనది. నీయనుగ్రహమువలన నాసమయము తటస్థించినది. ఇఁక నేనిచట నుండరాదు. వెళ్లిపోవలయును. సెలవు. తక్కినవారిని నీక్షణమే చూతువు.

విజయుఁడు:—మునినాథ ! నాచే మీఁకును, నితరులకును, శాపవిమోచనమైనందులకు చాలసంతోషించినాను. దయమాత్ర ముంచవలయును.

బ్రహ్మరాక్షసి:—నీ మనోభీష్టములన్నియు శీఘ్రములోనే చేకూఱఁబోవుచున్నవి. నీకేకొఱంతయురాదు. (అని నాలుగడుగులువచ్చి) ఇఁక సందరులెండు (అని వెళ్లిపోవుచున్నాడు. ఈమాటచెప్పగానే అఱురాళ్లదిబ్బలును పగిలి, ఒకఋషి, ఒక గంధర్వకన్యక, నలుగురు రాజకుమారులు, బయలు దేరుచున్నారు.)

విజ:—(వారింజూచి అత్యాశ్చర్యానందములతో) ఇదేమొ గొప్పవింతగనున్నదే !

ఋషి:—ఓమహాత్మా! నీకు సర్వాభీష్టసిద్ధియగుఁగాక ! నీకృపచే మాయందఱికి శాపవిమోచన మైనది. ఇందరికి నుపకారముచేసిన నీభాగ్యమే భాగ్యము.

విజయుఁడు:—మునినాథ ! మీరెవరు ? దయచేసి సెలవియ్యవలయును.

ఋషి:—నే భరతమునిశిష్యుఁడను.

విజయుఁడు:—ఇపుడు నాకన్నియు విశదపడ్డవి. ఈపె తమ శిష్యురాలు గంధర్వకన్యకకాఁబోలు ?

ఋషి:—ఔను.

విజయుఁడు:—ఈనలుగురు రాజకుమారు లెవరో !

ఋషి:—నాకును తెలియదు.

విజయుఁడు:—(గంధర్వకన్యకనుజూచి ఆత్మగతముగ) ఆహాహా ! ఎంతలోకోత్తరమైన సౌందర్యము! (దగ్గఱఁజేరి) సౌభాగ్యవతీ! వీరు రాజ



కుమారులై యున్నారు. వీరిని బలుకరించి వెనుక నిన్ను కుశల ప్రశ్నచేయవచ్చునా ? ఆజ్ఞయిచ్చెదవా ?

గంధర్వ:—చిత్తము భద్రముఖా! ఆలాగుననే కానిమ్ము. (అనఁగా విజయుఁడు వారి దగ్గరగాఁ బోవ ఆత్మగతము) ఈమహాపురుషుఁడెవఁడో! వీనిచూచినంతట నాకేమో చిత్తవికారము కలుగుచున్నదే !

రాజపుత్రులు:—మహాత్మా! మేమందఱమును సవినయముగ మీకు వందనము చేయుచున్నాము.

విజయుఁడు:—రాజపుత్రులార ! నాయనంతకోటి వందనములు దయతో చేకొనవలయును. మీరెవరో మీకేల యీఘోరదుర్గతివచ్చినదో. దయచేసి సెలవిచ్చితిరేని సంతోషించెదను.

రాజపుత్రులు, ఒకఁడు:—నేను కాశ్మీరదేశపురాజపుత్త్రుఁడను. దేశాటనముచేయుచు ఈయరణ్యమునకురాఁగా నొకయశరీరవాక్కు వినవచ్చినది.

విజయుఁడు:—నాకును ఆలాగుననే వినవచ్చినది.

రా. ఒకఁడు:—అయిన వెనుక జరిగినది మీరూహింపఁగలరు.

విజయుఁడు:—ఔను.

రెండవరాజపుత్రుఁడు:—నేను పాంచాలరాజకొమారుఁడను. వీరికివచ్చిన రీతిని నాకు నీగతివచ్చినది.

మూఁడవరాజపుత్రుఁడు:—నేను ఘూర్జరరాజుకుమారుఁడను, నావృత్తాంతము నిదియే.

నాల్గవరాజపుత్రుఁడు:—నేను కేరళరాజుకుమారుఁడను, నావృత్తాంతము నిదియే.

విజయుఁడు:—నాచేత మీకందరికి నీయుపకారము గలిగినది నే నెంత పుణ్యుఁడను !

రాజపుత్రులు నలుగురు:—మహాత్మా ! మీరు మహాపురుషులు, కానిమెడల నీలాటి సత్కార్యముచేయుసమర్థతకలుగదు. మేముఎపుడుగాని ఈమహోపకారమునకు తగిన ప్రత్యుపకారముల జేయసమర్థులము

కాఁజాలము. మాయొక్క వినయవాత్సల్యకృతజ్ఞతా పురస్సరము లగు వందనములను కృపతో నంగీకరింపవలయును. మేమందరము నేకమనస్కులమయి ప్రార్థించుచున్నాము.

విజయుఁడు:—చిత్తము. నావందనములను తమరందఱును గృపతో నంగీకరించి నన్నుమఱచిపోక నాయందు భ్రాతృవాత్సల్యము నుంచవలయునని నాముఖ్యప్రార్థన.

రాజపుత్రులు నలుగురు:—పరస్పరమాలాగే. ఒకమనవి. మీవృత్తాంతము కొంత తెలిసిన సంతోషించెదము.

విజయుఁడు:—మీతో మనవిచేయఁదగిన నావృత్తాంతమేదియు లేదు. ఏదోకొంచెముండిన, దానిదెలుప సమయమిదికాదు. దయతో మన్నింపవలయును.

రా. నలుగురు:—మీవినయ మనన్యాదృశము. కాలక్రమమున దెలిసికొనవచ్చునుగదా?

విజయుఁడు:—చిత్తము, ఆలాగే.

రా. నలుగురు:—ఇఁక మేమునెలవుపుచ్చుకొందుమా?

విజయుఁడు:—చిత్తము.

రా. నలుగురు:— (గంధర్వస్త్రీ దగ్గఱఁ జేరి) సౌభాగ్యవతీ! సెలవు. (ఋషితో) మునినాథా! సెలవు (అని వెళ్లుచు జనాంతికముగ) ఈస్త్రీ దేవతాస్త్రీ కాఁబోలు. ఏమిలావణ్యము! ఇట్టినారీమణి దర్శనమైనదే! ఈదినము కడుగొప్పది. (అని వెళ్లిపోవుచున్నారు.)

విజయుఁడు:— (గంధర్వకన్యకను జూచి) సౌభాగ్యవతీ! నీపూర్వవృత్తాంతమును దయచేసి కొంచెము తెలియఁబఱుపవచ్చునా? నీవు వీరివద్ద విద్యాభ్యాసమునకై వచ్చి శాపమును బొందినట్టు మాత్రము నాకు తెలియును.

గంధర్వ:—ఓపురుషోత్తమా! నాపేరువిద్యుల్లత.

విజయుఁడు:—ఆనామ మన్వర్థమైనది.

విద్యుల్లత:—నేను తిలోత్తమయను గంధర్వకన్యక చెల్లెలను.



విజయుఁడు:—(ఆమాటవిని) హా! ప్రాణేశ్వరీ! (అని మూర్ఛిల్లి పడిపోవుచున్నాఁడు.)

విద్యుల్లత. ఋషి:—ఇదేమి కరుణాద్భుతరసము! భద్రముఖ! సమాశ్వసిల్లుము. (అని యుపచరించుచున్నారు.)

విజయుఁడు:— (సమాశ్వసిల్లి) హా! సుందరీ! హా! మనోన్మణీ! హా! జీవాధారమా! నిన్నెటులఁజూతునే! ప్రాణనాయికా! (అని ఏడ్చుచున్నాఁడు.)

ఋషి:—(జనాంతికము) విద్యుల్లత! ఇతఁడు మీతిలోత్తమనాయకుఁడుగా నుండవలయును.

విద్యుల్లత.—నాకును నాలాగే తోఁచుచున్నది. అయిన నడిగి తెలిసికొందము. (ప్రకాశముగ) ప్రియవయస్యుఁడ! నామనవియొకటి చిన్నదున్నది.

విజయుఁడు:—సౌభాగ్యవతీ! నిర్భయముగఁ జెప్పుము.

విద్యుల్లత:—ప్రియవయస్య! తిలోత్తమనుకలిసికొని యెన్నాళ్లాయెను? ఈవియోగమేలాగువచ్చెను?

విజయుఁడు:—ఒకరాత్రి నిర్మలుఁడుగ చంద్రుఁడు వెలయుచుండ, నేనును, నాప్రియురాలును, నుద్యానవనమందలి లతాగృహంబున నత్యుత్సాహానంద ప్రేమావిష్టచిత్తులమై, శృంగార వ్యాపారములచే మయిమఱచి, విహరించుచుంటిమి. మరల నట్టిసమయము దొరకునా! దొరకదు! దొరకదు! ఆమనోహర...మగుకాలములో కడు కోపముతో స్త్రీపురుషులిద్దరు, మీతలిదండ్రులు కాఁబోలు, వచ్చి నన్ను పిశాచరూపమును పొందుమనిశపించి, అయోమయమగు నొకస్థలములో పడఁద్రోసిపోయిరి, నాప్రాణసఖి మూర్ఛిల్లిపడిపోయినది. ఆబిడకేమైనదో ఏలాగున్నదో నాకుఁదెలియదు. నాస్థితియు నాబిడకు తెలియదు. ఆపిశాచరూపముతో పడరానిపాట్లు పడుచు కొన్నాళ్లు గడపినాను. తుదకు దైవకృపచే నిజరూపమువచ్చినది. ఇన్నాళ్లు నేలాగున ప్రాణేశ్వరిని జూడక, ప్రాణత్యాగమును జేయక

గడపినానో నాకే ఆశ్చర్యముగనున్నది. ఎట్టులు నీహాతజీవితము నాదేహమును త్యజింపకున్నది. ఇదినాస్థితి. నావంటి దౌర్భాగ్యుడు లోకములో నెవఁడైన కలఁడా ?

విద్యుల్లత:—ప్రియవయస్య ! అయ్యో! మీకీలాటి యిక్కట్లువచ్చినవా! గతించినదానికై చింతించుటచే రాఁగలదేమి ? ప్రకృతమందు జరుపవలసినదాని నాలోచింపవలయును. మనమిద్దరము కలిసి మా నగరునకు వెళ్లుదము. రండు ! నేను మీకు మరల సమావేశము చేయించెదను.

విజయుఁడు:—నీయాజ్ఞచొప్పునఁ జేయ సన్నద్ధుఁడనై యున్నాను. కాని మీతల్లిదండ్రులకు మరల కోపమువచ్చునేమో యని కొంత చింతింపవలసియున్నది.

విద్యుల్లత:—అట్టిచింతవలదు. నేనన్నిటిని సమరసపఱచఁగలను. అదియునుంగాక, తల్లిదండ్రులు, భర్తృవియోగముచే దుహిత దుఃఖపడుటను జూచి దీర్ఘకాలమోర్వలేరు. నిర్భయముగ రండు. నామనవి దయచేసి అంగీకరింపవలయును.

ఋషి:— మహాత్మా ! విద్యుల్లతచెప్పినదంతయు వాస్తవమే. నీకేచింతయు వలదు. జ్ఞానదృష్టిచే నేనును జూచినాను. అన్నియు ననుకూలముగ నున్నవి. ఇదేమంచిసమయము. తప్పక వెళ్లవలయును.

విజయుఁడు:—చిత్తము మునినాథ ! నాప్రాణనాయిక ముఖచంద్రదర్శనము చాలును. వెనుక నేగతివచ్చినను సంతోషమే. సఖీ! వెళ్లుదము వచ్చెదవా ?

విద్యుల్లత:—చిత్తము. ఇదిగో సన్నద్ధురాలనే! మీరు నాకుఁ జేసినమహోపకారమునకు నింతటిప్రత్యుపకారమైనఁ జేయకపోయిన నాజన్మమేల ? కాల్పనా ?

విజయుఁడు. విద్యుల్లత:—మునినాథ ! మేముసెలవు పుచ్చుకొనుచున్నాము. అనంతకోటివందనములు.

ఋషి:—సకలసన్మంగళాసిభవన్తు-వెళ్లుఁడు !



విద్యుల్లత:—(నిట్టూర్పుతో జనాంతికము) వీరి కన్యోన్య మోహాతిశేక మిలాగున్నది. నామనోభీష్టమునకుఁ బ్రవృత్తియేలాగు. (దుఃఖముతో) ఇప్పుడు నాయాత్మవ్యర్థమైనదిగాను, శోకింపఁదగినదిగాను నాయెను. హా ! దేవ !

(అని యందఱును నిష్క్రమించుచున్నారు.)

---

## నవమాంకము. తృతీయస్థలము.

తిలోత్తమనగరుతోఁజేరిన యారామములోని తటాకమువద్దనున్న వేదిక. (మనోరమ చింతాగ్రస్తురాలై పై వేదికమీఁద కూర్చున్నదై ప్రవేశించుచున్నది.)

మనో:—సుభాషిణి యూరినుండి యెపుడువచ్చునో! నాకేమియు తోఁచకున్నది.

సుభా:—[ప్రవేశించి] మనోరమ ! నీమనను మిగులఁ గలతఁజెందియున్నటుల నున్నదే ! క్రొత్తవిశేషము లేమైనగలవా ?

మనో:—(నిట్టూర్పుతో) ఇదివరకునుండు విశేషములు చాలవా, ఊరినుండి యెపుడువచ్చినావు ?

సుభా.—ఈనిమిషమే. వెంటనే మనసఖి తిలోత్తమ యెటులున్నదో యనుచింతతో, మేడంతయు వెదకి చూచినాను, ఎక్కడను గనఁబడలేదు; తుదకు నాపైతల్లిదండ్రులుండు గదిలో దూరితిని. కటకటా ! ! వారిస్థితి నేమనను !

మనో:—వారిస్థితినిబట్టియే నాకీమనఃక్లేశము. ఇది వారి స్వయంకృతానర్థము. కోపము సర్వచండాలమైనదికదా, దానిచేత నీదశను దెచ్చుకొన్నారు. మనకును తమ ముద్దుకూతునకును నివారింపఁగూడని యీదుర్దశఁగల్పించిరి. పోనీ వారేమన్నారు నీతో ?

సుభా:—నన్ను జూచినవెంటనే "అమ్మ! సుభాషిణీ! మీసఖి తిలోత్తమ భర్తృవియోగదుఃఖసాగరమగ్నయై యున్నదనుట నీకుఁ దెలిసినదే కదా! తిండికూడ మానుకొనియుండుట యటుండనీ; ఉరివేసికొనునోయని మేము బెంగపెట్టుకొని యున్నాము. ఇల్లంత వెతకిన నెక్కడనుగనఁబడదు. దానివెతకి, కనిపెట్టి నీశక్తికొలది యోదార్చి మావద్దకుఁదీసికొనిరమ్ము" అని తల్లిగారు సెలవిచ్చిరి. తండ్రిగారన్నానో మాట, పలుకు, ఏమియు లేక శల్యచర్మావశిష్టులై యున్నారు.

మనో:—ఈలాగే నాతోను సెలవిచ్చిరి. నేనును రెండుగడియలుగా, ఇల్లు, తోట, అంతయు వెతకిచూచినాను. మనసఖి యెక్కడను గనఁబడలేదు. నేనుగూడ బెంగపెట్టుకొనియున్నాను.

సుభా:—అయ్యో, వీరికివచ్చియుండు నీచండాలపు దుర్దశ, పరమశత్రువునకుగూడ రాఁగూడదు; వీరి ముద్దుముచ్చటలు చెల్లించుటకు వీరి కుండువారు ఆఁడుపిల్లలిద్దరేకదా. వారిలో రెండవదియగు విద్యుల్లత యేగతినొందినదో జీవముతోనైన నున్నదో, లేదో! తెలియదు. మొదటికూతునకు వచ్చియుండుగతియా, యిటులున్నది. ఈలోకప్రయుక్తసుఖము వీరి కేమున్నది! మనమిద్దఱముఁ గలసి మరల నీయారామమును జక్కఁగ వెతకిచూతమురా.

మనో:—ఆలాగే. (కొంచె మాలోచించి) సుభాషిణి! తిలోత్తమయును దానిప్రియుఁడును ఇంటికి కొంచెముదూరమున నేకాంతస్థలములో నుండు లతాగృహములో కదా మొట్టమొదట కలిసికొన్నారు.

సుభా:—అవు నవును. దాని నేను వెతకకపోతిని.

మనో:—అక్కడనే మన సఖియుండును; అక్కడికి వెళ్లుదము.

(అని నిష్క్రమించుచున్నారు.)

## నవమాంకము- చతుర్థస్థలము.

(తిలోత్తమ నగరుతోఁ జేరిన యారామము.)

(తిలోత్తమ పతివియోగదుఃఖముచేతఁ గృశించినదై, అలంకారమెద్దియు లేక, మైలగా నుండు బట్టగట్టుకొని, ఏకవేణీధరయై, పై యారామంబున నేకాంతస్థలములో నుండు లతాగృహములో, రాతిబల్లపై కూర్చున్నదియై ప్రవేశించుచున్నది.)

తిలో:—దేవదేవా, రామభద్రా, రామచంద్రా, కృష్ణా, దేవకీనందనా, శ్రీనివాసా ఇక నాగతియేమి!

మనో, సుభా:—(ప్రవేశించి) అదిగో మన సఖి! ఏలకో పలవరించుచున్నది. చాటున నుండి వినుదముగాని రమ్ము.

తిలో.—

రాగము - పున్నాగవరాళి, తాళము-త్రిపుట.

పల్లవి. శ్రీనివాస దేవా, శ్రితపాలక నేను
మానిని నని యెఱుఁగవా!

మనోసుభా:—అయ్యయ్యో!!! మనసఖి లావణ్యమంతయు భూతపూర్వమైనది కదా, ఏమి ఘోరదుర్దశ.

తిలో.—

అనుపల్లవి. మానము గోరువారు ప్రాణము సైతము
మడియింప తెగింతురే, కుహిని నెచ్చోటను, శ్రీనివాస.

చరణము. ఏరీతి కీడును నెవ్వారికైనను
ఎందుకైనఁజేసి, యెఱుగనుగా
ఈరీతి దుర్గతికేలా నేపాలైతి
మారక దశనాకుఁ బారివచ్చియున్నది, శ్రీనివాస.

మనో,సుభా:—(తిలోత్తమ చెంతఁజేరి) సఖి, తాళుకొనుము, తాళుకొనుము, వేగమే మంచికాలము వచ్చును.

తిలోత్తమ.—

రాగము - తోడి, తాళము - ఆది.

పల్లవి. ఏమిసేతునేచెలి, ఎటులోర్తునేచెలి.
అనుపల్లవి. కామకాముఁడౌనా - సామినెడఁబాసినే నేమి.
చరణములు. ఎల్లలోకములనా, వల్లభునిమాటలే
చల్లనితేనె యవి - దుర్లభములాయె చెలి. ఏమి
భామరోప్రాణేశుని - సోమసున్దరమైన
మోమునుజూడలేక - తామ దేవతనైతి నేమి.
చానరోనాపైని - శ్రీనివాసునిదయ
గానరాలేదాయె భాగ్యహీననై తినయ్యో ! ఏమి.

మనోరమ.—సఖి తిలోత్తమ ! నీవీలాగుచింతించుట ధర్మముగాదు- వేగమే మంచికాలము నీకురాకమానదు - దేవుఁడు పరమకారుణికుఁడు గదా !

తిలోత్తమ.—చెలి ! దేవునిపరమకారుణికత్వము నేమనను! - ఏలాగునఁ బొగడను ?

రాగము - ఉశేని లేక యదుకులకాంబోది.

అతిమోహము నాపైఁగల
పతిపై నే నుంచియున్న భక్తికి, నాకీ
గతిని విధించెనె యకటా !
క్షితిఁబాపుల దేవుఁడెట్టుల శిక్షించునో

సుభాషిణి:— సఖి! బ్రహ్మదేవుఁడు లోకములో నిదివఱలోఁ దానేపుట్టించిన సున్దరులందఱిని దిగఁద్రొక్కఁదగిన యొకసున్దరిని బుట్టింప



నిశ్చయించి, ప్రపంచములో నక్కడక్కడ రమణీయతమములగు వస్తువులలో రమణీయతమములగు భాగములలో తిలప్రమాణముదీసి, నీమేనునుం జేసెనుగదా ! కనుకనే నీకుఁ దిలోత్తమ యనునామమిడిరి. అదియునుంగాక, మనగంధర్వమానినులు సైతము ఏకమనస్కులై, గంధర్వసుందరీనవమాలికావల్లికామతల్లికయను బిరుదు నీకిచ్చియున్నారుగదా ! అట్టి సర్వమంగళకరమైన నీమేనును నీవే యీలాగు పాడుచేయుట న్యాయమా ?

తిలోత్తమ:—చెలీ ! ఈమే నిఁకనెందుకే ?

(రాగము-ఘంట, తాళము-జంపె.)

పల్లవి. ఈమేను జీవునకు నిఁక నేలనే?
అనుపల్లవి. పామాదిరోగములు పట్టితినుటకెగాని, ఈమేను.
చరణము. మానినికిఁ బతియె, యీ మహినిసర్వస్వంబు
మరియెద్దియునువాని సరికాదుగా
శ్రీనివాసుఁడతని శ్రీనిబొమ్మునఁ దాల్చి
చానరోననునాథ హీనయగునటుచేసె, నీమేను.

సుభాషిణి:—సఖి ! బంగారుబొమ్మవంటిపిల్లవాఁడున్నాఁడే, వానిమోముఁజూచి యోదార్చుకోవద్దా,

తిలోత్తమ:—చెలి !

(రాగము - ఆనందభైరవి.)

పిల్లఁడుండిననేమి, పెనిమిటిలేనిచో
రాముకుదైవంబురమణుఁడుకదె
ఏమి సేయుదుదైవమేల నన్ బుట్టించెఁ
గోమలిగా, నేనుగోరినానె
అటుగోరియుండిననన్ని యంశములలోఁ
గించలేకుండ నన్నుంచరాదె

సకలలోకములలో సాటిలేనట్టినా
సామినేనెడఁబాసిసైఁపఁగలనె.

(విజయుఁడు విద్యుల్లత ప్రవేశించి, కొంతదూరములో చాటున నిలఁబడి)

విద్యుల్లత:—(విజయునితో) ప్రియవయస్య! తిలోత్తమ కడుదీనస్వరముతో విచారించుచున్నటులున్నదే.

విజయుఁడు:—నీవు ముందుపోయి యోదార్చుము. వెనుక నేనువచ్చుట బాగు.

మనోరమ:—నీసామి ఘోరవికృతరూపుఁడై పోయెనే!

తిలో:—

(రాగము - ముఖారి.)

చూచువారికి, ఘోరపిశాచరూపి
యైననాకది రమ్యమే, యానబెట్టి
చెప్పుచున్నాను, మఱిమాతప్పులన్ని
శ్రీనివాసావతార నాచెంతరావా?

హా ప్రాణనాథా! (అని మూర్ఛిల్లును.)

విజయుఁడు:—ప్రమాదము వచ్చునటులున్నది. వేగమే వెళ్లుము. (అనఁగా విద్యుల్లత పరుగెత్తివచ్చి).

విద్యుల్లత:—వచ్చినాఁడిదిగో నీప్రాణేశుఁడు. తాళుకొమ్ము తాళుకొమ్ము. (అని తిలోత్తమ కుపచారముచేయును. ఆపెకు మూర్ఛనుండి తెలివిరాకపోవుటఁజూచి) ప్రియవయస్య! నాకశక్యముగనున్నది. రమ్ము రమ్ము!

విజయుఁడు:—(పరుగెత్తివచ్చి) నాప్రాణనాయికా! ఇదిగో నేను వచ్చినాను. తాళుకొమ్ము. (అనఁగా నాధ్వనివిని లేచి.)



తిలోత్తమ:—ప్రాణేశ్వరా! (అని విజయునిఱొమ్ముపైఁబడి చేతులతో కౌఁగిలించుకొని, గద్గదస్వరముతో నేడ్చును. అందఱును ఆశ్చర్య ర్యముతో స్తబ్ధులై నిలఁబడి యుందురు.)

విజయుఁడు:—ప్రాణేశ్వరీ! ఇఁక మనకానందమే! శోకమేల?

తిలోత్తమ:—(విజయుని బాగుగఁ బ్రేమానందములతోఁ జూచుచు) కన్నులు నన్ను మోసపుచ్చలేదు గదా; నాముద్దుల సామి యేనా!.

విజయుఁడు.—నీముద్దులసామియే, చక్కఁగఁజూచుకొనుము.

తిలోత్తమ.—నీవు పిశాచరూపివైనావన్నారే?

విజయుఁడు.—నారూప మిపుడేలాగున్నది సుందరీ?

తిలోత్తమ.—ముందటికన్న నధికముగ ముద్దులొలుకుచున్నది-నాబంగారు సామీ! (అనఁగా నిద్దఱును ఒకరినొకరు మిక్కిలి ప్రేమాతిరేకముతో ముద్దులాడుకొనుచుందురు).

మనోరమ.—సుభాషిణి! ఈమంగళానంద వృత్తాంతము నమ్మగారితోఁ జెప్పుదము రా! (అని యిద్దఱును వెళ్లుదురు.)

తిలోత్తమ.—నాముద్దులసామి! ఈయానందమనుభవించి యెన్నాళ్లాయెను! ఇన్నాళ్లు నేనుబడినచిన్త దుఃఖము చెప్పఁదరముగాదు.

విజయుఁడు.—ముద్దియ! నేనుబడినదుఃఖ మటుండనీ-ఇడుమపాటుల నేమనునది!

తిలోత్తమ.—ప్రాణేశ్వర, నావలనఁగదా నీకు దుఃఖము, ఇడుమపాటులు గలిగెను (అని కన్నీరునింపుచున్నది.)

విజయుఁడు.—శోకమువలదు ప్రాణేశ్వరీ! నీతల్లికిమాత్రము కోపములేకుండునేని మనకీపై నేలోపము కలుగదు - ఆనందముతోనే యుండ వచ్చును.

తిలోత్తమ.—ఆచిన్తవలదు. నాతల్లి మనగతినిగుఱించి మిగులదుఃఖగ్రస్తురాలై, సదా తన్ను తానేతిట్టుకొనుచున్నది.

విజయుఁడు:—అయిన మనకిఁక నేరీతి యడ్డుచు లేనిపండుగే- (వీరిద్దరియాన న్దమును జూచి విద్యుల్లత చిన్తాగ్రస్తురాలై నిలబడియుండును).

తిలో త్తమ:—మనకీబ్రహ్మానందముగలిగించిన దేవునికి మననెనరును దెలువుట సాధ్యమా! కానేకాదు!

విజయుఁడు:—దేవుని మాటయటుండనీ ! ప్రధానకారణమైన వ్యక్తి మనచెంతనే యున్నది. ఇటుతిరిగిచూడుము. (అని తిరిగి విద్యుల్లత నుజూపును.)

తిలో త్తమ.—ఓహోహో ! ఏమివిచిత్రము ! నాముద్దుచెల్లెలు విద్యుల్లత (అని కౌఁగలించుకొని ముద్దులాడి) చెల్లెలా ! కొంతమై మఱచియుంటిఁగాన నిన్నుఁ జూడనైతిని నాభాగ్యమే భాగ్యము. ఆనందముపై నానందము. నీశాపవిమోచన మాయెనుగదా నీభాగ్యమనన్యాదృశము. నాప్రియుని నన్ను మరలఁగూర్చుటకు నీవే కారణ భూతురాలవఁట !

విద్యుల్లత.— నాశాపవిమోచనమునకు నీప్రియుఁడే కారణభూతుఁడు.

తిలో త్తమ.—ఆలాగా ! ఈసంవిధానముయొక్క పూర్వోత్తరములు వెనుకఁ దెలిసికొందునుగాని నీకు పరమోపకారము నాప్రియుఁడు చేసె. అంతటి పరమోపకారము నాకు నీవు చేసినావు కదా ! ఈమహోపకారమునకుఁ దగినప్రత్యుపకారముఁ జేయ నాతరమా !

విద్యుల్లత.—(సిగ్గుతో తలవంచుకొని విజయుని క్రేగంటితో నాజూకుగఁజూచుచు) నీతరమేకాని (కొంతతాళి) మరియెవరితరమునుగాదు. (అని సిగ్గుతోను చింతతోను కన్నెత్తి విజయునిచూచును.)

తిలో త్త:—నాతరమేగాని మరియెవరితరమును గాదా ? చక్కగ బోధపడ లేదే! (అని కొంతసేపాలోచించి విద్యుల్లతా విజయులముఖముల నింపాదిగ రెండుతడవలు చూచి) బాగు! బోధపడెను విద్యుల్లతా! నాభాగ్యములో పాలు నీకును గావలెనా ?



విద్యుల్లత:—(సిగ్గుతో) నే నేమనను ! నావలెనే నీవు నాఁడుదానవేగదా ! (అని తలవంచుకొనును).

తిలో త్తమ:—ఈలాగుచేయుటకష్టమే-(కొంతతాళి) కానీ. ఆలాగే ! నీవు చేసినపరమోపకారమునకు బ్రాణమిచ్చినను చాలదు. ప్రాణసమానుఁడైన నాసామిని నీవును వలచియున్నావు. లలిత నన్ను మించియున్నది. స్వామిభావమేమో ?

విజయుఁడు:—నీయాజ్ఞయే !

తిలో త్తమ:—సరే! లలిత-నేను-విద్యుల్లత. మేము శ్రీభూనీళాదేవులము; మాప్రాణేశుఁడు సాక్షాత్ శ్రీనివాసుఁడు మావంటి నాయికలను మఱికొందఱిను సైతమేలఁదగిన మేటిమగఁడు. ముద్దుసామి! నేనే నాచెల్లెల నీకప్పగించెదను. (అని విద్యుల్లతచేతిని విభునిచేతనుంచి), కాని విద్యుల్లత ! నాయందుఁగాని లలితాదేవియందుఁగాని గంభీర బుద్ధిహీనలగు పడుచులవలె నసూయ నెంతమాత్రముఁ జూపఁగూడదు సుమీ !

విద్యుల్లత:—అక్కయ్యా ! నీయాజ్ఞను అణుమాత్రముఁ గూడదాఁటను, సత్యము. (అని నమస్కరించును.)

ఇద్దరు:—సమస్తసన్మంగళాని సన్తు.

విజయుఁడు:—ప్రియురాలా ! మనయానన్దమునకిఁక నపాయ మేమియు నుండదు. అయిన లలితయు, నీయుత్తమాపులు, మఱి పురజనులందఱును చిన్తాసాగర మగ్నులై యుందురుగదా.

తిలో త్తమ:—ఔనౌనుసామి ! రేపే మనమందఱము మననగరముం జేరుదము.

విజయుఁడు:—ప్రియురాల ! నామనోభీష్టము లన్నియు కొనసాగెనుగాని యొకటిమాత్ర ముండిపోయెను. దానిఁగూడ నీవే యనుగ్రహింపవలెను.

తిలో త్తమ:—ఆజ్ఞాపించుము ప్రాణేశ్వరా !

విజయుఁడు:—నాకు మాత్రము ముగ్గురు నారీరత్నములతో సుఖానందముల ననుభవించుభాగ్యము గలిగెనుగాని. నాయన్నల కేమియు లేదే.

తిలోత్తమ:—వారు మనకు కొంచెముపకారము....

విజయుఁడు:—(అడ్డపడి) ఆమాటనవలదు. ఇఁక నది యేమియు నుండదు.

తిలోత్తమ:—అయిననరి. నాచెలు లిద్దఱున్నారు.

విజయుఁడు:—మఱి యిద్దఱో !

విద్యుల్లత:—మనపినతల్లికూఁతు లిద్దఱున్నారే.

తిలోత్తమ:—అవునవును ! నలుగురికి నలుగురుసరిపోయిరి. సామి ! ఇల్లు గంధర్వ స్త్రీలతో నిండియుండఁ బోవుచున్నది.

విజయుఁడు:—నాభాగ్యమేభాగ్యము.

తిలోత్తమ:—సామి ! నావంటిముగ్ధురా లెవతెయైనంగలదా ? ఈ యానన్దములో మన కుమారరత్నమును బొత్తిగ మఱచినానే.

విజయుఁడు:—ఏమి ! కుమారరత్నమే! కుమారరత్నమే ! ఏమిభాగ్యము! ఎక్కడనతఁడు ?

తిలోత్తమ:—అర్భకుఁడు అన్తఃపురములో నున్నాఁడు. చూతమురమ్ము !

విజయుఁడు:—ఓహోహో ! శృంగారమా ! నీమహిమ యిట్టిదని యెవరు చెప్పఁగలరు ! కాని నాయనుభవమును బట్టి నిన్నుగురించి యొక నిర్వచనముచేసెద.

తిలో:—ప్రాణనాయక! నాకు నీభావ మిపుడుతోఁచెను,కనుక మనమిద్దరము గలసియే యాభావమును విశదము సేయుటబాగని నాకుఁదోఁచెడిని.

విజ:—బాగుగనన్నావు, ఆలాగే.

ఇద్దరు:—

(రాగము, పంతువరాళి.)

రసరాజము శృంగారం
బసలగుసంభోగమైననదియమృతంబే,
ఇసుమంతయుసుఖమియ్యక
విసికించును విప్రలంభవిధిదొడరునెడన్.

(అని నిష్క్రమించుచున్నారు.)

---

# కమలాపహరణము.

## దశమాంకము - ప్రథమస్థలము.

---

విజయునినగరుతోఁజేరిన సింహాద్వారము.

విజయుఁడు, తిలోత్తమ, విద్యుల్లత, మరినలుగురు గంధర్వకన్నియలు ప్రవేశించుచున్నారు.

విజయు:—(స్త్రీల దూరముననుంచి తానుమాత్రము దగ్గరించి) ఎవరోయి యక్కడపారాసిపాయి?.

సిపాయి:—(పెద్దగొంతుతో) ఎవరది యీవేళలో కేకలేశేది?

విజయు:—నారాయణ! ఇట్లురా.

సిపాయి:—(దగ్గరించి విజయునికనుఁగొని పాదములపైఁబడి) ఓ మహా ప్రభూ!యేలినవారిదర్శనములేక యీనగరమంతయు శోకసముద్రంలో మునిఁగియున్నది. మహాప్రభూ ! యెన్నాళ్లాయె మహాప్రభూ (అనిపాదములపైఁబడును.)

విజయు:—ఇక శోకింపనక్కరలేదు, కేకలు వేయక నేను చెప్పునదంతయు చక్కగ బోధపఱుచుకొనుము.

సిపాయి:—చిత్తం చిత్తం, మహాప్రభు !

విజయుఁడు:—మేమందరము సభామంటపములో నుండెదము. మేము వచ్చియున్నామని యెవరికిఁ దెలుపక, కంచుకితోమాత్రము చెప్పి యంతఃపురములో లలితాదేవిని లేపించి, గొప్పవింతఁ జూపించెదమని యిక్కడికిఁ దోడ్కొనిరమ్మను.

సిపాయి:—చిత్తం మహాప్రభూ (అని వేగముగ వెళ్లును.)

విజయుఁడు:—(స్త్రీలతోఁగూడి)మనవింతలన్నియు నేటితోనైన సమాప్తియానా.

తిలోత్తమ:—సమాప్తికాక ఇకమీద నేమియు నుండదు. ఆలాగుండకుండునటుల మనమును సర్వప్రయత్నములు నేయవలయును.

విజయుఁడు:—మనమందర మేకమనస్కులమై యాలాగేచేయింపవలెను. వింతలలో గమ్మత్తులున్నవి గాని, సుఖభావము చాల తక్కువ, మంటపములోఁగూర్చుందమురండు.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

---

## దశమాంకము, ద్వితీయస్థలము.

విజయుని ప్రాసాదములోని సభామంటపము.

విజయుఁడు మొదలగువారు మంటపమునఁ గూర్చుండ లలిత, కంచుకి ప్రవేశించుచున్నారు.

లలిత:—(చాటుగనిలచి) కంచుకి ! ఇదివరకు చాలవింతలు చూచినాము గదా ; ఇపుడు క్రొత్తయేమి చూపఁబోవుచున్నావు ? ఆవింతలఁదలపఁదలప మనసునకు క్లేశమేకలుచుచున్నది. ఈవ్యక్తికి సుఖమికఁగల్గునా.

కంచుకి:—దేవిగారు ! తామిపుడుఁ జూడబోవువింత, ఇదివరకుఁ జూచిన వింతలకువింతగ నుండునదియేగాక, తమకును తమకుటుంబము లోని వారందరికిని శ్రేయోవహమును సంతోషోత్సాహకరముగను, భవిష్యన్మంగళసూచకముగాను నుండును. ఇదిచూచిన తక్షణమే తమకు మాత్రమేకాదు యీనగరవాసు లందరికిని మనఃక్లేశముఁ దొలగిపోయి బ్రహ్మానందముగలుగును.



లలిత:—ఆలాగా, సంతోషమే - నీమాటలు సఫలమౌనుగాత.

కంచుకి:—ఆవింతయిదిగో (అని సభామంటపములో నుండువారిని జూపుచున్నాఁడు)

లలిత:—(విజయుని జూడగానే) హాప్రాణనాథా (అని పరుగెత్తి విజయుని రొమ్ముపై మోమునుంచి, కౌగలించుకొని, గద్గదముతో నేడ్చుచున్నది.)

విజయు:—(చెక్కిలిముద్దాడి, శిరంబుమూర్కొని) ప్రాణనాయకి ! గద్గదమేల, శోకమేల? ఇక సంతోషమేగాని మరేమియు నుండదు. మోమెత్తి ననుజూడు.

లలిత:—(ఆలాగుచేసి) ఇది సుఖమో, దుఃఖమో తోఁచకున్నది. ఏమి జెప్పను నోరురాకున్నది. నాచైతన్యము వింతయైన భ్రమముఁజెందియున్నది, నాసామి! ఇదినిజమేనా లేక నామతిభ్రమయా.

విజ:—నిజమే, నిజమే, నిజమే, వేఱేదియుగాదు. ఎదురుచూడని యమితానందముగల్గునెడ నిట్టియవస్థసహజమే! ప్రాణేశ్వరి ! ఇక నేరీతి చింతయువలదు. నీప్రక్కవచ్చిచేరితిని. ఇకమనకు వియోగ మెన్నఁడును గల్గదు, సత్యం, సత్యం, పునస్సత్యం.

లలిత:—దేవా! నాప్రాణేశ్వరుఁనిచ్చినావు; నీకేమి నేనుజేయగలను; ఏమిలేదు; నాజన్మమిపుడుసఫలమే. సామి! నీవిన్నాళ్లెక్కడనుంటివి, ఇచటనుండి యేలాగువెళ్లిపోయినావు? నిన్నుజూచి యొక యుగమాయెనుగదా ! రాత్రి నాప్రక్కనుండి, యుదయానఁ గనబడకపోతివే.

విజ:—ముద్దియ ! అదియంతయు గొప్పవింత. వెనుక చెప్పెదను గాని, నీవిపుడు గనుగొనవలసినవింతలు మఱికొన్నియున్నవి.

లలిత:—ఏవియవి. (అనినలుప్రక్కలఁ దిరిగిచూడ తిలోత్తమ మొదలగువారు గనఁబడగా) ఓహోహో ! వింతలే వింతలే, (తిలోత్తమను దగ్గరించి చక్కగఁజూచి)సంగీతవిద్వాంసులువీరు, విద్వాంసురాలు అని అనవలెనని నీతో నప్పుడేచెప్పలేదా ?

తిలో:—జ్యోతిష్కులుకదా మీరు. (అనగా నిద్దరు పకపక నవ్వుచు న్నారు) మన మిద్దరము నేకమనస్కులమై యొకపనినిగురించియే పురుషవేషముఁదాల్చి, దేశాటనముఁజేసి, తుదకు నెక్కడమనము గలసిమెలసి యుండవలయునో అక్కడనే ప్రప్రథమమున గలిసి కొంటిమికదా.

లలిత:—బోధపడినది, (అని విజయుని జూచుచున్నది) (జనా) మాటలు భావగర్భములై యున్నవే.

విజయుఁడు:—లలిత! ఈపె తిలోత్తమ, గంధర్వకన్యక, ఈపె తోటలోని కమలమే నీమామగారికి కన్నుల మరలనిచ్చినది.

లలిత:—(ఆమాటలువినగానే తిలోత్తమను కౌఁగిలించుకొని ముఖవికాస ముతోను, సంతోషముతోను, స్నేహభావముతోను) ఎంతగొప్ప మంగళవాహియగు సంగతివింటిని. నేటిదినము అన్నియంశము లలో గొప్ప సుదినము. స్వామిదర్శనముతోకూడ మాకుటుంబ మునకుఁ బరమోపకారియగు నీదర్శనమును లభించెను. ఇట్టి పరమోపకారముఁజేసిన నీకుఁదగిన ప్రత్యుపకారముఁజేయ మా తరమా? నీమంచికోరిక లన్నిటిని భగవంతుఁడు కొనసాగించుఁగాత! నేను జేయదగిన ప్రత్యుపకారము మీప్రార్థనయే. (విద్యుల్లతను జూచి) ఈపెయో.

విజయుఁడు:—ఈపెపేరు విద్యుల్లత.

లలిత:—ఇక్కడనే యానామము సార్థకము. ఆపేరునకు మెరుగుఁబెట్టిన దాయెను. వీరిద్దరును (కొంతతాళి) అప్పసెల్లెండ్రు గాఁబోలు.

తిలోత్తమ:—అవును. మనము ముగ్గురమును అప్పసెల్లెండ్రమే; నీవు మా కక్కయ్యవు; మేమిద్దరము నీకు చెల్లెండ్రము.

లలిత:—(విజయునితో జనాంతికము) సామి! ఈమాటలభావము కొంచె ముకొంచెము బోధపడుచున్నది. అంతేనా.

విజయుఁడు:—(జనాంతికము) నీబుద్ధికి గోచరముకాని దేమియున్నది (ప్రకాశము) నేను తిలోత్తమను గలిసికొన్న వెంటనే పడరాని



యిక్కట్లు తటస్థించినవి. భగవంతుఁడు పరమకారుణికుఁడును భక్తవత్సలుఁడును గనుక నాయిక్కట్లను తొలగించెను. కాని నన్ను మరల తిలోత్తమతోఁ జేర్చినది యీవిద్యుల్లతయే.

లలిత:—ఆమహోపకారమునకుఁ బ్రత్యుపకారము విద్యుల్లతకు తిలోత్తమ యేమిసేసెను?

తిలోత్తమ:—ఆపెను మననాథునిచేతి కప్పగించితిని.

లలిత:—సెబాస్, మొట్టమొదట మిమ్ముందరిం జూచినపుడే యాసంగతి స్ఫురించెను. ప్రాణేశ్వర! నీముఖారవిందమును మరలజూచునంతటి మహోత్సవమును నాకు గలిగించిన వీరిద్దరికిని తగినప్రతి నే నేమి చేయఁగలను?

తిలోత్తమ, విద్యు:—అక్కయ్య! నీకుఁదెలియని యంశ మేమున్నది?

లలిత:—నేనుజేయఁదగినదొక్కటే. (విజయునిచేతులంబట్టి) నాప్రాణనాథు నిమీకప్పగించుటయే. (అని వారిచేతులఁబట్టి విజయుని చేతనుంచు చున్నది.)

తిలోత్తమ, విద్యు:—అక్కయ్య! నీవంటి పరమసాధ్వి లోకములో గల దా, నీకు నీవేసాటి. (అని కౌఁగిలించు కొనుచున్నారు.)

లలిత:—నేటిదినము కడుగొప్పదినము. నాకు బ్రహ్మానందముగనున్నది. (కొంతతాళి) కానిచెల్లెలా! నేనిపుడు చెప్పఁబోవునంశము మాత్ర ము మనమున దృఢముగ నాటించుకొనవలెను. ఉదారబుద్ధిలేని కొందరుపడుచులు, తమనాయకుడు దక్షిణుడగునేని, అసూయఁ దెచ్చిపెట్టుకొని, గృహచ్ఛిద్రము గలిగింతురు. ఈయంశముమాత్ర ము లేకుండవలెను. మనస్వామి మనవంటి నాయికల మఱికొందరిం గూడ సమముగ నేలఁదగినమేటిమగఁడు. కనుక మన కసూయ యను నది సుంతైన నుండకూడదుసుమా.

తిలో, విద్యు:—ప్రియసహోదరి! అట్టితుచ్ఛవృత్తిని మే మెన్నఁడుఁ జేయ ము. సత్యం, సత్యం, సత్యం. నీయాజ్ఞను పిసరైన జవదాటము, (అని చేతులు జోడించి భక్తివిశ్వాసములతో లలిత మోమును జూచెదరు.)

లలి:—నేనిపుడు పరిపూర్ణకామునైతిని. ఈనలుగురో ? (కొంతతాళి) తోటికోడండ్రే నా?

విజయుఁడు:—వీరును గంధర్వ కన్యకలే.

లలిత:—అదిచెప్పనక్కరలేదు. లేనిచో నీయద్భుతసౌందర్య మెట్లుండును?

స్త్రీలందఱు:—మేము గంధర్వకన్యకలమేగాని, నీసౌందర్యమునకు ముందు మాది దీపపు క్రిందిదీపమే.

లలిత:—ఆలాగనుట ధర్మము గాదు, ఏలయన, గంధర్వయనుమాటకే సౌందర్యమనియర్థముగదా. అట్టిసుందరీమణులలో మీరుమణులు. మిమ్ముఁజూచి యందరు సిగ్గు బడవలసినదే. కాని నన్నుఁగూడ నొక మోస్తరందకత్తె యందురు. మీరు కొనియాడఁదగినదానను మాత్రము కాను. అయినను పైవారు కొనియాడుటచే తామానందించుట యందరికి సహజముగాన, మీమాటలు నాకుఁ గడు సంతోషము నిచ్చుచున్నవి. ఈనలుగురిమాటయేమి?

తిలో, విద్యు:—నీవన్నమాటే.

లలి:—(విజయునికౌఁగిలించుకొని) సామి! కులోద్ధారకుడనుమాట నీకే తగును. ఈనరలోకమును సురలోకముగ మార్చివేసినావే. నిన్నుఁ బొగడ నెవరికి శక్యము. ఇవన్నియు బాగే, మనవరకు మన ముత్సాహముతో కాలయాపనము జేయుచున్న, పెద్దలకీయుత్సవముదెలియ వద్దా? అత్తగారును మామగారును శోకార్ణవమగ్నులై యున్నారే! ఎవరక్కడ? కంచుకి! వేత్రవతితోఁజెప్పి అత్తగారు, మామగారు, కుమారులు, మంత్రి, పండితులు అందరిని, యిదివరకుఁ జూడని గొప్పవింతఁ జూడవచ్చునని చెప్పితోడ్కొని రమ్మనవలయును.

కంచుకి:—చిత్తం (అని వెళ్లుచున్నాడు).

విద్యుల్లత, మరినలుగురు:—అక్కయ్యా! వీరందరి దర్శనము ముందే నీవు చేసినావుగదా?

తిలోత్తమ:—చేసినానుగాని యప్పుడు వేషము మారియుండెను. ఇవుడు నన్ను పోల్పఁగలరేమో ?



లలిత.—ఎవరుపోల్చినఁ బోల్చకపోయిన మంత్రి, సర్వానందులు, పోల్చకమానరు. నీవంతర్ధానమైనవెంటనే సంగీతవిద్వాంసురాలను మాటను వారే తెచ్చిపెట్టిరి.

తిలోత్తమ.—ఆలాగా. సంగీతశాస్త్రవిచారము గొంతచేసిరే వారేకాఁబోలు సర్వానందులు.

లలిత.—అవును.

---

(కంచుకి వేత్రవతి యందఱితో బ్రవేశించుచున్నారు.)

భీము, సర్వాం.—వేత్రవతి! ఏమి వింతజూపింపఁబోవుచున్నావు: ఇదివరకుఁ జూచినవిచాలక ?

వేత్ర.—ఈవింత చాలాగొప్పది మహాప్రభు! ఇదిగో యావింత.

విజయుఁడు.—(తండ్రి మొదలగువారింజూచి, యెదుర్కొని) తండ్రీ! తల్లి! తప్పులు క్షమించి, కనికరించి, దీవింపవలెను. (అని పాదములపైఁ బడుచున్నాఁడు.)

ఇద్దఱు.—దీర్ఘాయుష్మాభవ. (అని యెత్తి కౌఁగిలించుకొని యమితానందముతో ముద్దులాడుచు.) కుమారరత్నమా! నీముఖచంద్రదర్శనములేక శోకార్ణవమగ్నులమై యున్నాము! నినుజూడ నిన్నాళ్లకైన కలిగెను; అదేచాలు, మాకిక నేమియు వలదు. మాముద్దుపట్టి! నీవు నిలఁబడినచోటనే తప్పనుమాట యుండదుకదా, నీవద్ద తప్పెక్కడిది ?

విజయుఁడు.—ధన్యోస్మి, అనుగ్రహీతోస్మి.

ఇద్దఱు.—వత్స! రాత్రియుండి యుదయమున గనబడకపోయినావు. ఈయుదయము మరలఁ గనఁబడినావు, ఓయబ్బ! యెన్నాళ్లాయెను! రమారమి సంవత్సరమున్నర కావచ్చుచున్నదే. తండ్రీ! ఏలాగు వెళ్లిపోయినావు. ఇన్నాళ్లెక్కడ నుంటివి, మరల నెట్లువచ్చినావు? ఇదంతయు చిత్రములో చిత్రముగానున్నదే.

విజయుఁడు.—ఇదంతయు చిత్రములో చిత్రమే, కాని పెద్దపురాణము. కొంతతాళి యన్నియు విశదముగ మనవిచేసికొనియెదను. నాతో నిచట మరికొందఱు వచ్చియున్నారు.

భీముఁడు.—ఆలాగా? నిన్ను జూచుటచేత గలిగిన ఆనందముచే మఱివేరే మియుఁ దోచకపోయెను (అని స్త్రీలుండు ప్రక్కఁదిరిగిచూచి ఆనం దాశ్చర్యములతో) ఇదియు బెద్దచిత్రమే,చంద్రసప్తకము సూర్యో దయకాలమునం దుదయించియున్నది. (లలితను జూచి) ప్రథమ చంద్రుఁడు ప్రాఁతవాఁడే, తక్కినచంద్రులాఱుగురిలో మొదటి చంద్రముఖము పరిచితపూర్వమువలెఁ గనఁబడుచున్నది.

మంత్రి, సర్వా.—సంగీతవిద్వాంసులు, మహాప్రభు !

భీముఁడు.—అవునునుండీ. అపుడు మీరు సంగీతవిద్వాంసురాలని యనవ లయు నన్నారుగదా.

విజయుఁడు.—ఈపె యొక గంధర్వకన్యక, తిలోత్తమ యనుపేరుగల ది. శ్రీమహాప్రభువుగారికి దృష్టి మరలనిచ్చిన కమలము ఈపె తోటలోనిదే, ప్రతిదిన మొకకమల మచటఁ గలుగుచున్నది.

భీముఁడు.—ఓహోహో! ఈపెరాక మనకుటుంబమునకు గొప్ప శ్రేయో దాయి. (అని తిలోత్తమా విద్యుల్లతలను శ్రద్ధతోఁ జూచుచు న్నాఁడు.)

విజయుఁడు.—(విద్యుల్లతను జూపి) ఈపె తిలోత్తమచెల్లెలు. ఈమెపేరు విద్యుల్లత. తిలోత్తమను నేను కలిసికొన్నపిదప, దైవదుర్విపాక ముచేత చెప్పగూడనియిక్కట్లు నాకు కలిగెను. వానిలోనుండి తొ లగి, మరల తిలోత్తమను కలిసికొనుటకును, తన్మూలముగ నిచటి కి మరల వచ్చి శ్రీయేలినవారిదర్శనభాగ్యముఁ బొందుటకును, ఈపెయే కారణభూతురాలు.

భీము.—ఆలాగా, వీరిద్దఱు మనకుటుంబమునకేగాదు, మనవంశమునకు ను, నగరమునకును, రాజ్యమునకును, పరమోపకారిణులు. వీరికిఁ బ్రత్యుపకారము-



విజయుఁడు.—(అర్థోక్తిలో) వీరు నాతో కలసి రావలసివచ్చెను. (వారితో) మీరిద్ద రందరికి నమస్కారము సేయుఁడు.

అందఱు:—(వారటులఁ జేయగా) దీర్ఘసుమంగల్యాభూయాస్తం, సమస్త సత్ప్రార్థనాసిద్ధిరస్తు !

విజ:—తల్లీ, తండ్రీ ! బాలిశుని కకుత్కార్తిపనులను క్షమింపవలయును. (అని వారిపాదములమీదఁ బడుచున్నాఁడు.)

ఇద్దఱు:—కుమారరత్నమా ! నీవేమి ! కకుత్కార్తిపనిచేయుటయేమి ! ఇట్టి యనర్ఘములగు కాంతారత్నములను గ్రహించు టెంత మాత్రము కకుత్కార్తిపనికాదు. నీవు చేసినదే వీరు మనకుఁ జేసిన పరమోపకారముకుఁ బ్రత్యుపకారము. పండుజారి పాలలోఁబడి నటులాయెను,అపుడు సంగీతవిద్వాంసులై తిలోత్తమ పాడినపుడు, "ఇటువంటివిభుఁడు నీకెటుల లభించెనే" అని లలితనుగురించియు, "విజయకుమార విజయావతార" అని నిన్నుగురించియు అన్యాప దేశముగఁ బాడెనుగదా, అది యన్వర్థమాయెను. మాకందఱికిఁ బరమానంద మాయెను. ఉత్తమక్షత్రియుఁడు బహువల్లభుఁ డగుట సవ్యమే.

మంత్రి,సర్వా:—కాని శ్రీ యేలినవారు దేవీద్వయముం జేకొనుటచే కొంతబాధ—

భీముఁడు:—(అర్థోక్తిలో) ఆశంకయే నాకుం గొంచెము కలిగెను.

లలిత, తిలో, విద్యు:—మావల్ల నట్టిబాధ పిసరైనఁ గలుగదు. సత్యం ! సత్యం !! సత్యం !!!

అందఱు:—మీరు దేవాంశముగలవారు. ప్రమాణముఁ జేయ నక్కర లేదు. మీమాటే చాలు. మాకందఱికి నమితానందముం గలి గించితిరి.

భీముఁడు:—మరినాలుగు నారీరత్నములు గనఁబడుచున్నవే ! వారిమాట యేమి ?

మంత్రి, సర్వా, ఆత్మా:—అన్నలకు దేవులు గాబోలు.

విజ:—అవును మహాప్రభు! వీరును గంధర్వకన్నియలే.

భీముఁడు:—(ఆశ్చర్యానందములకుఁ బరవశుఁడై స్తబ్ధుఁడై నిలఁబడుచున్నాఁడు)

మంత్రి, సర్వా, ఆప్తా:—కుమార! నీధైర్యస్థైర్యములు, బుద్ధికుశలత, మనోవైశాల్యము, సహనము, శమదమములు, అశ్రుతదృష్టపూర్వములై యున్నవి. నీకు సమానుఁడవు నీవే. వేయేల? ఈలోకములోని యన్నిసద్గుణములు మూర్తీభవించి యీరూపమున నవతరించి యున్నవి, వేరుకాదు.

భీముఁడు:—నే ననవలసినది మీరన్నారు. కుమారుని సౌజన్యము నాలోచించి చూడఁజూడ నాదేహము పరవశమగుచున్నది. నోట మాటలు రాకున్నవి.

విజ:—తామంద రిట్లు నన్నుఁబొగడుట ధర్మముకాదు. నేను చిన్నవాఁడను. నావద్ద నంతగా శ్లాఘనీయగుణ మెద్దియులేదు. ఏదో కొంచె ముండిన నది శ్రీయేలినవారియొక్కయు మీయందఱియొక్కయు కటాక్షమహిమయే.

భీము:—మూర్తి! నీవును నీతమ్ములును చేసినఘాతుకకృత్యమునకు విజయకుమారుఁడు మీకేరీతి ప్రతిచేసినాఁడో, చూచితిరా?

రాగము - శంకరాభరణము.

మేలుఁబదులు నేత మేలుచేసెడువారి
కరిదియెందుసైన నరసిచూడ
కీడెనేయుమీకు ఖేచరభోగంబుఁ
గలుగఁజేయుతమ్ముఁ డిలనుగలఁడె?

మూర్తి, తమ్ములు:—మహాప్రభూ! ఆతుచ్ఛపుబుద్ధి నప్పుడే త్యజించితిమి. తమ్ముఁడు తమ్ముఁడు కాఁడు, మన యిలువేల్పు.

భీము:—పోనిండు, అంతకృతజ్ఞత చూపించుచున్నారుకదా, చాలు. విజయా! నీపిన్నతల్లి యిప్పు డిచ్చట లేకపోయెనుగాని యున్నచో మంచిగమ్మత్తుగా నుండును.



విజ:—వారిదర్శనభాగ్యము నాకిదివరకుఁ గలుగలేదు.

భీము:—రేపువచ్చును చూతువుగాని. మంత్రీ!

మంత్రి:—చిత్తము మహాప్రభూ.

భీము:—క్షత్రియులకు గాంధర్వవివాహము శాస్త్రీయమే. విజయునికి లలితాతిలోత్తమావిద్యుల్లతలతో నట్టివివాహము జరిగియే యున్నది. అయినను మూర్తిమొదలగు నలుగురికి నది జరుగలేదుగదా. కనుక క్షత్రియాగమప్రకారము కుమారు లైదుగురికిని వివాహోత్సవము జరిపింపవలయునని నాయభిమతము. దేవి! ఏమనుచున్నావు.

సర్వం:—నాకు చాలసంతోషము.

భీము:—అందఱకు శ్లాఘనీయమగు నంశమది. కనుక ఆస్థానజ్యోతిష్కులతోఁ జెప్పి మంచిసుముహూర్తము నిశ్చయించి అతిత్వరలో వివాహము జరుగునటుల సన్నాహము చేయవలయును.

మంత్రి:—ఆజ్ఞ.

భీము:—ఈవివాహమహోత్సవము నేలాగు జరిపింపవలయు నన, నిదివరకీ యేబదియారుదేశములలో నేకాలములలోఁగాని, యెక్కడఁగాని, యిట్టివివాహము జరుగలేదని యందఱు నుద్ఘోషించునటుల జరుపవలెను. కుమారులు పండితులు అందఱు కలసి యాలోచించి మిక్కిలి ప్రశస్తముగ జరుపవలెను.

అందఱు:—అలాగే.

భీము:—విజయకుమారుఁడు పుట్టినపుడేరీతిగ నుత్సవాదులు జరిపించిరో దానికంటె సహస్రాంశ మధికముగ జరుపవలయు. ప్రధానాంశము సమారాధన. దానిలో నెంతమాత్రము లోపము కలుగరాదు మనరాజ్యములోని యన్నిజాతులవారికిని వారియాచారము ననుసరించి, చోష్యలేహ్యాచిత్రాన్నభక్ష్యచతుష్కములలో సమృద్ధిగ నొకమాసము జరిపింపవలెను.

మంత్రి:—చిత్తము మహాప్రభు! కాని—

భీము:—ఏల ననుకుచున్నారు? ద్రవ్యవ్రయమనగా మంత్రు లెక్కడను ననుకుట మామూలే. కోశము సంపూర్ణముగ నున్నదే.

విజ:—ఉండకపోయినఁ జింతవలదు. లలితా తిలోత్తమలు నరుదుదురు.

లలి, తిలో:—మంత్రిగారి కేవేళ కెంతకావలయునో యిచ్చుటకు సెలవు మాత్రమే నిరీక్షించుచున్నాము.

భీము:—మంత్రీ ! పండితోత్తములారా ! మనవైభవమువంటి వైభవ మెవరికి గలుగును? విజయుని మహిమచే మననగరు సర్వసామ్రాజ్యలక్ష్మి,ధనలక్ష్మి, విద్యాలక్ష్మి, బుద్ధిలక్ష్మి, ధైర్యలక్ష్మి, వినయలక్ష్మి, సౌజన్యలక్ష్మి. ఈయారు నొక్కకలక్ష్ముల ప్రసన్నతతో వెలయుచున్నది.

మంత్రి, పండి:—విజయకుమారుఁ డన్ననో శ్రీభూనీళాసమేతుఁ డగు సాక్షాత్ శ్రీనివాసుఁడే.

భీము:—కనుక మననగరము శ్రీవైకుంఠమే. నేను పరిపూర్ణకాముఁడనే, కాని యొక్కించుక లోపమున్నది.

విజ:—ఆలోపముసైతము లేదు. మహాప్రభువువారికి పౌత్రరత్నము కలిగియున్నాఁడు.

భీమ, సర్వం, లలిత:—ఏమేమి !!! పౌత్రుఁడే! పౌత్రుఁడే! ఎక్కడ నెక్కడ నారత్నము, ఎందుకు తేలేదు?

విజ:—అర్భకుఁడు, మహాప్రభు ! ఎనిమిదిమాసములవాఁడు, వానియవ్వయుఁ దాతయు వాని వదలి యొకనిమిషమైన నుండ లేరు. ఇద్దఱు కూఁతులే వారికి పిల్లలు, వారిని బంపివేసి, పిల్లవానిఁగూడఁ బంపివేసిన, మేము మాయింట నెటులుందుము. అని చాల చింతించుచున్నారు.

భీమ:—ఆఁడుపిల్లలఁ గన్నవారిగతి యిదియే. మనమే వారిపురమునకు వెడలి, కొన్నాళ్లక్కడనేయుండి, వారిసత్కారముం బొంది, పౌత్రుని ముద్దులాడి, కొంత వారికానందము గలిగింతము.

మంత్రి, పండి:—బాగుగ సెలవిచ్చితిరి. అది కడుబాగు.



భీముడు:— దేవీ, కుమారులారా, మంత్రి, పండితోత్తములార ! ఇక మనము మధురాపురికి నేగ నక్కరలేదు. ఈనగరము లోకములోని యన్నినగరములకంటె నన్నియంశములలోను శ్లాఘ్యతమమై యున్నది. ఇదియునుంగాక,విజయకుమారునికై సకలసామ్రాజ్యసౌభాగ్యసమేతముగ సదాయుండునటుల దేవతావిశేషముచేత నిర్మింపఁబడియున్నది. కనుక విజయనగరమను నామ మీనగరమున కిడి, దీనినే మన రాజధానిగా చేయింపవలయు నని నాయభిమతము. మీ రేమనుచున్నారు?

అందరు:— బాగు, కడుబాగు, అని మేమందర మేకమనస్కులమై యుద్ఘోషించుచున్నారము.

భీముడు:—మంత్రీ! ఈయంశములు మన రాజ్యవాసులందరికిం దెలియునటులఁ బ్రకటింపవలయు.

మంత్రి:—ఆజ్ఞ.

భీము:—ఇట్టి యనన్యసాధారణమగు మహాద్దశను మనకు దయచేయించిన శ్రీమన్నారాయణమూర్తికి మననెనరుఁజూపునటుల నందఱ మేకమనస్కులమై కలసి స్తుతించి, వెనుక మంగళముం బాడెదము రండు.

రాగము, ఉశేని - తాళము, చాపు.

పల్లవి.— నిన్నేనమ్మితి కేశవ, మాధవ, నిన్నేనమ్మితి కేశవా !

అను.— నిన్నేనమ్మితిసదా, నిఖిలలోకాధార,
ముప్పిటికన్నియమోహనాకార, మారమార, వీరవీర
ధూరీకృతభక్తదురితాంధకారా! నిన్నేనమ్మితి.

చరణము.—సనకసనందన, శక్రశతానంద, సన్నుతసన్నామ,
జనక, పరాశర, ప్రహ్లాదాది, యమి జనజయకరధామ,
కనకకశిపుముఖ కువలయామయ, శాంతి కరణద్వాదశాత్మ,
దినకరకులచంద్ర, దీనదయాళు, స

జనగణపాలక, జానకీరమణ, రిక్తభరణ, ముక్తశరణ,
భక్తశ్రీనివాస భవబాధాహరణా !! నిన్నే నమ్మితి.

రాగము సురటి. తాళము ఆది.

పల్లవి.—మంగళం జయ మంగళం, భవతు తే, మంగళం శుభమంగళం

అను.— అంగజజనక, రథాంగశంఖధర, గంగాధరసఖ, గరుడతురంగ
అరుణాబ్జనేత్ర, కరుణాసాంద్ర, శరణాగతగీర్వాణబృంద! మంగ.

చరణం.—బృందావనలోల, విబుధానందకరశీల, గో
విందగోపాలకృష్ణ నందగోపబాల
ఇందిరాధరా నీళానాయక
ఇనవంశకీర్తిదాయకసాయక
సుందరాంగ సూర్యమధ్యవాస
సుకృతస్వరూప శ్రీనివాస! మంగళం.

(అని యందఱు నిష్క్రమించుచున్నారు.)

---





చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1921.

